సంపుటి : 9
సంచిక : 4
పుటలు : 52
రు. 25లు
ISSN NO:
2582-8738
యు.జి.సి. గుర్తింపు పొందినది



తెలుగుజాతి పత్రిక

# అమ్మనుడి

నుడి నాడు నెనరు
జూన్ 2023

## రెండు తెలుగు రాష్ట్రాలలో పరిపాలన తెలుగులో జరగాలి ఉద్యమానికి జనచైతన్యసభల శ్రీకారం

విజయవాడ,మే 14




హైదరాబాద్,మే 28




తెనాలి, మే 27




నెల్లూరు, మే 29




### నిక్కచ్చులు (డిమాండ్స్)

- తెలుగు రాష్ట్రాల్లో ప్రతి ప్రభుత్వ ఉత్తర్వు (జి.ఒ) తెలుగులో రావాలి
- తెలుగు రాష్ట్రాల్లో అన్ని స్థాయిల్లో పాలన తెలుగులో జరగాలి
- జిల్లా న్యాయస్థానాల వరకు కోర్టుతీర్పులు ప్రజలభాషలో ఇవ్వాలి
- కేంద్ర చట్టసభల్లో తెలుగు రాష్ట్రాల సభ్యులు తెలుగులోనే మాట్లాడాలి
- తెలుగు రాష్ట్రాలలో సభ్యులు చట్టసభల్లో ఇంగ్లీషులో ప్రతిపాదనలను తిరస్కరించాలి.

**అధికారభాష ఉండగా పరభాషలో వ్యవహరించడం ప్రజల్ని అవమానించడమే.**

**అభాసుపాలవుతున్న అధికార భాషా సంఘం**

# తెలుగుజాతి వైతాళికుడు
# కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావుగారి శత వర్ధంతి
## (1875-1923)

# ఆహ్వానం



జీవితంలో అనుక్షణం పరిశోధనే ప్రాణంగా, భాషాచరిత్ర, సాహిత్యాలను మథించి, సజాతీయ విజాతీయ భాషా సాహిత్యాల లోతులను చూసి, సాదృశ్య వైదృశ్యాలను సమ్యక్ దృష్టితో తెలుగుజాతికి అందించిన, తెలుగువారిని ఆధునికయుగం వైపు నడిపించిన మహనీయుడు, తెలుగువారు విస్మరించిన వైతాళికుడు కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావు గారు (1875–1923).

చరిత్ర, శాసన పరిశోధనను మల్లపల్లి సోమశేఖరశర్మ, చిలుకూరి వీరభద్రరావు వంటి తొలితరం చరిత్రకారులకు నేర్పడం, 'శివతత్వసారం' వంటి తొలి తెలుగు శతకాన్ని పరిష్కరించి, ప్రచురించి ప్రాచీన గ్రంథపరిష్కరణలో కొత్తబాటలు వేయడం, తెలుగులో విజ్ఞానసర్వస్వ నిర్మాణానికి పూనుకొని స్వీయ మార్గంలో కొత్తబాటలు వేయడం, 'విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి'ని స్థాపించి చరిత్ర, వైజ్ఞానిక శాస్త్రాలను అందించి తెలుగువారిని జాగృతపరిచారు. ఆయన జీవిత చరమాంకంలో 1922లో అనారోగ్యంగా వుండికూడా 'తెలుగుభాషాతత్వం' (తెలుగు ఫిలాసఫీ) అను ప్రామాణిక గ్రంథాన్ని తెలుగుజాతికి ఇచ్చారు. తెలుగుభాషా చరిత్రలోనే ఇదొక విశిష్టాంశం. తన నలబైఆరు సంవత్సరాల జీవితాన్ని సార్థకం చేసుకొని తెలుగు సమాజంపై చెరిగిపోని ముద్రవేసిన మహనీయుడు, జాతి వైతాళికుడు మరణించి 13జులై 2023 నాటికి వంద సంవత్సరాలు.

కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావు గారిని స్మరించుకొంటూ వారు దివాన్‌గా పనిచేసిన మునగాల రాజా నాయుని వేంకట రంగారావుగారి కోటలో లక్ష్మణరావుగారి 100వ వర్ధంతి సంస్మరణ సభను నిర్వహించుకొందాం.

ఈ సందర్భంగా ఒక సంస్మరణ సంచికను ఆరోజున విడుదలచేయదలచాం. ఇందులో ప్రచురించుటకు తగిన వ్యాసాలను పంపవలసినదిగా అందరినీ కోరుతున్నాము.

13 జులై 2023న జరుగబోయే శతవర్థంతి కార్యక్రమానికి ఆసక్తిగల వారందరూ ఆహ్వానితులే. ఆరోజున సంస్మరణ సంచికతోపాటు ఇప్పుడు లభించని రెండు మూడు విలువైన లక్ష్మణరావుగారి రచనలను కూడా పునర్ముద్రించి విడుదల చేయడానికి ప్రయత్నిస్తున్నాము.

మునగాలలో జులై 13న జరుగబోయే కార్యక్రమ వివరాలను త్వరలో విడుదల చేయగలము.జులై 1న విడుదయ్యే 'అమ్మనుడి' సంచికలో కూడా ప్రచురించగలం. అన్ని వివరాలకు శ్రీ కె.జితేంద్రబాబు, అధ్యక్షులు, కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావు సాహితీ సాంస్కృతిక సమాఖ్య, మునగాల – 508 233, ఫోన్: 9848882600ను సంప్రతించవచ్చును.

కె.జితేంద్రబాబు. అధ్యక్షులు
కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావు సాహితీ సాంస్కృతిక సమాఖ్య
మునగాల – 9848882600

---

**తెలుగు భాషోద్యమ సమాఖ్య, అమ్మనుడి సౌజన్యంతో**

VPVMO1A103

తెలుగుజాతి పత్రిక

# అమ్మనుడి

సంపాదకుడు : డా॥ సామల రమేష్‌బాబు 9848016136

తోడ్పాటు : డా॥ గారపాటి ఉమామహేశ్వరరావు, డా॥ వెన్నిసెట్టి సింగారావు, డా॥ సుందర్ కొంపల్లి, రహ్మానుద్దీన్ షేక్, సరస్వతుల రామనరసింహం(సరసి), తమ్మా శ్రీనివాసరెడ్డి

జూన్ 2023

◆ తెలుగు అభివృద్ధి, సాధికారతల కోసం...

◆ తెలుగు భాషోద్యమ నిర్మాణం కోసం...

◆ ఆంధ్ర, తెలంగాణ, ఇతర రాష్ట్రాలు, విదేశాల్లోనూ ఉన్న తెలుగువారి కోసం...



## రచయితలకు సూచనలు

తెలుగు భాష, సాహిత్యం,సాంస్కృతికతలతో పాటు తెలుగువారి చరిత్రకూ, సంస్కృతికీ, సాధికారతకూ, ప్రగతికీ చెందిన సామాజిక, ఆర్థిక, రాజకీయ అంశాలపై రచనలకు స్వాగతం. రచనలను వ్యాసం, కథ, వచన కవిత, పాట - ఏ రూపంలోనైనా పంపవచ్చు.

1. వ్యాసాలు, కథలు ముద్రణలో 1 నుండి 3 పుటలకు మించకూడదు. కవితలు 20 నుంచి 30 పంక్తులకు మించకూడదు. విమర్శలు విషయం పైనే ఉండాలి. వ్యక్తులపై గురిపెట్టి చేయరాదు. సరళమైన తెలుగులో వ్రాయాలి.

2. రచనలను యూనికోడ్‌లో గాని, అనుఫాంట్స్‌లో గాని టైప్ చేసి పి.డి.ఎఫ్ మరియు పి.ఎం.డి. రెండింటిలోనూ పంపాలి. లేదా ఎ4 సైజు కాగితంపై వ్రాసి, స్కాన్‌చేసి editorammanudi@gmail. com కు పంపాలి. కొరియర్ / రిజిష్టర్డ్ / సాధారణ పోస్టులో కూడా పంపవచ్చు.

3. రచనతో పాటు పోస్టల్ చిరునామా, ఫోన్ నంబరు, ఉంటే ఇ-మెయిల్ చిరునామా కూడా ఇవ్వాలి. ఈ వివరాలు లేని రచనల్ని తీసుకోలేము.

**4. హామీపత్రం తప్పనిసరి: రచన సొంతమేనని, ఇతర పత్రికలకుగాని, ఇంటర్నెట్ పత్రికలకుగాని పంపలేదని, ఇంతవరకు ఎక్కడా ప్రచురణ కాలేదని హామీ పత్రాన్ని తప్పనిసరిగ రచనతో జోడించాలి. హామీ పత్రంలేని రచనలను, ముందుగా సామాజిక మాధ్యమాల్లో పెట్టిన రచనలను ప్రచురణకు స్వీకరించలేము.**

**5.దయచేసి ప్రచురణ కోసం పంపే రచనలను, వార్తలను ప్రతి నెల 15వ తేదీలోపుగా మాకు చేరునట్లు పంపండి. 20వ తేదీ దాటిన తరువాత చేరే వాటిని వెంటనే పరిశీలించడం వీలుకాదు. వ్యాసాలను ప్రచురించడానికి కనీసం 1-2 నెలల వ్యవధి పట్టవచ్చు.**

## లోపలి పుటలలో....


| | | | |
|---|---|---|---|
| ముఖ్యమంత్రిగారికి వినతి | ........................ | గుంటుపల్లి శ్రీనివాస్ | 05 |
| సంపాదక హృదయం | అభాసుపాలవుతున్న.. | సామల రమేష్‌బాబు | 07 |
| విజయవాడ జన చైతన్య సభ | విజయవాడ, | ..................... | 09 |
| బహిరంగ లేఖ | ........................ | ..................... | 16 |
| హైదరాబాద్ జన చైతన్య సభ | ........................ | ..................... | 17 |
| నెల్లూరు జన చైతన్య సభ | ........................ | ..................... | 18 |
| తెనాలి జన చైతన్య సభ | ........................ | ..................... | 19 |
| కొమఱ్ఱాజులక్ష్మణరావు | తెలుగు భాషాతత్వము | బూదరాజు రాధాకృష్ణ | 20 |
| శ్రద్ధాంజలి | ఆచార్య రవ్వా శ్రీహరి | పులికొండ సుబ్బాచారి | 23 |
| బంగోరె ముందు మాటలు | చంద్రిక కథ..... | సన్నిదానం నరసింహశర్మ | 27 |
| భాషా సాంకేతికత | ప్రాంతీయ భాషల్లో,.... | కందగట్ల శ్రవణ్‌కుమార్ | 31 |
| అమ్మ భాష | స్థానిక పదజాలమే... | సడ్లపల్లె చిదంబర రెడ్డి | 33 |
| శతకాలు | కోనసీమ శతకాలు | గాడి సత్తిబాబు | 34 |
| సంస్కృతి | బంజారా యువతుల.... | రాగ్యానాయక్ ఆదావతు | 37 |
| శ్రద్ధాంజలి | బలీయమైన.... | కలిమిశ్రీ | 40 |
| జనవాణి | తెలుగును బతికించుకుందాం.. | వై.ఆనందనాయుడు | 41 |
| వెలిసిపోతున్న పదాలు | ధగిడి సమ్మె | జి.వి.పూర్ణచందు | 43 |
| శ్రద్ధాంజలి | కేతు విశ్వనాథరెడ్డి. | పెనుగొండ లక్ష్మీనారాయణ | 44 |
| ధారావాహిక | ఆధిపత్యం చెలాయించే | పి.శివరామకృష్ణ 'శక్తి' | 46 |
| | బాల సాహిత్యం- భాష | టి.వి.రామకృష్ణ | 49 |
| కవితలు | అమ్మభాషకు ఏటికోళ్ళు | వల్లభాపురం జనార్దన | 39 |


కార్టూన్లు: సరసి

కంప్యూటర్: యన్.రాజారావు

ammanudi.org వలగూటిలో అమ్మనుడి పాత సంచికలను చదువగలరు

రచనలను, వార్తలను, వాట్స్‌యాప్‌లో పంపవద్దు: 'అమ్మనుడి'లో ప్రచురణకై వార్తలు, ఫోటోలు, రచనలను కొందరు వాట్స్‌యాప్(WhatsApp) లో పంపుతున్నారు. వాటిని ప్రచురణకు స్వీకరించలేము. దయచేసి కొరియర్‌లో / రిజిస్టర్డ్ పోస్టులో, లేదా **editorammanudi@gmail.com** కు పంపించండి. - సంపాదకుడు

రచనలు, ఉత్తరాలు పంపుటకు చిరునామా:

సంపాదకుడు: **అమ్మనుడి**, జి-2, శ్రీ వాయుపుత్ర రెసిడెన్సీ, హిందీ కళాశాల వీధి, మాచవరం,విజయవాడ-520004.

సంపాదకుడు : 9848016136 *e-mail* : editorammanudi@gmail.com




తెలుగుజాతి పత్రిక

# అమ్మనుడి

నుడి నాడు నెనరు మాసపత్రిక





చందా వివరాలు: జీవిత చందా: రూ.5000

4 సం॥: రూ.1000, 1 సం॥ :రూ.300

ఎం.ఓ. లేదా తెనాలిలో చెల్లునట్లు బ్యాంకు చెక్కు లేదా డి.డి.ని **'తెలుగుజాతి'** పేర పంపాలి.

## బ్యాంక్‌ఖాతా, ఫోను వివరాలు

ఆన్‌లైన్ ద్వారా చందాను పంపేవారు NEFT / RTGS ద్వారా **'తెలుగుజాతి'**-యాక్సిస్ బ్యాంకు, తెనాలి శాఖకు పంపాలి.

**TELUGU JAATHI - AXIS BANK, TENALI**

అకౌంట్ నెం. **914020020387880**

**IFSC Code : UTIB0000556**

**Telugu Jaathi**

**+91 94929 80244**



ఈ QRకోడ్‌ను స్కాన్ చేసి లేదా QRకోడ్ క్రింద ఇచ్చిన యుపిఐ ఐడి నెంబరుకు మీరు విరాళాలు, చందాలు పంపవచ్చును.

**9492980244@okbizaxis**

ఆన్‌లైన్‌లో చందాను పంపేవారు వెంటనే ఇంటినెంబరు, వీధి పేరు, పోస్టాఫీసు, ఊరిపేరు, పిన్‌కోడ్ నెంబరుతో సహా తమపూర్తి చిరునామాను, ఫోన్‌నెంబరు, మెయిల్‌ఐడి తదితర వివరాలను జాబు ద్వారా తెలుపగలరు.

**94404 48244** లేదా **94929 80244** ఫోన్‌కు సందేశం గాని, వాట్స్‌యాప్ ద్వారా గాని తెలుపగలరు.

<u>చందాలు పంపడం, దానికి సంబంధించిన ఉత్తరప్రత్యుత్తరాలకు చిరునామా</u>


**డా॥ సామల లక్ష్మణబాబు**, ప్రచురణకర్త, 'అమ్మనుడి'
8-386, జీవక భవనం, అంగలకుదురు పోస్టు, **తెనాలి,**
గుంటూరు జిల్లా - 522 211.
ఫోన్ : 94404 48244, 94929 80244,
ఇ-మెయిల్ : ammanudi2015@gmail.com


## చందాదారులకు సూచనలు

1. చందా కాలం, ముగింపు తేదీ- పత్రిక కవరుమీద మీచిరునామా పై భాగంలోనే ఉంటుంది. గమనించండి.
2. చందా కాలం ముగిసిపోయిన తర్వాత పత్రిక పంపబడదు. దయచేసి వెంటనే చందా పైకం పంపి, చందాను కొనసాగించుకోగోరుతున్నాము.
3. చందా పూర్తయ్యేందుకు ఒక నెల ముందే దయచేసి మీ చందాను పంపించండి.
4. మీ ఇంటి నెంబరుతో సహా పూర్తి చిరునామాను, పిన్‌కోడ్ నెంబరుతో సహా తెలియపరచాలి. మీ ఫోన్ నెంబరును, వుంటే మీ మెయిల్ ఐడి ని తెలుపండి.
5. మీ చిరునామా మారినట్లయితే దయచేసి వెంటనే తెలియజేయండి.
6. 'అమ్మనుడి' పత్రికను చందాదారులకు మాత్రమే పోస్టులో పంపించగలము. బయట ఎక్కడా అంగళ్లలో అమ్మకమునకు పెట్టడంలేదు. కనుక కావలసినవారు దయచేసి చందాదారులుగా చేరవలసిందిగా కోరుతున్నాము. చందాదారులు కోరినట్లయితే ఆన్‌లైన్‌లో కూడా పత్రికను పంపగలము. మీ ఇ-మెయిల్ ఐడిని తప్పక తెలియజేయండి.

<u>గమనిక</u>

పత్రికకు చందాదారులుగా చేరినవారి రచనలను తప్పనిసరిగా ప్రచురిస్తామనే హామీ ఏమీలేదు. ఏ రచనలను ప్రచురించాలో ఎంపిక చేసే బాధ్యత కేవలం పత్రిక సంపాదకుడిదే. దయచేసి ఎవ్వరూ వత్తిడి తేవద్దు. -ప్రచురణకర్త

## ప్రోత్సాహకులుగా చేరండి

రు. 10,000/-లు, ఆపైన- విరాళంగా పంపి, 'తెలుగుజాతి ట్రస్టు'కు ప్రోత్సాహకులుగా మాతో చేరి సహకరించగోరుతున్నాము. అట్టి 'ప్రోత్సాహకులకు' పత్రికను శాశ్వతంగా పంపుతూ, ట్రస్టు ప్రచురించే ఇతర పుస్తకాలను కూడా వారికి సాదరంగా పంపగలము. దయచేసి మీరు ప్రోత్సాహకులుగా చేరి మా కృషికి తోడ్పడగోరుతున్నాము.

**తెలుగుజాతి (ట్రస్టు) ప్రచురణ**

# ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి గౌరవనీయులైన శ్రీ జగన్ మోహన్ రెడ్డి గారికి వినతి పత్రం

అయ్యా !

12/05/2023న కావలిలో జరిగిన బహిరంగసభలో అందరూ ఇంగ్లీష్‌లో మాట్లాడాలన్న ఉదాత్తమైన లక్ష్యాన్ని ప్రకటించారు. రాబోయే 15-20 సంవత్సరాలలో డ్రైవర్ ఉద్యోగానికి కూడా ఇంగ్లీష్‌లో మాట్లాడతారు అని చెప్పారు.

ఈ రాష్ట్రంలో అందరూ ఇంగ్లీష్ లో మాట్లాడాలి అన్న మీ లక్ష్యం నెరవేరుతుందా? కనీసం దరిదాపులలో అయినా నెరవేరే అవకాశం ఉందా? అన్న అంశం పై సునిశితమైన పరిశీలన అవసరం... మరియు అందుకు అనుగుణంగా లక్ష్యం చేరాలంటే మార్గం ఏమిటో ఆలోచించాలి.

ప్రభుత్వ బడులలో తెలుగు మీడియంను పూర్తిగా రద్దుచేసి, ఇంగ్లీష్ మీడియంను నిర్బంధం చేయటం చట్టవ్యతిరేకమని ఆంధ్రప్రదేశ్ హైకోర్టు తీర్పునిచ్చింది. ఆ కేసు ఇప్పుడు సుప్రీం కోర్టులో ఉంది. హైకోర్టు తీర్పుకు వ్యతిరేకంగా, ప్రభుత్వం.. ప్రభుత్వ బడులలో 2020-21 అకడమిక్ సంవత్సరం నుండి తెలుగు మీడియంను రద్దు చేసి, నిర్బంధ ఇంగ్లీష్ మీడియంను అమలు జరుపుతుంది. అనగా ఇప్పటికి మూడు సంవత్సరాల నుండి నిర్బంధ ఇంగ్లీష్ మీడియం అమలు జరుపుతున్నారు.

విద్యార్థుల వాస్తవ సామర్థ్యాలు తెలుసుకోవడం కోసం రాష్ట్ర ప్రభుత్వం ... ప్రభుత్వ బడులలో 'బేస్ లైన్' పరీక్షను నిర్వహించింది. గడచిన 25 సంవత్సరాలలో విద్యాశాఖ పారదర్శకంగా , నిజాయితీగా నిర్వహించిన పరీక్ష ఇదే! ప్రభుత్వ బడులలో నిర్బంధ ఇంగ్లీష్ మీడియం లో 4వ తరగతి నుండి 10 వ తరగతి వరకు చదువుతున్న విద్యార్థులలో 17,05,293 ( 65.4%) మందికి I like reading , this is my house లాంటి సులభమైన ఇంగ్లీష్ వాక్యాలు కూడా చదవడం రాదని బేస్ లైన్ పరీక్షలో తేలింది.

2023 ఏప్రిల్‌లో పది పబ్లిక్‌పరీక్షలు వ్రాసిన ప్రభుత్వ స్కూళ్ళలోని విద్యార్థులలో 1,55,167 మందికి పైన తెలిపిన మూడు పదాల ఇంగ్లీష్ వాక్యాలు కూడా చదవడం రాదు. నిజానికి ప్రైవేట్ బడులలో కూడా ఇటువంటి విద్యార్థులు పెద్ద సంఖ్యలోనే ఉంటారు (ప్రైవేట్ బడులలో 'బేస్ లైన్' పరీక్ష నిర్వహించలేదు కాబట్టి అక్కడి విద్యార్థుల వాస్తవస్థితి తెలియదు). అయినా పది ఫలితాల్లో ఎప్పటిలాగే గడచిన 25 సంవత్సరాల పరంపరలో భాగంగా మరోసారి అద్భుతం ఆవిష్కరించబడింది.... అది 98.15% మంది విద్యార్థులు ఇంగ్లీష్‌లో ఉత్తీర్ణత సాధించారు. ఇంగ్లీష్‌లో మూడు పదాలు మాత్రమే ఉన్న అత్యంత సులువైన చిన్నవాక్యం కూడా చదవడం రాని విద్యార్థులు... లక్షలాది మంది పదో తరగతి పరీక్షల్లో ఉత్తీర్ణులయ్యారు.

**ఎప్పుడూ మోసపోతున్నది ... తల్లిదండ్రులు - సమాజమే :**

గురజాడ అప్పారావు గారు వ్రాసిన కన్యాశుల్కం నాటకంలో వెంకటేశం ( విద్యార్థి) చదువు ఎలా సాగుతుందో తెలుసుకోవటానికి ... గిరీశం మాస్టారిని మరియు వెంకటేశం తన ముందు ఒక్కసారి ఇంగ్లీష్‌లో సంభాషించుకోమని తల్లి అడుగగా.... అప్పుడు జిత్తులమారి గిరీశం మాస్టారు ట్వింకిల్ ట్వింకిల్ లిటిల్ స్టార్ మొదలుపెడితే ...



గురువుగారి అడుగుజాడల్లోనే వెంకటేశం బట్టీపట్టిన కొన్ని ఇంగ్లీష్ వాక్యాలు there is a white man...... అంటూ మాట్లాడటం .... దీనంతటినీ చూసి వాళ్ళ అమ్మ మురిసిపోవడం, అప్పుడు తండ్రి అగ్నిహోత్రావధానులు ఆ ఇంగ్లీష్ సంభాషణకు అర్థం ఏమిటి అని అడుగగా వేసవిసెలవుల్లో ఎలా చదువుకోవాలో మాట్లాడుకున్నాము ' అని అబద్ధమాడతాడు గిరీశం మాస్టారు.

గురజాడ వారి నాటకంలో గిరీశం - విద్యార్థి వెంకటేశం కలిసి తల్లిదండ్రులను బురిడీ కొట్టిస్తే 'ఆంధ్రప్రదేశ్‌లో' ఉపాధ్యాయ వర్గం, అధికారులు, ప్రజలచేత ఎన్నుకోబడిన నాయకులు అందరూ కలిసి తల్లిదండ్రులను, సమాజాన్ని మోసం చేస్తున్నారు'. ఇదంతా తెలిసి మేధావులు మౌనం వహిస్తూ తల్లిదండ్రులను, సమాజాన్ని వంచిస్తున్నారు.

ప్రస్తుతం విద్యార్థుల చదువు వాస్తవస్థితి బాగా ఆందోళనకరంగాను, అధమంగాను ఉంది. మరి ఈ స్థితి నుండి మెరుగుపడి...అందరూ ఇంగ్లీష్‌లో మాట్లాడాలంటే ఏమి చెయ్యాలి?

బడి నిర్వహణలో పారదర్శకత, జవాబుదారీతనం, భాషా బోధనలో - భాషా పరీక్షల విధానంలో ఆధునిక పద్ధతులు, పరీక్షల నిర్వహణలో పారదర్శకత, మూల్యాంకనంలో పారదర్శకత అనే సంస్కరణలు తీసుకురావడం ఏ రాజకీయనాయకులకూ పట్టదు. దీనికితోడు బడిలో బోధనా మాధ్యమం అనేది పిల్లవాడు నేర్చుకునే స్వభావాన్ని బట్టి, అభ్యసనా ప్రతిఫలాల (learning outcomes) ను బట్టి శాస్త్రీయ పరిశోధనలు ఆధారంగా విధాన నిర్ణయం చేయాల్సిఉండగా, అది ఓట్ల రాజకీయంలోకి మారి... పిల్లల చదువు కొండెక్కింది. పిల్లల మానసిక ఎదుగుదలకు మాధ్యమానికి గల సంబంధం గురించి ఆలోచించే వివేచనను పక్కన పెట్టడం, వారికి ఇంగ్లీష్ మీడియంలో పాఠాలు బాగా అర్థం అవుతున్నాయా లేదా అన్నది ఎవ్వరికీ అవసరం లేని , పట్టని విషయంగా మారిపోయింది.

విద్యావ్యవస్థ లో అత్యంత ముఖ్యమైన సంస్కరణలు వదిలేసి ... గడచిన మూడు సంవత్సరాలుగా తెలుగు మీడియం ను పూర్తిగా రద్దు చేసి, నిర్బంధ ఇంగ్లీష్ మీడియంలో పాఠాలు చెప్తున్నా కూడా కనీసం ఇంగ్లీష్ వాక్యం చదవడంరాని బడిపిల్లలు 17 లక్షల పైగా ఉన్నప్పుడు ప్రస్తుత బోధనా విధానంలో అయితే మీ లక్ష్యం నెరవేరదు. మరి ఏమి చెయ్యాలి ??

**నాలుకపై ఇంగ్లీష్ బీజాక్షరాలు వ్రాయటం ఒక్కటే మార్గం :**

అలనాడు నిరక్షరాస్యుడు అయిన కాళిదాసు నాలుకపై కాళికాదేవి బీజాక్షరాలు వ్రాయగానే ... ఆయన సంస్కృతంలో మహాకవి అయ్యారని చెప్తారు. అలాగే ఇప్పుడు అటువంటి అతీంద్రియశక్తులు ఉన్న ఉపాధ్యాయులు ఉంటే తప్ప ఇన్ని లక్షల మందిని ఇంగ్లీషులో మాట్లాడించడం సాధ్యం కాదు.

కాశీ విశ్వవిద్యాలయంలో ఈ మధ్యనే వారు తాంత్రిక విద్యలో డిగ్రీ కోర్సు ప్రవేశ పెట్టారు.!! కావున మన పాఠశాల విద్యా శాఖ కాశీ విశ్వవిద్యాలయంతో ఒడంబడికను కుదుర్చుకొని .... ఎండాకాలం సెలవుల్లో ఖాళీగాఉన్న ఉపాధ్యాయులకు మంత్ర-తంత్ర విద్యలలో ప్రత్యేక శిక్షణ ఇవ్వాలి

అప్పుడు ఉపాధ్యాయులు బడులు తెరవగానే తమ మంత్ర తంత్ర అతీంద్రియ శక్తులతో పిల్లల నాలుకలపై ఇంగ్లీష్ బీజాక్షరాలు వ్రాస్తే, షేక్స్పియర్ లాగానో, మైకేల్ మధుసూదన్ దత్తు లాగానో గొప్ప రచనలు చేస్తూ, అనర్గళంగా ఇంగ్లీష్‌లో మాట్లాడతారు. కావున ఉపాధ్యాయులకు ఈ వేసవికాలంలో విద్యార్థుల నాలుకలపై ఇంగ్లీష్ బీజాక్షరాలు వ్రాసే తాంత్రిక అతీంద్రియ శక్తులలో శిక్షణ ఇవ్వాల్సిందిగా వేడుకుంటున్నాను.

డాక్టర్ గుంటుపల్లి శ్రీనివాస్
13/05/2023.



సంపుటి : 9 సంచిక : 4
అమ్మనుడి
జూన్ 2023

సంపాదకీయం

# అభాసుపాలవుతున్న అధికారభాషా సంఘం

**1966లో** 9వ చట్టంగా 'ఆంధ్రప్రదేశ్ అధికార భాషా చట్టం వచ్చింది. నాటి రాష్ట్రం రెండుగా విడిపోయినా, రెండు తెలుగు రాష్ట్రాలకూ ఈ చట్టమే వర్తిస్తుంది.

ఈ చట్టంలో 5వ అంశం- అధికార భాషా సంఘం ఏర్పాటుకు సంబంధించినది. దానిలో ఈ క్రింది విధంగా పేర్కొన్నారు.

5. అధికార భాషా సంఘము :- (1) ఈ చట్టపు ప్రారంభమునుండి అయిదు సంవత్సరములు గడచిన మీదట రాష్ట్ర ప్రభుత్వము ఉత్తరువుద్వారా ఒక రాష్ట్ర అధికారభాషా సంఘమును ఏర్పాటు చేయవలెను. అందులో ఒక అధ్యక్షుడు, నలుగురు ఇతరసభ్యులు వుండవలెను, వారిని రాష్ట్ర ప్రభుత్వము నియమించును, సంఘము అనుసరించవలసిన కార్య విధానమును ఆ ఉత్తరువు నిర్వచించవలెను.

(2) రాష్ట్ర అధికార కార్యములకు తెలుగు భాషను ఉపయోగించుటలో సాధించిన ప్రగతిని సమీక్షించుట, ఈ క్రింది వాటిని గురించి రాష్ట్ర ప్రభుత్వమునకు సిఫార్సు చేయుట, సంఘము యొక్క కర్తవ్యమై ఉండవలెను:

(ఏ) రాష్ట్ర అధికార కార్యములకు తెలుగు భాషను క్రమాధికముగా ఉపయోగించుట:

(బి) రాష్ట్ర అధికార కార్యములన్నింటికి లేదా అందు వేటికైన ఆంగ్లభాష ఉపయోగముపై నిర్బంధములు

(సి) తెలుగు భాష ఉపయోగమునకు సంబంధించి రాష్ట్ర ప్రభుత్వము సంఘమునకు నిర్దేశించిన ఏదైనా ఇతర విషయము.

(3) సంఘము (2) వ ఉప విభాగములో తెలిపిన విషయములపై తన సిఫార్సులతో పాటు రాష్ట్ర ప్రభుత్వమునకొక నివేదికను సమర్పించవలెను. రాష్ట్ర ప్రభుత్వము నివేదికను రాష్ట్ర శాసనమండలి ప్రతిసభ సమక్షమందు ఉంచుటకు ఏర్పాటు చేయవలెను.

(4) సంఘము అట్లు సమర్పించిన నివేదికలో చేసిన సిఫార్సులను పరిశీలించిన మీదట రాష్ట్ర ప్రభుత్వం ఆ నివేదిక అంతటికి లేక అందలి ఏదేని భాగమునకు అనుగుణముగా ఆదేశములు జారీ చేయవచ్చును.

ఇప్పటి వరకు చాలా మంది అధికారభాషా సంఘానికి అధ్యక్షులుగా వచ్చారు. వారంతా గౌరవనీయులే. ఎవరికి వీలైనట్లు ఎవరికి తోచినట్లు వారు శ్రమించారు. ఐనా ఆ సంఘ స్థాపనకై కృషి చేసిన మహావ్యక్తి వావిలాల గోపాలకృష్ణయ్యగారు ఆశించిన విధంగా ఫలితాలు రాలేదు. కారణాలను తెలుసుకోకుండా, అందుకు బాధపడి ఉపయోగం లేదు.

అధికారభాషా సంఘాన్ని ఏర్పాటు చేయవచ్చు, చేయకనూ పోవచ్చు. అదంతా పాలకుల ఇష్టం. ఆ సంఘం అవసరమేనని వారు అనుకోవాలి. అలా అనుకొంటే దాన్నొక రెండేళ్ల కాలానికి ఒక అధ్యక్షుడిని నలుగురు సభ్యులని నియమిస్తారు. వారికి ఒకరిద్దరు ఉద్యోగ సహాయకులు, ఒక కార్యాలయం వాహనం వగైరా ఉంటాయి. వారు ఇరుగుపొరుగు రాష్ట్రాలకో, మరి అవసరమైన ప్రాంతాలకో పర్యటించి వచ్చి, మాతృభాషలలో పాలన విశేషాలను నివేదిస్తారు.. అదే విధంగా తమకు చెందిన రాష్ట్రంలో అన్ని జిల్లాలలో అవసరమని అనుకొంటే ఇంకా విస్తృతంగా పర్యటించి ఏ స్థాయి ప్రభుత్వ కార్యాలయాలనైనా సందర్శించి అక్కడ తెలుగులో పాలన ఎలా జరుగుతున్నదీ,ఏ విధంగా ఎంతెంత శాతం పని జరుగుతున్నదీ తెలుసుకొని, ఆ నివేదికలను రాష్ట్ర ప్రభుత్వానికి సమర్పిస్తారు. ఇది తరచుగా జరుగుతుంటుంది.

అయితే, సరిగా పనిచేయని వారికి జరిమానా విధించడంగాని, మరో విధంగా శిక్షలు వెయ్యడానికి గాని వీరికి ఆధికారం ఏమీ లేదు. అందువల్ల అధికారభాషా సంఘ అధ్యక్షులను, సభ్యులను అందరూ గౌరవిస్తారు. వ్యక్తిగతంగా తెలుగు అమలుపట్ల శ్రద్ధ ఉండే వారికి తప్ప, ఎవరూ పాలనారంగంలో ఏదో ఉద్ధరిద్దామని పనిచెయ్యరు. తమ పైవాళ్లకు లేని ఆరాటం తమకెందుకని మిన్నకుంటారు. ఎన్టీ రామారావు ముఖ్యమంత్రిగా వుండగా ఆ స్థాయిలో ఖచ్చితమైన సంకల్పం, పట్టుదల ఉన్నందుకే తెలుగు పూర్తిగా అమలుకు నోచుకొంది. ఆయన తర్వాత ఆ

సంపాదకీయం

పార్టీ ముఖ్యమంత్రే వచ్చినా ఆయన ఏమీ పట్టించుకోలేదు. రెండు రాష్ట్రాలైన తర్వాత తెలంగాణలో, ఆంధ్రాలో కూడా పరిస్థితి ఇదే. తెలంగాణ రాష్ట్రంలో అధికారభాషా సంఘ అధ్యక్షుణ్ణి నియమించారు గాని, అది అలంకార మాత్రంగానే జరిగింది. ఆంధ్రలో అయితే అసలు అధికారభాషా సంఘం ఊసేలేదు. ఇందుకు ఎవరు ఏ కారణాలు చెప్పినా, ముఖ్యమంత్రిగారికి తెలుగు సంగతి పట్టనేలేదు అన్న సంగతి వాస్తవం. పాఠశాల స్థాయిలో తెలుగు మాధ్యమాన్ని మొదట దెబ్బకొట్టింది ఆయన పార్టీయేకదా! ఇందులో దోబూచులాట ఎందుకు? తర్వాత అధికారంలోకొచ్చిన పార్టీ వారైతే ముందుగా తెలుగుమీడియం పట్ల తమ వ్యతిరేకతను ప్రకటించే వచ్చారు కదా!

మొదటినుంచీ అధికారభాషాసంఘం ఒక సలహా సంఘం మాత్రమే. ఆ స్థానంలోకొచ్చిన పెద్దలు శ్రద్ధతో కొద్దిమంది పనిచేసినా, ఆపైన వున్న ముఖ్యమంత్రిగారికీ, వారి పార్టీకీ పట్టుదల ఉంటేనే ఏదైనా జరుగుతుంది. మన తెలుగు రాష్ట్రాల్లో ఇంతవరకు సైద్ధాంతిక స్పష్టత ఉన్న పార్టీలేవీ అధికారంలో ఎన్నడూ లేరు గనుక- కేవలం ముఖ్యమంత్రి గారి శ్రద్ధనుబట్టే తెలుగు అమలు ఉంటుందనేది స్పష్టం.

తెలుగుదేశం పార్టీని స్థాపిస్తూనే తిరుపతి మహానాడులో ఎన్టీరామారావుగారు ప్రకటించిన తెలుగుభాషా విధానాన్ని చూస్తే - ఇప్పటి పరిస్థితితో పోల్చితే- ఆయన సంకల్పానికి, ధైర్యానికి, ప్రజాస్వామ్య దృక్పథానికి, తెలుగు ప్రజల పట్ల, తెలుగు భాషపట్ల గల అంకితభావానికి చేతులెత్తి దణ్ణం పెట్టాలనిపిస్తుంది. ఆతర్వాత వచ్చిన నేత-ఇందుకు పూర్తిగా వ్యతిరేక మూర్తియే కదా!

ఇంతకూ- ఇప్పుడు 'ఆంధ్రప్రదేశ్‌లో గానీ, తెలంగాణలో గానీ అధికారభాషా సంఘం ఆవసరమే లేదు. ఇప్పటికే అదెంతో అభాసుపాలైంది. 'మా ప్రభుత్వం తెలుగు కోసం ఎంతగానో పనిచేస్తున్నదని' చెప్పడం వినేవాళ్ళు నవ్వుకోవడానికి పనికొస్తుంది. పోనీ 'తెలుగు మాధ్యమం పట్ల మాకు వ్యతిరేకత వుంది, కాని- తెలుగును ఒక భాషగా నిలబెట్టడానికి అన్ని చర్యలు తీసుకుంటున్నాం'. అని చెప్పడానికైనా, ఈ ప్రభుత్వం ఏం చేసింది గనుక! రాష్ట్ర ప్రభుత్వంలో ఉన్న ఉద్యోగాల్లో 20 శాతం తెలుగు మీడియంలో చదువుకున్నవారికి కేటాయిస్తారా? - పొరుగున వున్న తమిళనాడులో 20 శాతం 'రిజర్వేషన్'ను తమిళంలో చదువుకొన్నవారికి ఇస్తున్నారని వీరికి తెలియదేమో!

ఈ కథను అ.భా.స ఏర్పడిన దగ్గరనుండీ ఏకరువు పెట్టాలంటే మన తెలుగు ప్రభుత్వాల నిర్వాకాన్ని వివరించాలంటే అదొక పెద్ద గ్రంథమే అవుతుంది.

ఇప్పుడు అధికార భాషాసంఘానికి ఆధ్యక్షుడుగా వున్నవారు ఇటీవల పత్రికా విలేఖరుల సమావేశంలో ఎంతో ఆర్ద్రతతో చెప్పినట్లు-భగవంతుడు తమకు మంచి ఆరోగ్యాన్ని ప్రసాదిస్తే- అధికార భాషాసంఘం అధ్యక్షుడుగా తాను తెలుగుకోసం శాయశక్తులా పనిచేస్తానని, ఫలితాలు సాధిస్తామని చెప్పినందుకు ఎంతో సంతోషిస్తున్నాం. 20 ఏళ్ళుగా భాషోద్యమంలో పనిచేస్తున్న నా అనుభవాలన్నింటిని ప్రక్కనబెట్టి, ఇంకా మీరేమైనా సాధిస్తారని ఆశగా ఆత్రంగా ఎదురు చూద్దామనిపిస్తోంది. మీకు శుభం కలగాలనే కోరుకుంటున్నాను.

ఈ లోపుగా మీరు ఈ విషయంలో జరిగిన చరిత్రను అధ్యయనం చెయ్యాలని కోరుతున్నాను, పత్రికా ప్రతినిధుల సమావేశంలో మీరు ఏదో గ్రాంథిక భాష,వ్యవహారిక భాష వంటి సందేహాలు లేవనెత్తారు. అవన్నీ పాతికేళ్లకు ముందే పరిష్కారం అయిపోయాయి. పదకోశం వంటి సమస్యలూ ఎప్పుడో మరుగయ్యాయి. 1988లో రాష్ట్రప్రభుత్వమే ప్రకటించిన 'అధికార భాష తీరుతెన్నులు' చిన్న పుస్తకాన్నీ మె.మో నెం. 167/అ.భా.3/88-1 తేదీ 19-3-1988నూ ఒకసారి పరిశీలించండి. ఇంకా వెతికితే అ.భా.సంఘ కార్యాలయంలో కొంత సమాచారం లభించవచ్చు.దయచేసి మీరు వీటిని అధ్యయనం చెయ్యండి. ఏది ఏమైనా, మీరు ప్రభుత్వనేతల ప్రాపకాన్ని కోల్పోకుండా పనిచేసుకొవలసివుంటుందని మీకు వేరే చెప్పనక్కరలేదు.

ఏ విధంగానైనా తెలుగురాష్ట్రాలలో పాలన అంతా తెలుగులో జరగాలని కోరుకొంటున్నాం.

తేదీ:1 జూన్ 2023

సామల రమేష్‌బాబు

---

**జాతి ఉన్నతి సాధించాలంటే ఉద్యమంగా వెలగాలంటే,**
**జాతి భాష ఉన్నతిని సాధించవలసిందే... ఉజ్వలంగా వెలగవలసిందే**

# అధికార భాషా చట్టం (మే14,1966) ప్రకారం తెలుగు రాష్ట్రాలలో అన్ని రంగాల్లో తెలుగులో పరిపాలన జరగాలి



## తెలుగు రాష్ట్రాలలో పరిపాలన తెలుగులో జరగాలి

### ప్రజాచైతన్య సభ

1966 మే 14న తెలుగుభాషను అధికారభాషగా, పాలనా భాషగా, ప్రకటిస్తూ చట్టం వచ్చింది. దీన్ని పూర్తిగా పాటించడం పాలకుల విధి. ప్రభుత్వాన్ని కదిలించి పనిచేయించుకునే హక్కు ప్రజలకు ఉంది. ఇది ప్రభుత్వ వ్యతిరేక చర్య కాదు. ఇది రాజ్యాంగం ప్రజలకు ఇచ్చిన హక్కు. అంతేకాదు, కేంద్రంతో ఉత్తరప్రత్యుత్తరాలను తెలుగులో రాసే హక్కు మనకు ఉంది. పార్లమెంటులో మన ప్రతినిధులకు కూడా తెలుగులో మాట్లాడే హక్కు ఉంది. దాన్ని వాళ్ళు ఉపయోగించుకొనేట్లు మనం ఒత్తిడి చెయ్యాలి. తెలుగు ఒక ప్రాంతీయ భాష కాదు, జాతీయ భాష. భారత రాజ్యాంగంలో పేర్కొన్న 22 భాషలూ జాతీయ భాషలే. 'దేశానికంతా ఒకే జాతీయభాష' అనే నినాదానికి ఏరూపంలోనూ మనం లోబడకూడదు. ఆధునిక సాంకేతికతను వినియోగించుకొని మన భాషను మనం అభివృద్ధిచేసుకోవచ్చు.

రెండు తెలుగు రాష్ట్రాల్లో అన్నిస్థాయిల్లో, అన్ని రంగాల్లో తెలుగులోనే పరిపాలన జరగాలి. ఇదే మన కోరిక. ప్రజల అవసరం ఇది. ప్రజల హక్కు ఇది. భాషారాష్ట్రాలు ఏర్పడిందే ఇందుకు. రాష్ట్రస్థాయి నుండి గ్రామాల పరిపాలన వరకు ప్రజలభాషలోనే అన్ని పనులూ జరగాలి. న్యాయస్థానాల్లో తీర్పులతో సహా అన్ని పనులూ ప్రజలభాషలోనే జరగాలి. తెలుగునేలపైన ప్రైవేటురంగంలో కూడా తెలుగు కన్పించాలి, వినిపించాలి. వినిమయ సరుకుల ప్యాకెట్లపై తెలుగులో వస్తు సమాచారం ఉండాలి. ఇవన్నీ జరిగితేనే మనవి 'తెలుగు' రాష్ట్రాలు అవుతాయి. మన ఆత్మగౌరవానికి నిదర్శనలు ఇవి. వీటిని సాధించడం కోసం ప్రజలలోనూ ప్రభుత్వంలోనూ చైతన్యాన్ని పెంచేందుకు ఒక ఏడాదిపాటు కార్యక్రమాలను చేపట్టాలని తెలుగు భాషోద్యమ సమాఖ్య నిర్ణయించింది.

## ఉద్యమానికి జనచైతన్య సభల శ్రీకారం

రెండు తెలుగు రాష్ట్రాలలో పరిపాలన అన్ని రంగాలలో తెలుగులోజరగాలి' అనే కోరికతో తెలుగు భాషోద్యమ సమాఖ్య ఒక ఏడాది పాటు నిర్వహించదలచిన ఉద్యమ కార్యక్రమాలు మే 14న విజయవాడ సభతో మొదలయ్యాయి. ఏడాది పొడవునా రెండు రాష్ట్రాల ప్రజల్లోనూ, పాలకవర్గాలలోనూ ఈ విషయమై చైతన్యం తీసుకురావడంతోపాటు, అంధ్రప్రదేశ్ అధికారభాషా చట్టాన్ని పూర్తిగా అమలుపరిచేందుకు వ్యవస్థలను, ప్రజలను సన్నద్ధం చేయడమే ఈ కార్యక్రమ లక్ష్యం. తర్వాత మే 28వ తేదీన హైదరాబాదులో, 27,29 తేదీలలో తెనాలి, నెల్లూరులలో ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు. వీటి ఛాయాచిత్రాలను, క్లుప్తంగా వార్తలను ఈ పుటలలో ఇస్తున్నాము.

మే 14న విజయవాడలో జరిగిన సభల ప్రసంగాలను వివరంగా ఇవ్వగలిగాము. నెల చివరిలో 27,28,29 తేదీలలో జరిగిన సభల వార్తలను సమయం లేనందున ('అమ్మనుడి' పత్రిక ప్రచురణ సమయం), క్లుప్తంగా ఇచ్చాము.

**అధికార భాషా సంఘం స్పందన**

విజయవాడ సభలో ప్రసంగాలపై ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర అధికార భాషాసంఘం అధ్యక్షులు మే 17న పత్రికా ప్రతినిధుల సమావేశం పెట్టి కొన్ని వ్యాఖ్యలు చేశారు.

ఈ సభల నిర్వహణ ఉద్దేశ్యాన్ని స్పష్టంగా ప్రకటించాము. ప్రజా ప్రతినిధులను, వారు ఏపార్టీకి చెందిన వారైనా, వారి అభిప్రాయాలు సభలో చెప్పవలసిందిగా ఆహ్వానించాము. విజయవాడ సభకు అధికార పార్టీ వైయస్ఆర్‌సిపికి చెందిన శ్రీ డొక్కా మాణిక్యవరప్రసాద్ గారిని కూడా ఆహ్వానించాము. వారు వస్తామన్నారు. చివరిలో రాలేకపోయారు. ఆమాటను పైన పేర్కొన్న పత్రికా ప్రతినిధుల సమావేశంలో ఆయన చెప్పారు కూడా. మండలి బుద్ధప్రసాద్‌గారు తెలుగు భాషోద్యమ సమాఖ్య స్థాపనలో భాగం పంచుకొన్న ముఖ్యులలో ఒకరు. ఆయన తెలుగు భాష, సాహిత్యం,సంస్కృతికి సంబంధించి ఎన్నో సేవలు చేశారు. ఆ రంగాలలో ప్రముఖులుగా అందరికీ తెలుసు. శ్రీ బుద్ధప్రసాద్ ఏ పార్టీలో ఉన్నా, తెలుగు భాషోద్యమ సమాఖ్య కార్యక్రమాలకు ఆయన శాశ్వత ఆహ్వానితులు. అయితే, మా సభల్లో ఆయన ప్రకటించే అభిప్రాయాలు, సూచనలను సమాఖ్య తమ లక్ష్యాలకు అనుగుణంగా వుంటేనే స్వీకరిస్తుంది. ఆమాటకు వస్తే ఏ పార్టీవారు ఏమి చెప్పినా అవి సమాఖ్య సిద్ధాంతాలకు అనుగుణంగా ఉంటేనే స్వీకరిస్తుంది. ఆ సభలో శ్రీ బుద్ధప్రసాద్ అధికార భాషా చట్టం అమలుపై ఇంతవరకు జరిగినదంతా చెప్పడంతో పాటు మొత్తంగా తెలుగు అమలు విషయంలో ప్రభుత్వాలు ఎలా వ్యవహరించిందీ చెప్పారు. ఆయన 14వ తేదీ సభలో ఏం చెప్పిందీ ఈ పత్రికలో చదువుకోవచ్చు. దాని మీద భేదాభిప్రాయాలు ఉంటే అవన్నీ చెప్పవచ్చు. ఆయన వ్యక్తిత్వాన్ని కించపరచనక్కరలేదు.

ఇక-వామపక్షనేత, మాకినేని బసవపున్నయ్య విజ్ఞాన కేంద్రం అధ్యక్షుడు శ్రీ సి.మధుగారు. ఫిబ్రవరి 21 అంతర్జాతీయ మాతృభాషాదినోత్సవం సందర్భాన్ని, తెలుగు భాషోద్యమ సమాఖ్య 20వ పుట్టిన రోజు సభను విజయవాడ సిద్ధార్థ ఆడిటోరియంలో నిర్వహించినప్పుడు శ్రీ మధు ఐచ్ఛికంగ వచ్చి పూర్తిగా కార్యక్రమాలను చూసి సంతోషించారు. తర్వాత తమ సంస్థ (ఎం.బి.వి ట్రస్ట్)

తరపున భాషోద్యమం గురించి అవగాహన కోసం ఒక సమావేశం నిర్వహించారు. అంతేగాక తెలుగు భాషోద్యమ సమాఖ్య మున్ముందు తలపెట్టే కార్యక్రమాలకు తమ అండదండలుంటాయని ప్రకటించారు. కనుక మా శ్రేయోభిలాషిగా ఆయనను కూడా ఆహ్వానించాము. ఆయన తన అభిప్రాయాలను సభలో ప్రకటించారు. ఇదంతా ప్రజాసామ్యంలో ప్రజాభిప్రాయ నిర్మాణ పద్ధతి. ఎవరికోసమో ఈ ప్రక్రియ ఆగిపోదు. కలిసి వచ్చేవారు ప్రజాభిమానాన్ని మరింతగా పొందగలుగుతారు.

తెలుగు భాషోద్యమ సమాఖ్యకు ఏ రాజకీయ పార్టీలతోనూ ఎటువంటి అనుబంధం లేదు. ఉండదు. ఇరవై ఏళ్ళ (2003 నుండి) చరిత్రను పరిశీలించిన వారికెవరికైనా ఇది తెలుస్తుంది. కేవలం తెలుగుభాష శ్రేయస్సుకూ, అభివృద్ధికీ కట్టుబడి, స్వతంత్రంగా పనిచేసే సంస్థ 'తెలుగు భాషోద్యమ సమాఖ్య'. ప్రభుత్వ బాధ్యతల్లో ఉన్నవారు ఈ విషయం గమనించాలని కోరుతున్నాము.

ఇంకొక మాట. అధికార భాషాసంఘం అధ్యక్షులు తమ పత్రికా ప్రతినిధుల సమావేశంలో నాపేరును ప్రస్తావించి, తెలుగు భాషోద్యమంలో నేను చేస్తున్న కృషిని మెచ్చుకొంటూనే నన్ను, 'తెలుగుదేశం పార్టీ' 'ట్రాప్'లో పడవద్దని సలహా ఇచ్చారు. నాకు నవ్వు వచ్చింది. నేను ఏ రాజకీయ పార్టీల,వ్యక్తుల ఉచ్చులో పడేవాణ్ణి కాదు. నా జీవితమే ఇందుకు సాక్ష్యం. సలహా ఇచ్చినందుకు ధన్యవాదాలు.

– డాక్టర్ సామల రమేష్ బాబు, తెలుగు భాషోద్యమ సమాఖ్య గౌరవాధ్యక్షుడు, 'అమ్మనుడి' సంపాదకుడు.

---

తెలుగు భాషోద్యమ సమాఖ్య తలపెట్టిన తొలి ప్రజాచైతన్య సభ విజయవాడలోని మాకినేని బసవపున్నయ్య విజ్ఞాన కేంద్రంలో 2023 మే 14 సాయంత్రం 5--30 గంటలకు జరిగింది. విజయవాడలో ప్రజాచైతన్య సభకు తెలుగు భాషోద్యమ సమాఖ్య అధ్యక్షులు ఆచార్య గారపాటి ఉమామహేశ్వరరావు అధ్యక్షత వహించారు. ఆయన ప్రసంగం క్లుప్తంగా....



జన ప్రమేయంతోనే ఏదైనా సాధించడం సుసాధ్యం. హక్కుల సాధనలో ఎండలను సైతం లెక్కచేయక సభకు హాజరైన సభికుల ఉత్సాహమే పరిపాలన తెలుగులో జరగాలనే నినాదానికి ఊపిరి. ఈ రోజుకు ఇంకో ప్రాధాన్యత ఉంది. 1966 మే 14 న తెలుగు భాషాధికార చట్టం రూపొందింది. సుమారు 57 ఏళ్ళు పూర్తయ్యాయి. 1966 మే 10న భారతీయ అధికార భాషా చట్టం రూపొందించబడింది. రాష్ట్రాలలో అధికారభాషలుగా రాజ్యాంగంలోని 8వ షెడ్యూల్‌లో గుర్తించిన ప్రజాభాషలను వినియోగించాలి అని ఈ చట్టాలు స్పష్టం చేశాయి. అది రాజ్యాంగ బద్ధమైనది. ఆ తర్వాత నాటి ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ లో అధికార భాషగా తెలుగు రూపుదిద్దుకుంది. దాని అమలుపై ఈరోజు చర్చించనున్నాం. సురవరం ప్రతాపరెడ్డి తెలుగు అధికార భాషా అవశ్యకతను ప్రపంచానికి చాటి చెప్పారు. ఆంధ్రుల సామాజిక చరిత్రను రచిస్తూ దాని నేపథ్యాన్ని సమగ్రంగా పరిశోధించి చర్చించారు. ఆ తర్వాత పరిపాలనలో అధికారభాషగా తెలుగును అమలు పరచిన ఘనత మాత్రం అప్పటి ముఖ్యమంత్రి నందమూరి తారకరామారావుదే! ఇంగ్లీషువంటి పరభాషలలో ఎలాంటి అధికారిక విజ్ఞాపన వచ్చినా అంగీకరించేది లేదని ఆదేశాలు జారీ చేసి మరీ పరిపాలన తెలుగులో సాగడానికి విశేష కృషిచేశారు. అదే సక్రమంగా కొనసాగి ఉంటే ఇప్పుడు తెలుగు భాషా ఖ్యాతి ప్రపంచపటంపై ఓ వెలుగు వెలిగేది. కానీ ఇప్పుడు పరిస్థితి ఆయన ఆలోచనలకు విరుద్ధంగా ఉంది. ప్రజల భాషలోనే పరిపాలన సాగాల్సిన అవసరాన్ని పట్టి చూపిస్తోంది. అలా పరిపాలన అధికార భాషలో జరగాలంటే దానికై వచ్చిన చట్టాన్ని గౌరవించాల్సిన అవసరం నేటి ప్రభుత్వాలపై ఉంది. చట్టాలపై గౌరవం లేని రోజున ప్రజా పాలన లేదు, ప్రజాపాలన లేనప్పుడు ప్రజాస్వామ్యానికే అది చేటు చేస్తుంది. ప్రజా చైతన్య సభ ముఖ్య ఉద్దేశ్యాన్ని అమలు చేయడానికి కృషిచేస్తున్న వక్తలు ఈ సందర్భంగా వివరిస్తారు. ప్రపంచంలోనే ఏకైక మాతృభాషా సంబంధమైన పత్రిక 'అమ్మనుడి' సంపాదకులు డా. సామల రమేష్ బాబు ముందుగా ఈ ఉద్యమ అవసరాన్ని సభకు తెలియజేస్తారు అన్నారు.

**డా. సామల రమేష్‌బాబు**



తెలుగు భాషోద్యమ సమాఖ్యను స్థాపించుకొన్న 20 ఏళ్ళ తర్వాత గారపాటి ఉమామహేశ్వరరావు గారిని అధ్యక్షుడుగా ఎంపిక చేసుకోవడానికి కారణం ఉంది. ఇప్పటివరకు సాహిత్యంలో కృషిచేస్తున్న వారికన్నా, తెలుగు ఉపాధ్యాయులకన్నా తెలుగేతర రంగాలలోని వారు ఎక్కువగా ఈ ఉద్యమంలో పాల్గొంటున్నారు. సెంట్రల్ యూనివర్శిటీ ప్రొఫెసర్లు కొంతమంది, ఈ మాతృభాషోద్యమానికి బీజం వేశారు. ఆనాటి నుంచి అధ్యాపక రంగం నుంచి ఈ ఉద్యమంలో పూర్తి స్థాయిలో పాల్గొన్నవారు తక్కువే. ఈ నేపథ్యంలోనే డా. ఉమామహేశ్వరరావుని ఏకగ్రీవంగా జాతీయ అధ్యక్షుడిగా తెలుగు భాషోద్యమ సమాఖ్య ఎన్నుకొన్నది. ఇకపై వీరి పాత్ర ఇందులో కీలకం.

'ప్రజల భాషలో మన ప్రభుత్వాలు పాలించాలి.' ఇది మాత్రమే మన కోరిక, చట్టబద్ధమైన కోరిక. మనమేం రాచరికంలో లేం. ఈనాడు ఎవరి భాషలో వారు చదువుకునే హక్కు ఉంది. ప్రపంచంలోని ఏ విజ్ఞానాన్నైనా సొంత భాషలో నేర్చుకునే హక్కు ఉంది. అదే

ప్రజాస్వామ్యమంటే! మన భాషలో కాకుండా ఇతర భాషలో పరిపాలన సాగితే మన పాలకులకు బ్రిటీషర్లకు తేడా ఏముంది? అందరికీ తెలిసినా కూడా ఎవరూ దీనిని తీవ్రమైన విషయంగా తీసుకోవడం లేదు. దీంతో ప్రజాస్వామ్యం అపహాస్యం పాలౌతోంది. సరైన ప్రజాస్వామ్య పాలన జరగడం లేదు. శతాబ్దాలపాటు ఇదే పరిస్థితి కొనసాగితే మనం ఎటుపోతున్నట్లు. శాస్త్రీయంగా ఆలోచిస్తే, ప్రపంచంలోని అన్ని భాషలకూ ఒకటే విలువ ఉంటుంది. వాటిలో పెద్ద భాష , చిన్న భాష అనే వ్యత్యాసం ఉండదు. పెరిగినటువంటి భాషకు ఉన్న శక్తి అంతా, పెరగని భాషకూ ఉంటుంది.

అయితే దానిని విద్య, పాలనా రంగాలలో వాడుకునే దానిని బట్టి దాని పెరుగుదల, ఖ్యాతి నిలబడి ఉంటుంది. సంస్కృతానికి ఎంత శక్తి ఉంటుందో, మిగిలిన అన్నీ భాషలకూ అంత శక్తి ఉంటుంది. పాలకుల భాషకు ఎంత శక్తి ఉంటుందో, పాలితుల భాషకూ అంతే శక్తీ ఉంటుంది. కనుక పాలితుల భాషని పాలకులు అమలు పరచకపోవడం వల్ల మాత్రమే దాని విలువతగ్గింది తప్ప మరే విషయమూ కాదు. శాస్త్ర పరంగా ముందుకెళుతున్న సందర్భంగా మనమందరం ఒకటి గుర్తించాలి. మన భాషను మనం కాపాడుకోవాలి, మన భాషలో మనకు పరిపాలన కావాలి అనే విషయంతో మన ఈ ఉద్యమం ముందుకెళ్లబోతోంది. దీనిపై చాలా కృషి చేయడం జరిగింది. కానీ ప్రభుత్వాలు పట్టించుకోవడం లేదు. కనుక ఉద్యమంగా ముందుకు తీసుకెళ్ళాల్సిన అవసరం ఏర్పడింది. మే 14న 1966లో ఈ చట్టం వచ్చిందని మీకు తెలుసు. ప్రజల భాషగా, అధికార భాషగా తెలుగు అమలు కోసం, ఆత్మగౌరవం కోసం ఇద్దరు తెలుగు వైతాళికులు ఈ నెల 28వ తేదీన పుట్టారు. వారిలో ఒకరు సురవరం ప్రతాపరెడ్డి కాగా, రెండవ వారు నందమూరి తారక రామారావు. సురవరం ప్రతాపరెడ్డి కాలంలో తెలంగాణా ప్రాంతంలో తెలుగులో మాట్లాడే అవకాశం లేకపోగా, మాట్లాడితే అపహాస్యం చేసేవారు. అప్పుడు ప్రతాపరెడ్డి, మరికొంతమంది ఉద్యమాలు చేసి సమాజాన్ని ముందుకు నడిపించారు. తెలుగుకు గుర్తింపు రావడంలో విశేష కృషి చేశారు. వీరి పుట్టిన రోజును తెలుగు జాతి వారసత్వదినోత్సవంగా 2010 నుండీ తెలుగు భాషోద్యమ సమాఖ్య జరుపుతున్నది. ఇక ఎన్‌టి రామారావు గారి ప్రత్యేకత ఏమిటంటే, అధికార భాషా చట్టం అమలుకావడం లేదని తెలిసిన వెంటనే ఉన్నతాధికారులకు నోటీసులిచ్చి, నాలుగు రోజులలో పరిపాలనను పై నుంచి క్రింది దాకా తెలుగులోకి మార్చేసిన ఘనత కేవలం ఆయన ఒక్కరికే దక్కింది. దురదృష్టవశాత్తు ఎన్‌టి రామారావు ఏ పార్టీని స్థాపించి ఒక చరిత్రను సృష్టించారో, ఆయన తర్వాత వచ్చినవారు ఆ పార్టీ పేరులోని 'తెలుగు'ను మరచిపోయారు. ఇది హాస్యాస్పదం, బాధాకరం కూడా. మిగతా పార్టీలేవో ఉద్ధరించాయని కాదు, పార్టీలపేర్లు పక్కనబెడితే, ఆ తర్వాత ఏ పాలకుడు కూడా తెలుగుజాతి గురించిగాని, తెలుగు భాష గురించికాని, తెలుగు మాట్లాడే ప్రజల గురించి కానీ అంతగా పట్టించుకోకుండానే వ్యవహరించారు. వ్యవహరిస్తున్నారు. కేవలం ఎన్‌టిఆర్‌కి మాత్రమే ఆ ఘనత దక్కింది. ఏ మంత్రి కూడా తన వద్దకు తెలుగు కాకుండా ఇతర భాషలో ఏఫైలూ తేవడానికి వీలు లేదని అలా వస్తే వాటిని తిరస్కరిస్తానని ఆదేశించి అమలు చేశారు ఎన్‌టీఆర్. అదంతా గతజల సేతు బంధనం అయిపోయింది.

ఆ తర్వాత పాలకులు పట్టించుకోపోవడంతో పాలన అంతా ఇదేదో ఇంగ్లీషు దేశం అన్నట్లు పరిస్థితి తయారైంది. ఇది బ్రిటీష్ కాలాన్ని తలపిస్తోంది. ఈ పరిస్థితికి కారణం, ప్రభుత్వాలు తెలుగులో పరిపాలించవు, తెలుగును వాడవు, తెలుగును వాడేందుకు ప్రజలను ప్రోత్సహించరు. 2007 సంవత్సరంలో రేషన్ కార్డులు వచ్చాయ్. అవన్నీ ఇంగ్లీషులో ఉన్నాయ్. దానిపై హై కోర్టుని ఆశ్రయించాం. కోర్టు ఆదేశాలతో, రేషన్ కార్డులు ప్రభుత్వం ఇంగ్లీషుతో పాటు తెలుగులో కూడా అందించింది. ఇంగ్లీషులో పెట్టవద్దని చెప్పడం లేదు. కానీ ప్రజల భాషలో వివరాలు లేకుండా పరాయి భాషలో అందిస్తే అది ప్రజలను అవమానించడమే; దీనిని మేము నిలదీశాం. కోర్టులో జడ్జి గారు కూడా అధికారులని గట్టిగా మందలించారు. ఆ రోజు మేమంతా కోర్టులో ప్రత్యక్ష సాక్షులం. ప్రతిదానికి కోర్టులకెళితేకానీ సాధించుకోలేకపోవడం ఎంత నామర్దా? ఈ వేదికలో ప్రక్కనే కూర్చున్న డా. గుంటుపల్లి శ్రీనివాస్, ఆశ్రం మెడికల్ కాలేజీలో అసిస్టెంట్ ప్రొఫెసర్ గా పనిచేస్తున్నారు. ఇప్పటికే మూడు, నాలుగు ప్రజాప్రయోజన వాజ్యాలను ప్రభుత్వంపై కోర్టులో వేసి తిరుగుతున్నారు. ఇదే విషయం అనేక చర్చలకు దారి తీసింది. ప్రభుత్వం కూడా రకరకాల సమాధానాలు సాక్ష్యాలు పొందుపరుస్తోంది. ఇంక ఎంతకాలం కోర్టుల చుట్టు తిరగాలి? గతంలో ఇదే అంశం మీద కోర్టులో వాజ్యాలు వేసి సమాధానాలు రాబట్టాం. ఈ నేపథ్యంలో దీనిని ఉద్యమ రూపంలో తీసుకురావాల్సిన ఆవశ్యకతని గమనించి ఈ ఉద్యమానికి బీజం వేస్తున్నాం. అనేక ప్రాంతాలలో సభలు నిర్వహిస్తాం. దీనిపై విద్యాలయాలల్లో, కళాశాలల్లో , విశ్వవిద్యాలయాలలో చర్చిస్తాం. విద్యార్థులకు సమస్యను వివరించి వారిని ఆలోచింపజేసి, ఉద్యమంలో భాగస్వామ్యులను చేస్తాం. మన భాషలో పరిపాలించండని, మన ప్రభుత్వాన్ని కోరాలా? ఇది ఎంత సిగ్గుచేటు? ఎందుకోసం స్వాతంత్ర్యం వచ్చినట్లు? నిజంగా స్వాతంత్ర్యం వచ్చిందా? లేక ఇంకా బానిసత్వంలోనే మనం జీవిస్తున్నామా? అనే ప్రశ్నలు ఉత్పన్నమవుతున్నాయి. ఇవే ప్రశ్నలను నేరుగా ప్రజల వద్దకు తీసుకెళ్ళాలి. ఎవరైనా రశీదులను ఇంగ్లీషులో ఇస్తే తిరస్కరించాలి.

మన ప్రజాప్రతినిధులు పార్లమెంటులో కూర్చుని ఇంగ్లీషులో మాట్లాడాల్సిన అవసరం లేదు. వారు ముందుగా సభాపతికి తెలియజేసి తెలుగులో సమస్యలను సభముందు ఉంచవచ్చు. ఈ వేళ సాంకేతికత అనేక విధాల అభివృద్ధి చెందింది. ఏ భాష నుంచైనా ఏ భాషకైనా అనువాదం చేసుకునే సాంకేతిక వెసులుబాటు ఇప్పుడు ఉంది. మరి ఇంతటి ఆధునిక అవకాశాలున్న రోజుల్లో పాలకులు ప్రజల భాషలో ఎందుకు పరిపాలించరు? తన భాషలో ఎందుకు చట్టసభల్లో వాదించరు? తిట్టుకోవడానికి భాష కావాలిగానీ, పరిపాలించడానికి అవసరం లేదా? అందువల్ల ఈ విషయం మీదనే ఉద్యమాన్ని తీర్చిదిద్దాలనే ఉద్దేశ్యంతో ప్రత్యేక కార్యాచరణతో ముందుకొచ్చాం. తెలంగాణ ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలలో అనేక ప్రాంతాలలో ఈ సభలు గాంధేయ పద్ధతిలో, ప్రశాంతంగానే, ధిక్కారాన్ని వినిపిస్తాం. దీనికోసం నిరాహారదీక్షలు చేపట్టాల్సిన అవసరం లేదు. అల్లర్లు చేయాల్సిన అవసరం అంతకన్నా లేదు. ప్రతి చోట ప్రజలు ఆలోచిస్తారు. కాకుంటే వారికి

తెలియజేయాల్సిన అవసరం, బాధ్యత మనపై ఉంది. ప్రజలను వారి భాష గురించి వారు ఆలోచించాల్సిన అవసరాన్ని వారికి అర్థమయ్యేలా వివరించాలి. రశీదులు తెలుగులో ఇవ్వమని ప్రతి గృహిణి అడిగే స్థాయికి ఈ ఉద్యమాన్ని తీసుకెళ్లాలి. అందుకు నాందిగా పదిహేను రోజులపాటు ప్రజా చైతన్య సభలను వివిధ ప్రాంతాల్లో నిర్వహిస్తున్నాం. తదుపరి సంవత్సర కాలం పాటు ఈ కార్యక్రమం కొనసాగుతుంది అని డాక్టర్. సామల రమేష్ బాబు అన్నారు.

**మండలి బుద్ధ ప్రసాద్ ప్రసంగం:**

తెలుగు రాష్ట్రాల్లో పరిపాలన తెలుగులోనే జరగాలని ప్రజా చైతన్య సభని ఏర్పాటు చేసినందుకు నేను కృతజ్ఞతలు తెలుపుతున్నాను. తెలుగు వారికి ఒక రాష్ట్రం కావాలని 1913లో బాపట్ల ఆంధ్ర మహాసభలో చేసిన తీర్మానం మా భాషలో మేం పరిపాలన చేసుకోవడానికి మా భాషలో మేం చదువుకోవడానికి మాకు ఒక రాష్ట్రం కావాలని అనేది ఆంధ్రోద్యమం యొక్క ప్రధాన లక్ష్యం 1913 నుంచి ప్రారంభమైన ఆంధ్రోద్యమం చివరికి పొట్టి శ్రీరాములు గారి ఆత్మార్పణతో గానీ ఆంధ్ర రాష్ట్రం ఆవిర్భవించలేదు.



ఆ తర్వాత భాషా ప్రయుక్త రాష్ట్రాలలో భాగంగా విశాలాంధ్ర ఏర్పడడం జరిగింది. ప్రకాశం గారి మంత్రివర్గం 1953లో తొలిసారిగా ఏర్పడినప్పుడు కర్నూలు రాజధానిగా అప్పుడు కొంతవరకు తెలుగును అధికార భాషగా చేయాలనే ప్రయత్నం జరిగింది. ఎందుకంటే అదే ఆంధ్రోద్యమం యొక్క ప్రధాన లక్ష్యం కాబట్టి. అటు పిమ్మట 1956లో నవంబర్ ఒకటో తారీకున ఆంధ్ర ప్రదేశ్ ఆవిర్భవించిన తర్వాత నైజాం రాష్ట్రం ఆంధ్రప్రదేశ్ లో కలవటం, నైజాం పరిపాలనలో ఉర్దూలో చదువుకోవటం, ఉద్యోగంలో పరిపాలన జరగటం ఉండేది. అవి చూసి పెద్ద మనుషులు ఒప్పందంలో వ్యక్తం చేసినప్పుడు దానికి కొంత మన వాళ్లు కూడా కొంతమేర ఒప్పుకోవడంతో తెలుగు కొంత వెనక పడడం జరిగింది. కానీ ఇవాళ అధికార భాషా చట్టం ఏర్పడిందంటే దానికి ప్రధాన కారణం వావిలాల గోపాలకృష్ణయ్య గారు.

మొట్టమొదటగా ఆంధ్ర రాష్ట్రంలో 1964వ సంవత్సరంలో అనేక తీర్మానాలు ప్రవేశ పెట్టారు. ప్రతి సమావేశంలో అధికార భాషగా తెలుగును చేయాలని చెప్పి, అనధికార తీర్మానాలను ప్రవేశ పెట్టడం, ప్రభుత్వం దానిని తిరస్కరించడం, చివరికి 1966వ సంవత్సరంలో అనధికార తీర్మానాన్ని విరమించుకోండి. మేము ప్రభుత్వం తరఫున అధికార తీర్మానం పెడతామని చెప్పి, ఆనాటి ముఖ్యమంత్రి కాసు బ్రహ్మానందరెడ్డి గారు, విద్యామంత్రి పీవీ నరసింహారావు గారు ఈ అధికార భాషా చట్టాన్ని తీసుకురావడం జరిగింది. ఆ చట్టం వచ్చిన రోజే ఈరోజు, మే 14న అధికార భాషా చట్టాన్ని అమలులోకి తెచ్చిన రోజు. **అయితే 1966లో అధికార భాషా చట్టం వచ్చినా, 1974 వరకు అధికార భాషా సంఘాన్ని మాత్రం ఏర్పాటు చేయలేదు. జలగం వెంగళరావు గారు ముఖ్యమంత్రి అయిన వెంటనే మన అధికార భాష గురించి ఆలోచించి అధికార భాషకు ఒక మంత్రినిగాని, శాఖను గాని రూపొందించి దాన్ని మొట్టమొదటిగా మా తండ్రిగారు మండలి కృష్ణారావు గారికి అప్ప చెప్పడం జరిగింది.** అప్పుడు రాజకీయాలకు అతీతంగా అధికార భాషా చట్టం రావాలని కృషి చేసిన వావిలాల గోపాలకృష్ణయ్య గారిని ఒప్పించి ఆయననే అధ్యక్షులుగా పెడితే తప్ప ఈ కార్యక్రమం ముందుకు సాగదని వెంగళరావు గారు వావిలాల గోపాలకృష్ణయ్యగారిని ఆహ్వానించి, అధికార భాషా సంఘం ఇవ్వడం జరిగింది. ఎందుకంటే ఆయన కాంగ్రెస్ సభ్యుడు కాదు, ప్రభుత్వానికి అనుకూలమైన వ్యక్తి కాదు, తర్వాత ఆయన రాజీనామా చేశారు. 74 నుంచి 77 వరకు వావిలాల గోపాలకృష్ణయ్య గారు మొట్టమొదటి అధ్యక్షుడిగా ఉండి దీనికి కొంత ప్రాతిపదికను ఏర్పాటు చేసిన వ్యక్తి . అధికార భాషా చట్టం రావడానికి కానీ, అధికార భాషా సంఘం ఒక వ్యవస్థగా రూపొందించడానికి కారణం గోపాలకృష్ణయ్యగారు. ఆయన్ని ముందుగా స్మరించి తీరవలసిందే. దాని అవసరం కచ్చితంగా ఉందని తెలియజేస్తున్నాను. ఆ తర్వాత చాలామంది అధ్యక్షులు అయ్యారు. ఇక్కడ ఒక సమస్య మనం గుర్తించాల్సిన అవసరం ఉంది. **ముఖ్యమంత్రి గారి తోడ్పాటు లేకుండా అధికార భాష అమలు చేయాలనుకోవడం దుస్సాహసమైన విషయం.** అప్పుడు. వెంగళరావు గారు ప్రపంచ తెలుగు మహా సభలను జరిపించడం, జిల్లా స్థాయిలో మొట్టమొదటిసారిగా తెలుగు ప్రవేశపెట్టింది వెంగళరావు గారి ప్రభుత్వం. అతనికి తెలుగు మీద మమకారం ఉండబట్టి అధికార భాషగా తీసుకురావాలని ఆలోచన చేయబట్టే దానికి గోపాలకృష్ణయ్య గారిని అధ్యక్షుడిగా పెట్టడం వల్ల కార్యక్రమాలు సజావుగా సాగేవి. ఆ తర్వాత ఎన్ టి రామారావు గారు ముఖ్యమంత్రి కావటం **ఆయన ముఖ్యమంత్రిగా వెనువెంటనే రాష్ట్రస్థాయిలో అధికార భాషని అమలు చేసేలా చర్యలు తీసుకోవడం జరిగింది.** ఆయన కూడా చివర్లో చాలా వేదనపడ్డారు తన హయాంలో కూడా తెలుగుని అధికార భాషగా చేసుకోలేక పోయానని. **ఆ తర్వాత అనేకమంది మహానుభావులు అధ్యక్షులుగా పని చేశారు. వారి స్థాయికి తగ్గట్టుగా వారు కృషి చేశారు. ఎవరు ఏ స్థాయిలో కృషిచేసినా కూడా ప్రభుత్వానికి చిత్తశుద్ధి లేకపోతే మాత్రం అధ్యక్షులుగా చేసే పనేమీ లేదు.** అలాంటి పరిస్థితుల్లో ముఖ్యమంత్రి కిరణ్ కుమార్ రెడ్డి గారు, ఆయన ఇంగ్లీష్ మీడియంలో చదువుకున్న వ్యక్తి. తెలుగు అంతంత మాత్రమే మాట్లాడుతారు. అలాంటి వ్యక్తికి తెలుగు మీద మమకారం కలిగి ముందుకు తీసుకెళ్లాలని ఆలోచన కలిగి, నన్ను అధికార భాషా సంఘానికి అధ్యక్షుడిగా నియమించడం జరిగింది. అయితే నేను చెప్పేది ఏంటంటే ముఖ్యమంత్రి సహకారం అందించారు కాబట్టి ఆ రోజున మేము చాలా కార్యక్రమాలు చేయగలిగాము, కొన్నింటిని ఉమామహేశ్వరరావుగారు కూడా ప్రస్తావించడం జరిగింది. ప్రజల్లో చైతన్యం రావాలి తెలుగు భాష కోసం తిరుపతిలో తెలుగు ప్రపంచ మహాసభలు జరపటమే కాకుండా గ్రామ గ్రామాల్లో కూడా కార్యక్రమాలు చేయడం జరిగింది. విద్యార్థులతో ఊరంతా ఊరేగింపులు చేయించడం కానీ, వారికి తెలుగు మీద మమకారం కలిగించటం వంటివి గాని, తెలుగు వస్త్రధారణ ధరించాలి అని చెప్పి నడిపించడం జరిగింది . అది ఒక వాతావరణం సృష్టించడానికి ఒక నేపథ్యంగా ఉపయోగపడుతుంది. ప్రజల్లో మార్పు

కోసం తప్పని పరిస్థితుల్లో చేయడం జరిగింది. దానినే కొంతమేర ప్రపంచ తెలుగు మహాసభలకు దోహదపడ్డాయి. తెలంగాణ ఉద్యమం ఉధృతంగా సాగుతున్న సమయంలో ఇలాంటి కార్యక్రమం నెత్తిన పెట్టుకొని చేయటం సామాన్యమైన విషయం కాదు అయినప్పటికీ ఎక్కడా వెనకడుగు వేయకుండా చేయడం జరిగింది.

నగర్వంగా నా హయాంలో జరిగిందని చెప్పుకోదగినటువంటివి రెండు అంశాలున్నాయి. నల్గొండ జిల్లా లో సంపూర్ణంగా అధికార భాషగా వినియోగించుకునే జిల్లాగా ప్రకటించడం జరిగింది. దానికి కారకుడు అప్పటి జిల్లా కలెక్టర్ నందివెలుగు ముక్తేశ్వరరావు గారు. తెలుగు అయినా అది కొద్ది రోజుల్లో నల్గొండ జిల్లాలో మాట్లాడే భాష పదాలన్నీ కూడా సేకరించి ఉద్యోగులకు ఇవ్వడం ద్వారా తెలుగు సంపూర్ణంగా అమలయ్యేలాగా చేశారు. దాంతోపాటు చివరికి ఆయన తీర్పులు, అప్పటి జాయింట్ కలెక్టర్ తీర్పులన్నీ సంపూర్ణంగా తెలుగులోనే ఇచ్చారు. తెలుగు తప్ప మరొకటి లేనేలేదు. దానికి కారణం ఏంటంటే కేవలం తెలుగు భాష మీద అభిమానం మాత్రమే కాదు, ప్రజల భాషలో పరిపాలన జరగాలి. ప్రజల భాషలో మనం ఏదైనా చెప్పినప్పుడే ప్రజలకు అర్థమైనప్పుడే మన ప్రణాళికలు నెరవేరతాయి. లక్ష్యం నెరవేరుతుంది. మన ప్రణాళికలు ప్రభుత్వ పథకాలు సక్రమంగా అమలవడానికి ప్రత్యేకించి భాష కూడా ప్రధాన పాత్ర వహిస్తుందన్న ఆలోచన చేయటం జరిగింది. ఆ తర్వాత రెండోది సచివాలయంలో తెలుగు అంతంత మాత్రమే! వైపరీత్యాల నివారణ సమితి శాఖకు డాక్టర్ రాధా గారు, ఆయన తమిళుడు అయినప్పటికీ కొంతమంది తెలుగు పండితులను పెట్టుకొని ఆ శాఖ మొత్తాన్ని అచ్చమైన తెలుగులోకి తీసుకొచ్చారు. నిజానికి డిజాస్టర్ మేనేజ్మెంట్ కి సంబంధించిన పదాలన్నీ చాలా సంక్లిష్టంగా ఉంటాయి. నెల్లూరులో ఒక వ్యక్తిని పిలిపించి ఆ వ్యక్తి ద్వారా ఈ ప్రకృతి వైపరీత్యాలకు సంబంధించిన ప్రతి పదాన్ని సంపూర్ణంగా అమలు చేసిన వ్యక్తి డాక్టర్ రాధా గారు. తమిళనాడు నుంచి వచ్చిన వ్యక్తియైనా, మొట్టమొదటిసారిగా సచివాలయంలో ఒక శాఖను సంపూర్ణంగా తెలుగులోకి మార్చిన ఘనత మాత్రం డాక్టర్ రాధా గారిదే! చరిత్రలో ఆయనకు ఒక స్థానం దక్కింది. పూర్వం ఉన్న అధికారులు తెలుగు వారు కాదు. తెలుగు భాష అమలు కాకపోవడానికి కారణం ఇతర భాషలకు చెందిన ఐఏఎస్‌లో ఐపీఎస్ అధికారులో అనే ప్రచారం ఉండేది. అది తప్పు అని తేలింది. ఇతర భాషల అధికారులు అధికారంలో ఉన్నప్పుడు తెలుగుని అమలు చేశారు. కాశీ పాండ్య అనే అధికారి ఉన్నారు. మొట్టమొదట తెలుగు తల్లి విగ్రహానికి సృష్టికర్త అయిన ఆయన ఒక తమిళుడే! తమిళులే మన తెలుగు మీద కూడా అభిమానం పెంచుకున్నారు. ముఖ్యంగా చెల్లప్ప లాంటివారు. అతను సంతకాన్ని ఇతర దస్త్రాలను కూడా పూర్తిగా తెలుగులోనే రాయించారు. తెలుగు భాషను అధికార భాషగా చేయాలని ప్రయత్నించిన వ్యక్తుల్లో చెల్లప్ప గారు కూడా ఒకరు. ఆయనను కూడా ఇప్పుడు మనం గుర్తు చేసుకోవాలి. **ఆ సమయంలో మినీ మ్యాథ్యూస్ అనే ప్రధాన కార్యదర్శి ఉండేవారు. ఆమె దగ్గర మేము అధికార భాష సమావేశాలు ఏర్పాటు చేసినప్పుడు, మా కేరళలో మలయాళంలోనే సంతకాలు చేస్తాం, ఇతర భాషలోకానీ, ఇంగ్లీషులో కానీ చేయం. కనుక తెలుగులోనే సంతకాలు తీసుకోవాలని ఆమె ఒక ఉత్తర్వులు జారీ చేశారు. అది చాలా గొప్ప విషయం. అందరూ తెలుగులోనే సంతకాలు చేయాలని ఆమె ఉత్తర్వులు జారీ చేశారు. ఇవాళ అధికార భాషా దినోత్సవం జరుపుకుంటున్నాము. ఈ దినోత్సవాన్ని ప్రతి సంవత్సరం కూడా జరుపుకోవాలని చెప్పి ఉత్తర్వులు ఇచ్చింది మహంతి గారు. ఆయన కూడా తెలుగువారు కాదు. కాని దృష్టిలో పెట్టుకొని మనకి అధికార భాష చట్టం అమలు యొక్క అవసరాన్ని, అధికార భాష దినోత్సవం చేయాల్సిన అవసరాన్ని అప్పటిముఖ్యమంత్రి** దృష్టికి, ప్రధాన కార్యదర్శి దృష్టికి తీసుకు వెళ్ళి ఆమోదింపజేశారు, వారు ఉత్తర్వులు కూడా జారీ చేశారు. ఒక సంవత్సరం జరిగింది. మేము ఉన్నంతకాలం అన్ని కార్యాలయాల్లో కూడా జరిపించాం. రాష్ట్ర విభజన జరిగింది, తర్వాత ఇరురాష్ట్రాలు పట్టించుకోలేదు. ఒక ప్రభుత్వ ఉత్తర్వు విడుదలైన తర్వాత అది ఎప్పటికీ అమల్లోనే ఉంటుంది, రద్దు కాదని, ఇది తప్పనిసరిగా ప్రభుత్వం జరిపించాల్సిన కార్యక్రమం అని ప్రభుత్వాలు గుర్తించాలి. బహుశా ఇప్పుడున్న వాళ్లకి ఇలాంటి కార్యక్రమం ఉన్నది అన్న సంగతి కూడా తెలియదు.

ఇప్పుడు గుర్తు చేసిన ఆ ఘనత మాత్రం తెలుగు భాషోద్యమ సమాఖ్యకి మాత్రమే దక్కింది. అప్పటి ప్రభుత్వం చేయమంది, ఒక రోజు కాదు ఐదు రోజులపాటు. ప్రతి కార్యాలయంలో కూడా అధికార భాషా దినోత్సవం జరపడం, ఎవరైతే తెలుగు భాష కృషికి పాటుపడిన ఉద్యోగస్తులు ఉంటారో వాళ్ళని గుర్తించి వారిని గౌరవించడం, సత్కరించడం చేయాలని అవతారికలో ఉంది. అవన్నీ కూడా మేము మా సమయంలో చేశాం. అలాగే జిల్లా స్థాయిలో, కింద స్థాయిలో, మండల స్థాయిలో కూడా చేయమని చెప్పడం జరిగింది.

ఇప్పుడు తెలుగు భాషోద్యమ సమాఖ్య జరిపిస్తున్న ఉత్సవాన్ని ప్రభుత్వం చేయవలసింది. ఇప్పుడు మాతృభాషా దినోత్సవం రెండు రకాలు. అవి తెలుగు భాషోద్యమ సమాఖ్య వాళ్ళ పుణ్యమే ఒకటి అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవం ఫిబ్రవరి 21. దీన్ని మొట్టమొదటగా హైదరాబాద్లో జరిపించిన ఘనత తెలుగు భాషోద్యమ సమాఖ్యదే! దాన్ని తర్వాత ప్రభుత్వం కూడా గుర్తించి కొనసాగించింది. ఆ తర్వాత గిడుగు రామ్మూర్తి గారి జయంతిని తెలుగు భాషా దినోత్సవం గా చేయాలని చెప్పగా, వీరి కోరికని ప్రభుత్వం అంగీకరించడం, అప్పటి నుంచి తెలుగు భాషా దినోత్సవంగా ఆగస్టు 29ని నిర్వహిస్తూ వస్తోంది. మూడోది **అధికార భాష దినోత్సవం కూడా నిర్వహిస్తే మూడు కార్యక్రమాలు తెలుగు భాష కోసం చేసినట్లు అవుతుంది.** దీనిలో కేవలం కవుల్ని కళాకారుల్ని సత్కరించడమే కాదు. ఎవరైతే తెలుగు భాషా పరిపాలనలో తెలుగు భాషను తీవ్రతరం చేయడానికి, పనిచేశారు. వారిని గుర్తించి గౌరవించడం, ప్రోత్సాహకాలు ప్రకటించడం చేయాల్సిన అవసరం ఉంది.

తదనంతరం ఆ కార్యక్రమాలన్నీ ఆగిపోయాయి. వాటి కోసం తెలుగు టైప్ రైటర్లని రూపొందింపజేసిన ఘనత మాత్రం పీవీ నరసింహారావు గారిది. బాంబే వెళ్లి స్వయంగా టైప్ రైటర్ ని తయారు చేయించారు. టైప్ రైటర్ కొని తెలుగు టైప్ రైటర్లకు ఇచ్చి ప్రతి కార్యాలయంలో అధికార భాషను అమలు చేయమనేవారు. కంప్యూటర్

యుగంలో ముందుకు వెళ్లి తమ భాషను మొట్టమొదటగా ప్రవేశపెట్టింది తమిళులు. అదే విధంగా మన తెలుగు భాషను కూడా కంప్యూటర్లలో ప్రవేశపెట్టాలని తెలుగు భాషోద్యమ సమాఖ్య తరపున డిమాండ్ చేశాం. కనుక ఈ రోజున పరిపాలన భాషగా తెలుగును అమలు చేయడం అతి సులువైన అంశం. అన్ని కార్యక్రమాలు కంప్యూటర్ ద్వారానే జరుగుతున్నాయి. అద్భుతమైన ఆవిష్కరణలు వచ్చాయి. ఒక పదం గుగూల్‌లో కొడితే దానికి సంబంధించి చాలా వివరాలు వస్తున్నాయి. ఇవాళ అనువాద ప్రక్రియ కూడా వచ్చింది. వాటిలో ఉమామహేశ్వరరావు గారు నిష్ణాతులు. అలాగే సెంట్రల్ యూనివర్సిటీలో చాలా ప్రయోగాలు చేశారు. తెలుగు కంప్యూటర్లలో తీసుకువస్తే తప్పు- మనం భాషా పరంగా ఏమి చేయలేము అనే ఉద్దేశంతో, ఆనాడు ఐటీ శాఖ మంత్రిగా పొన్నాల లక్ష్మయ్యగారితో తోటి కంప్యూటర్లో తెలుగు విషయమై మాట్లాడటం జరిగింది. వెనువెంటనే పది రోజుల్లో మర్రి చెన్నారెడ్డి మానవ వనరుల కేంద్రంలో ఒక సదస్సును నిర్వహించాం. అప్పుడే ఉమామహేశ్వరరావు గారి తోటి పరిచయం. ఎవరైతే ఐటీ ప్రపంచంలో సాంకేతికంగా తెలుగు భాషను గురించి కృషి చేస్తున్న వాళ్ళందర్నీ ఆహ్వానించి ఐటీ మంత్రి గారైన పొన్నాల లక్ష్మయ్య గారిని ఆహ్వానించి కార్యక్రమం చేశాం. యూనికోడ్ లో ప్రవేశించాలంటే మనం యూనికోడ్లో సభ్యత్వం తీసుకోవాలి. అని చెప్పి వీరు కోరటం దానికి అనుగుణంగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సభ్యత్వం తీసుకోవడం జరిగింది . పెద్దలందరూ వచ్చారు. వారందరి సూచనలకు అనుగుణంగా ఐటీశాఖ ద్వారానే తెలుగుకు సంబంధించిన ఉపకరణాలను చాలానే తయారు చేయించడం జరిగింది. మొట్టమొదటగా తెలుగు ఖతులు (ఫాంట్స్) (అప్పటికి రెండు మూడు తెలుగు ఖతులు ఉండేవి ఎవరో తయారు చేశారు.) మనం కొన్ని ఖతులను తయారు చేయించాలని చెప్పి దాదాపు 22 ఖతులు తయారు చేయించాం. డిక్షనరీలు వంటి వాటిని కలిపి తెలుగు విజయం అనే వెబ్సైటు పెట్టడం జరిగింది. ఎందుకంటే పరిపాలనకు అనుగుణంగా తెలుగు సైట్ కి వెళ్తే కావాల్సిన పదజాలం దొరుకుతుంది. తర్వాత యూనికోడ్ ఫాంట్స్ కూడా ఉపయోగించుకోవచ్చు అనే ఉద్దేశ్యంతో అది ఐటి శాఖ ద్వారానే తెలుగు విజయమనే వెబ్‌సైట్ ని పెట్టడం జరిగింది. రాష్ట్ర విభజన సమయంలో దాన్ని తీసివేశారు. అయితే నేను అమెరికా వెళ్ళినప్పుడు కూచిభొట్ల ఆనంద్ గారు గూగుల్ సంస్థకి తీసుకువెళ్ళారు. గూగుల్ సంస్థ దగ్గరకు వెళ్లి మేము ఇన్ని ఖతులు తయారు చేశాము, మీరు తీసుకుంటే బాగుంటుంది అని చెప్పి అడిగితే వారు పరిశీలించి స్టాండర్డ్ గా ఉంటే తీసుకుంటామని చెప్పి తీసుకున్నారు. ఇప్పుడు ప్రపంచం మొత్తం మీద మనం తయారు చేసిన ఖతులన్నీ ఉచితంగా లభిస్తున్నాయి. ఆ ఘనత గూగుల్ సంస్థది.

తెలుగు విజయం మూసేసిన తర్వాత గూగుల్ సంస్థలో గనక అవి ఉండకపోతే మనకి దొరికుండేవి కాదు. ఇప్పుడున్న పరిస్థితుల్లో అవన్నీ బూడిదలో పోసిన కార్యక్రమాలుగా మిగిలేవి. ఇప్పుడు నల్గొండ వెళ్తే తెలుగు కనబడదు. మన ప్రకృతి వైపరీత్యాల శాఖలో తెలుగు ఉందో లేదో మళ్లీ ఒకసారి చూసుకోవాలి. అలాంటి పరిస్థితి ఉంది. ఇకపోతే అదే సమయంలో ఒక ఉత్తేజకరమైన విషయం, జస్టిస్ నూతలపాటి వెంకటరమణ గారు ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తి హోదాలో తెలుగులో న్యాయ పరిష్కారాలు కావాలని ఒక వ్యాసం రాశారు. ఆ వ్యాసం చూసిన తర్వాత నేను వారి ఇంటికి వెళ్లి వారితో మాట్లాడటం జరిగింది. ఆసమయంలో వారు జుడిషియల్ అకాడమీకి అధ్యక్షులుగా కూడా ఉన్నారు. ఒక పని పట్టుకుంటే వదిలిపెట్టే మనిషి కాదు వారు .వారు ఏమన్నారంటే అధికార భాషా సంఘం, జ్యుడీషియల్ అకాడమీ కలసి అధికార భాషా సంఘాన్ని ముందుకు తీసుకెళదామని చెప్పి జూబ్లీహాల్ లో ఒక సదస్సును ఏర్పాటు చేసాం. అది ఆంధ్రప్రదేశ్ చరిత్రలో ముందు ఎన్నడు జరగలేదు, ఇకమీదట జరగదు. హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి పినాకి చంద్రఘోష్, హైకోర్టు న్యాయమూర్తులు, జిల్లా కోర్టు న్యాయమూర్తులు అప్పటి ముఖ్యమంత్రి కిరణ్ కుమార్ రెడ్డి గారు, ఆంధ్రప్రదేశ్ మంత్రులు అందరూ కూడా ఆ సమావేశానికి హాజరయ్యారు. తెలుగులో న్యాయపాలన తీసుకురావడానికి, కింద కోర్టులలో న్యాయపాలన తెలుగులో జరపాలని ఎప్పుడో మొట్టమొదటి అధికార భాష చట్టం ఇచ్చిన ఉత్తర్వులు. కేవలం హైకోర్టు, సుప్రీంకోర్టులో మాత్రమే ఇంగ్లీషు, తప్ప కింది కోర్టులన్నీ చేయొచ్చు. ఆ ఉత్సాహంతో ఆ రోజుల్లో దాదాపు 50 నుంచి 60 వరకు కింది కోర్టులలో తెలుగులో తీర్పులు వచ్చాయి. అదే సమయంలో వాళ్లకున్న ఇబ్బందులను కూడా చెప్పడం జరిగింది. ఉన్న ఇబ్బందులకు అనుగుణంగా వారికి కావాల్సిన సాంకేతిక పరిజ్ఞానం రూపొందించటం జరిగింది. ఇంతలో ఎన్.వి.రమణ గారు బదిలీ మీద ఢిల్లీ వెళ్ళిపోవడం మేమందరం రాష్ట్ర విభజన కార్యక్రమంలో ఉండిపోవడం జరిగింది. దాంతో మేం తయారు చేసిన ఉపకరణాలు ఏమయ్యాయో కూడా ఇప్పుడు తెలియదు. హైకోర్టుకి చేరలేదు, బయటికి రాలేదు. అప్పటి ఐటీ శాఖ వాళ్లు మాత్రం అన్నీ తయారు చేశారు. అవి అందినా అందకపోయినా ఇవాళ అన్నీ గూగుల్లో ఉన్నాయి. కాబట్టి పరిపాలన చేయడం చాలా సులభం.

ఇవాళ జీవోలు తెలుగులో రాని మాట వాస్తవం. కానీ తేవడం ఎంతసేపు? ఇవాళ ఇంగ్లీషులో ఉన్న పత్రికనే తెలుగులోకి మారుస్తున్నారు. ఒక జీవోని తెలుగు చేయటం ఒక బటన్ నొక్కితే తెలుగులోకి వచ్చేస్తుంది. ఆసక్తి ,తపన లేక తప్ప వేరేది కాదు. చేయించాలన్న ఆలోచన పాలకులకు లేకపోవటం ప్రత్యేకించి ఈనాటి పాలకులకు చరిత్ర తెలియకపోవటం ఆంధ్ర రాష్ట్రం ఎందుకు ఏర్పడింది ఆంధ్ర ఉద్యమం ఎందుకు ఆరంభమైంది అనేది తెలిస్తే ఈ విధంగా ప్రవర్తించరు. విషయాలు తెలిసిన వాళ్ళు గనక గత ముఖ్యమంత్రులు రామారావు గారు గానీ, వెంగళరావుగారు గాని. పివి నరసింహారావు గారిని ఉద్యమంలో నుండి వచ్చినవాళ్లు. వాళ్ళందరికీ తెలుసు. అటు పీవీ నరసింహారావుగారు గాని, తెలంగాణ ఆంధ్ర ఉద్యమం లో పోరాడిన వ్యక్తి అలాగే మిగిలిన ముఖ్యమంత్రులు సంజీవరెడ్డి, బ్రహ్మానందరెడ్డి గారు గాని ఆంధ్ర ఉద్యమం నుంచి పుట్టుకొచ్చిన వాళ్లే! వాళ్లందరికీ విషయాలు తెలుసు. కానీ ఇప్పుడు ఉన్న వాళ్ళకి తెలీదు. తెలుసుకోవాలని ఆలోచన లేదు. ఇది పెద్ద ప్రమాదకరమైన అంశంగా పరిణమించింది. ఇలాంటి పరిస్థితుల్లో ఆ రోజుల్లో మేము చేసిన అన్ని కార్యక్రమాలు దాదాపు మటుమాయం అయ్యాయని చెప్పొచ్చు. ఇంకొకటి, కార్మికశాఖ వారు నామ ఫలకాలని తెలుగులోనే ఉండాలని, తెలుగులో లేకపోతే జరిమానా వేసే విధంగా ఒక చట్టం

ఉంది. అవన్నీ కూడా నేను అధికార భాష సంఘం అధ్యక్షునిగా ఉన్నప్పుడు అన్నింటిని అమలు చేశాం. కొన్ని చోట్ల జరిమానాలు కూడా విధించాం. చాలా పెద్ద వ్యక్తి ఆయన కూడా తెలుగు భాష కోసం పాటుపడిన వ్యక్తి, ఫోన్ చేసి మీరు ఇలా జరిమానాలు బలవంతంగా విధించడం, మంచిదేనా అని ప్రశ్న వేయడం కూడా జరిగింది. చాలా వత్తిడులు వచ్చాయి. అయినా సంతోషకరమైన విషయం ఏంటంటే హైదరాబాదులో పెద్ద మాల్ ఉంది దానిలో తెలుగులో రాయటానికి వాళ్ళు ఇష్టపడలేదు. ఇష్టం లేక ముఖ్యమంత్రి మీద ఒత్తిడి తీసుకొచ్చారు. అయితే కిరణ్ కుమార్ రెడ్డి గారు ఒప్పుకోలేదు. కచ్చితంగా రాయాల్సిందే, నువ్వు గాని రాయకపోతే ఎవరు రాయరు. అంచేత రాయాల్సిందే అని రాయించారు. అక్కడ ముఖ్యమంత్రి తల ఒగ్గితే మొత్తం పోయేది. **ఎందుకు ఇదంతా చెప్తున్నాను అంటే అధికార భాషా చట్టం అమలు చేయడం అనేది ముఖ్యమంత్రి మీద ఆధారపడి ఉంటుంది.** అధికార భాషా సంఘ అధ్యక్షుని వల్ల కాదు. ముఖ్యమంత్రి ఆదేశాల మేరకు ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి పని చేస్తాడు. అజెండాలో అధికార భాష లేదో అప్పుడు అది అమలు జరగదు. ఒక్క ఎన్టీ రామారావు గారి అజెండాలో మాత్రమే అది ఉంది. ఏ సమావేశమైనా గానీ అధికార భాష గురించి మాట్లాడుతూ ఉండేవారు. తరువాత వచ్చినవారు దానిని పట్టించుకున్న దాఖలాలు లేవు. వీటన్నింటి కంటే ప్రధానమైనది, విద్యకు అధికారభాష సంఘానికి సంబంధం లేదు. కానీ విద్యారంగంలో తెలుగు లేకుండా ఏది జరిగే వ్యవహారం కాదు. అందుకని విద్యారంగం మీద దృష్టి పెట్టిన వారు శైలజనాథ్ గారు. ప్రాథమిక విద్యామంత్రి గా ఉండేవారు. వారితో సమావేశం ఏర్పాటు చేసినప్పుడు కచ్చితంగా తెలుగుని చదవాలని చెప్పి గతంలో ఉన్న జీవోలని అమలు చేయించే ప్రయత్నం చేశాం. ప్రధానమైనది ఇంటర్మీడియట్ స్థాయిలో ద్వితీయ భాషగా కూడా తెలుగు తీసుకోవడం లేదు. ఇక్కడ సంస్కృతాన్ని తీసుకుంటున్నారు. ఏ భాషలో అయినా రాయొచ్చు. అప్పుడు దీనికి పరిష్కారం కోసం అప్పటి మంత్రి పార్థసారధి గారు ఇంటర్మీడియట్ బోర్డు వారితో మాట్లాడి, తెలుగు ఉంటుంది కాబట్టి తేలికగా మార్కులు వచ్చే విధంగా చేయడం ఒకటి, సంస్కృతాన్ని తీసేయకుండా సంస్కృతాన్ని నాగరి లిపిలో మాత్రమే రాయాలి ఇతర భాషలో రాస్తే మార్కులు వేసే ప్రసక్తే లేదని జీవో తేవడం జరిగింది. ఈ పరిస్థితికి కారణం కార్పొరేట్ విద్యాసంస్థలు ఒక్క మాటలో చెప్పాలంటే ఏ ప్రభుత్వం వచ్చినా కూడా ఇవాళ విద్యారంగం కార్పొరేట్ల కనుసన్నల్లో నడుస్తోంది. ఈ కార్పొరేట్ విద్యాసంస్థలు ఆ జివోని తొక్కిపెట్టి అమల్లోకి రానివ్వలేదు. అది అమలయ్యుంటే తెలుగు తీసుకుని చాలామంది ముందుకు వెళ్లేవారు.

మాకు ఇంకో పరీక్ష వచ్చింది, యూపీఎస్సీలో తెలుగు తీసేసారు. దేశవ్యాప్తంగా అది సమస్యగా మారింది. అది మిగతా భాషలను కూడా తీసేయడం జరిగింది. అలాంటి సమయంలో కర్ణాటకలో కన్నడ ప్రాధికార సంస్థ అధ్యక్షుడిగా ముఖ్యమంత్రి చంద్రుగారు ఉన్నారు. అప్పుడు బెంగళూరుకి వెళ్లి ఆయన నేను కలిసి కేంద్ర ప్రభుత్వాన్ని డిమాండ్ చేయడం జరిగింది. ప్రాంతీయ భాషల్లో యుపిఎస్సిని చేర్చాలని కోరడం జరిగింది. నారాయణస్వామి గారు మంత్రిగా ప్రాంతీయ భాషల్లో యూపీఎస్సీలో చేయాలని చెప్పి తెలుగుని కూడా చేర్చడం జరిగింది. తెలుగు భాషోద్యమ సమాఖ్య అధ్యక్షుడు వెంటనే ఆంధ్రప్రదేశ్ హైకోర్టును కదిలించడంతో కేంద్ర చట్టసభల్లో ప్రస్తావన వచ్చింది. చివరకు సానుకూల ఫలితాలు వచ్చి తెలుగుతో సహా మాతృభాషలకు యుపిఎస్సి పరీక్షల్లో స్థానం సురక్షితమైంది పోటీ పరీక్షల్లో తెలుగు అనే చాలా పెద్ద కార్యక్రమం చేసాం. ఈ రకంగా ప్రతి అంశం మీద స్పందించి మొత్తానికి తెలుగు అమలు చేయాలని ప్రయత్నం చేయడం జరిగింది. అదంతా చక్కటి రూపు దాల్చిన పరిస్థితిలో ఈ రాష్ట్ర విభజన జరగటం రాష్ట్ర విభజన తర్వాత ఇరు రాష్ట్రాల ప్రభుత్వాలు కూడా విషయం గురించి ఆలోచన చేయకపోవడం, దాంతో ఇవాళ అధికార భాష విషయం గురించి గుంటుపల్లి శ్రీనివాస్ గారు న్యాయస్థానాన్ని ఆశ్రయించే పరిస్థితి వచ్చింది. ఇప్పుడు ఏతావాతా ఏంటంటే ఈ ఆంధ్రదేశంలో మాత్రం ఏ పని జరగాలన్నా న్యాయస్థానానికి వెళ్లి తెచ్చుకోవాల్సిన పరిస్థితి. ఏర్పడింది. పాలకులు ప్రజా ప్రభుత్వాలు ఆలోచించే పనిలేదు. అంచేత న్యాయస్థానాలు తగిన విధంగా తీర్పులు ఇస్తే అధికార భాషా చట్టం అమల్లోకి వచ్చినా లేదా విద్యా రంగంలో మరలా తెలుగు వికసించినా, ప్రాధికార సంస్థ ఏర్పాటైనా, అది చివరకు గుంటుపల్లి శ్రీనివాస్ గారి పుణ్యమే అవుతుంది.

ఈ సందర్భంలో ప్రజలలో చైతన్యం తీసుకురావడం చాలా ప్రధానమైనటువంటి అంశం. గతంలో కూడా వీపీ రాఘవచారి గారు అనే ఎమ్మెల్సీ ఉండేవారు, వారి అధ్యక్షతన ఒక సంఘం ఉండేది. వారి ముఖ్య కార్యక్రమం అధికార భాషకు సంబంధించి పెద్ద ఎత్తున కార్యక్రమాలు జిల్లాల వారీగా నిర్వహించడం. చాలా చక్కటి పుస్తకాలు కూడా వేయించారు. అధికార భాష గురించి పెద్దలందరినీ కలుపుకొని కార్యక్రమాలు జరిగేవి. ఇవన్నీ 1974కు పూర్వం. తిరిగి అలాంటి కార్యక్రమాలు ఇప్పుడు చేపట్టడానికి ఈరోజు తెలుగు భాషోద్యమ సమాఖ్య ముందుకు వచ్చినందుకు నేను హృదయపూర్వకంగా అభినందిస్తూ ఇవాళ భాష మీద మన భాష గొప్పది అని చెప్పే విషయం కాదు, మన ప్రజానీకానికి అందరికీ ఇంగ్లీష్ రాదు గ్రామీణ ప్రాంతాల్లో బస్సు మీద ఇంగ్లీష్ లో రాసి ఉంటుంది. ఎవర్నో అడగాలి. వాళ్ళు ఏదో చెప్తారు. ఇవాళ ఎక్కడ ఏ వినియోగ వస్తువు మీద కూడా తెలుగు ఉండదు. రైతు వాడే ఎరువులు మీద కూడా తెలుగులో లేకుండా ఇంగ్లీష్‌లో ముద్రిస్తే రైతుకు ఏం తెలుస్తుంది? అసలు మన భారతదేశం యొక్క స్వాతంత్రోద్యమ లక్ష్యం ఏంటంటే ఇవాళ మాతృభాషలో పరిపాలన సాగాలి. అదే మొట్టమొదటి లక్ష్యం. దాని గురించే లాలా లజపతిరాయ్ పోరాటం చేశాడు. రవీంద్రనాథ్ ఠాగూర్ వంగదేశంలో చేశారు. అలాగే ఆనాటి నాయకులందరూ కూడా చేశారు. మనం ఇక్కడ ఆంధ్ర ఉద్యమం పేరిట మన నాయకులు అందరూ కూడా చేయడం జరిగింది. రాష్ట్రంలో అధికార భాషగా చేసుకునే అవకాశం కల్పించింది భారత రాజ్యాంగం అని మనం గుర్తు చేసుకుని ఇవాళ అధికారభాష చట్టం ఏర్పడిన రోజు గనుక ఈ అధికార భాష చట్టం అమలు చేయమని చెప్పి ప్రభుత్వాన్ని వత్తిడి చేయడమే కాకుండా ప్రజల్లో కూడా అవగాహన కల్పించడానికి ఈ ప్రజా చైతన్య సభ ఉపకరిస్తుంది అని భావిస్తున్నాను అని అన్నారు మండలి బుద్ధ ప్రసాద్ అ

గమనిక: మాట్లాడిన ముఖ్యులలో శ్రీ సి.మధు, డా. గుంటుపల్లి శ్రీనివాస్ ఉన్నారు. వాటిని వివరంగా రానున్న నెల 'అమ్మనుడి'లో ఇస్తాము. వామపక్షనేత మధుగారు ఆయన అధ్యక్షులుగా వున్న 'మాకినేని బసవపున్నయ్య విజ్ఞాన కేంద్రం' వారి పూర్తి సహాయం 'తెలుగు భాషోద్యమ సమాఖ్య' ఉంటుందని ప్రకటించారు.

డా. గుంటుపల్లి శ్రీనివాస్ తనంతట తానుగా విద్య,పాలనారంగాలలో ప్రజల భాష తెలుగుకు జరుగుతున్న అన్యాయానికి కినుక వహించి న్యాయస్థానాల్లో పోరాటాలు చేస్తున్న వ్యక్తి. తెలుగు భాషోద్యమ సమాఖ్య కార్యక్రమాలతో ఏకీభావం తెలిపి, సమాఖ్య కార్యదర్శివర్గంలో ఒకరుగా వున్నారు. అ

### మాతృభాషల మీద హిందీ పెత్తనం

తెలుగు భాషాభిమానులు కూడా తమ గురిని ఇంగ్లీషు మీద పెట్టి, హిందీ వ్యాప్తిలోని ప్రమాదాన్ని గమనించడం లేదు. ఇంగ్లీషు చదువుల వల్ల తెలుగువారి స్థాయి పెరుగుతుందే తప్ప,దగ్గదు.కాని హిందీ వ్యాప్తి వల్ల తెలుగువారు దేశంలో రెండోతరగతి పౌరులుగా మారతారు. ఇంగ్లీషు తనతో పాటు అంతో ఇంతో తెలుగును కూడా అనుమతిస్తుంది.. కాని హిందీ తెలుగు స్థానంలోకి రావాలనుకుంటోంది. ఇంగ్లీషు బదులు హిందీ వాడండి. మీ సొంత భాషకు ప్రమాదముండదు అని కేంద్ర పెద్దలు చెబుతారు కానీ, ఇంగ్లీషు అట్లాగే వుంటూ, హిందీ పెత్తనం మాతృభాషల మీద పెరుగుతోంది. (ఆంధ్రజ్యోతి 1,ఏప్రిల్ 2023 సంపాదకీయం నుండి..)

# అధికార భాషా సంఘం అధ్యక్షులు శ్రీ పి.విజయబాబు గారికి బహిరంగ లేఖ



అయ్యా! 17/05/2023న మీరు నిర్వహించిన పత్రికా సమావేశంలో తెలిపిన అంశాలు కొన్ని అవాస్తవాలు, మరికొన్ని పరస్పర విరుద్ధ అంశాలు.

1. పత్రికా సమావేశం మొదట్లో అధికార భాషగా తెలుగును పగడ్బందీగా అమలు చేస్తున్నామని చెప్పారు ... అదే సమావేశం చివరిలో మరియు విలేకరుల ప్రశ్నలకు సమాధానం చెబుతూ 'తెలుగును అధికార భాషగా అమలు చేయడమనేది ఒక రోజులో జరిగే పని కాదని, ప్రభుత్వ కార్యాలయాల్లో ఉత్తరప్రత్యుత్తరాలు తెలుగులో జరిపేలా ఆదేశాలు ఇవ్వాలని చీఫ్ సెక్రటరీ గారికి కూడా లేఖ రాశారని చెప్పారు'. ఈ విరుద్ధ అంశాలలో ఏది వాస్తవం?

2. అధికార భాషా చట్టాన్ని అమలు పరచాలని దాఖలైన ప్రజాప్రయోజన వ్యాజ్యం (WP (PIL) 251/2021) లో ప్రభుత్వం దాఖలు పరిచిన కౌంటర్ల లోని పట్టికలను... పత్రికా సమావేశంలో చెప్పారు మరియు విలేఖరులకు అందించారు. నిజానికి అందులో జిల్లా స్థాయిలో 'సగటున సుమారు 55% మాత్రమే' తెలుగును అధికారభాషగా అమలు పరుస్తున్నట్లుగా చూపించిన గణాంకాలు ... ఆయా శాఖల జిల్లాస్థాయి అధికారులు స్వీయ ధ్రువీకరణ (self declaration) ప్రొఫార్మాలలో నింపినవే కానీ, తమ కింది స్థాయి కార్యాలయాలను తనిఖీ చేసి నిజానిజాలను పరిశీలించిన తర్వాత తయారుచేయబడిన గణాంకాల పట్టికలు కాదు.

విలేకరులకు తమరు తెలియజేయని అత్యంత ముఖ్యమైన విషయం 'రాష్ట్ర సచివాలయంలో మరియు వివిధ డిపార్ట్మెంట్ల హెడ్ ఆఫీసులలో...తెలుగును అధికార భాషగా అమలు గురించిన గణాంకాలు ఇవ్వకపోవడం !' ...... కనీసం గడచిన ఆరు నెలల్లో ఎన్ని ప్రభుత్వ ఉత్తర్వులు (జీవోలు) తెలుగులో ఇచ్చారు అనే గణాంకాలు అయినా విలేకరులకు తెలియజేసి ఉన్నట్లయితే, వాస్తవాలు ప్రజలకు తెలియజేసిన వారయ్యేవారు.

3. అధికార భాషా సంఘానికి చట్టపరంగా చాలా పరిమితులు ఉన్నాయని మాకు తెలుసు. నిజానికి అధికార భాషా సంఘం యొక్క ముఖ్య విధులు 'తనిఖీ చేయడం,సమీక్షించడం, ప్రభుత్వానికి సూచనలు చేయడం మరియు నివేదికలు ఇవ్వడం మాత్రమే'.

తెలుగును అధికారభాషగా అమలు పరచడంలో కీలక పాత్ర ముఖ్యమంత్రి, మంత్రులు, ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి మరియు ఇతర కార్యదర్శులదే.

చట్టంలో మీకున్న పరిమితులకు లోబడి, మీకున్న ఆర్థిక వనరులతో... కనీసం అధికార భాషా సంఘానికి ఒక చక్కటి వెబ్సైటును ఏర్పాటుచేసి, అందులో నెలవారీ సమీక్షల పూర్తి వివరాలు, అధికారభాష అమలు గురించి ప్రతీ ప్రభుత్వ కార్యాలయం విధిగా నెలవారీ ఇవ్వాల్సిన నివేదికలు మరియు అధికార భాషా సంఘం తప్పనిసరిగా ఆరు నెలలకోసారి ప్రభుత్వానికి సమర్పించాల్సిన నివేదికలు మరియు ఇతర అంశాలు అన్నీ వెబ్సైట్లో పెట్టి ప్రజలందరికీ అందుబాటులో ఉంచగలరు.

డాక్టర్ గుంటుపల్లి శ్రీనివాస్.
18/05/2023.

# హైదరాబాద్‌లో ప్రజాచైతన్య సభ

# సాంకేతికంగా తెలుగును పరిపాలనలో పూర్తిగా వినియోగించాలి




ప్రసంగిస్తున్న తెలుగు భాషోద్యమ సమాఖ్య తెలంగాణ సంయోజకులు డా. గంధం సుబ్బా,రావు, వేదికపై సభాధ్యక్షులు ఆచార్య గారపాటి ఉమామహేశ్వరరావు, వక్తలు ఆచార్య బెల్లంకొండ రాజశేఖర్. డా.నందని సిధారెడ్డి, డా.సి.భవానీదేవి.

తెలుగు భాషోద్యమ సమాఖ్య-ప్రజల్లోనూ, ప్రభుత్వంలోనూ పాలనాభాషగా తెలుగును అమలు చేసే విషయంలో చైతన్యాన్ని పెంచేందుకు ఏర్పాటు చేస్తున్న సమావేశాల పరంపరలో భాగంగా 28మే 2023 సాయంత్రం హైదరాబాద్‌లోని పుచ్చలపల్లి సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో ప్రజాచైతన్యసభ జరిగింది.

ఈ కార్యక్రమంలో ముఖ్య అతిథిగా తెలంగాణ సాహిత్య అకాడమీ పూర్వ అధ్యక్షులు డా.నందిని సిధారెడ్డిగారు, వక్తలుగా హైదరాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయం పూర్వ-ప్రో వైస్ ఛాన్సలర్ ఆచార్య బెల్లంకొండ రాజశేఖర్‌గారు, విశ్రాంత ప్రభుత్వ ఉపకార్యదర్శి డా.సి.భవానీదేవిగారు పాల్గొన్నారు. తెలుగు భాషోద్యమ సమాఖ్య అధ్యక్షులు ఆచార్య గారపాటి ఉమామహేశ్వరరావుగారు సభకు అధ్యక్షత వహించారు.

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం విశ్రాంత డిప్యూటీ రిజిస్ట్రార్ డా.గంధం సుబ్బారావు అతిథులకు స్వాగతం చెప్పారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ, యూ.ఎస్.లోని నార్త్ కరోలినా రాష్ట్రంలో గల ఛార్లట్ పట్టణ మేయర్, 28 మే 2023వ తేదీని 'తెలుగు హెరిటేజ్ దినోత్సవం' గా ప్రకటించారని, అంతేకాకుండా, నార్త్ కరోలినా రాష్ట్ర గవర్నర్ 28 మే 2023 నుంచి 3 జూన్ 2023 వరకు ఒక వారం పాటు మొత్తం నార్త్ కరోలినా రాష్ట్రంలో 'తెలుగు హెరిటేజ్ వీక్' జరుపుతున్నట్లుగా ప్రకటించారని సభికుల హర్షధ్వానాల మధ్య తెలియజేశారు. (ఈ సంచిక 3వ అట్టపై ఫొటోలు చూడండి)

సభకు అధ్యక్షత వహించిన ఆచార్య ఉమామహేశ్వరరావు మే 28వ తేదీకి గల ప్రాముఖ్యాన్ని తెలియజేస్తూ, ఆరోజు ఇద్దరు మహాపురుషులు జన్మించిన దినమని - ఒకరు తెలుగువారి సాంఘిక చరిత్రను రచించిన సురవరం ప్రతాపరెడ్డి గారని, రెండవది తెలుగువారి ఆత్మగౌరవానికి ప్రతీకగా నిలచిన 'విశ్వ విఖ్యాత నటసార్వభౌముడు', ఆంధ్రప్రదేశ్ పూర్వ ముఖ్యమంత్రి ఎన్.టి.రామారావు గారని, ఈ ప్రాధాన్యతను దృష్టిలో వుంచుకుని ఈ రోజు ప్రజాచైతన్య సభను నిర్వహిస్తున్నామని తెలియజేశారు. రోజురోజుకూ తెలుగు వాడకం తగ్గిపోతున్నదని, ఈపరిస్థితి ఇలాగే కొనసాగితే కొంత కాలానికి తెలుగు మనగడే ప్రశ్నార్థకంగా మారే ప్రమాదముందని ఆయన అవేదన వ్యక్తం చేశారు.

ముఖ్య అతిథిగా విచ్చేసిన డా.నందిని సిధారెడ్డి మాట్లాడుతూ తెలుగుభాష పట్ల ప్రజల్లోనూ, ప్రభుత్వంలోనూ చైతన్యం తీసుకురావడానికి తెలుగు భాషోద్యమ సమాఖ్య డా.సామల రమేష్‌బాబు గారి నేతృత్వంలోనూ, ఆచార్య గారపాటి ఉమామహేశ్వరారావు గారి ఆధ్యర్యంలోనూ గొప్పగా కృషి చేస్తున్నదని అన్నారు. తెలుగుభాష అంతరించిపోతుందని దిగులు పడవలసిన అవసరం లేదని, తెలుగు మీడియా వల్ల తెలుగుభాష ప్రాధాన్యత రోజురోజుకూ పెరుగుతుందని అంటూ తెలుగు అంతరించిపోయే ప్రమాదం వుందని మనమే అంటూవుంటే యువత తెలుగు నేర్చుకోవడానికి ముందుకురారని అన్నారు.

వక్తగా విచ్చేసిన ఆచార్య బెల్లంకొండ రాజశేఖర్ మాట్లాడుతూ తెలుగులోకి పాఠ్యగ్రంథాలను అనువదించడం, పరీక్షల నిర్వాహణ వంటి అంశాలలో గల సాధకబాధలను వివరంగా తెలియజేశారు. పిల్లలకు తెలుగుతో పాటు, ఇంగ్లీషు కూడా నేర్పాలని ఆయన అంటూ, ఫోన్ పే, గూగుల్ పే వంటి దైనందిన కార్యకలాపాలలో ఉపయోగపడే యాప్‌లను తెలుగులో కూడా రూపొందించవలసిందిగా ఆయా యాజమాన్యాలను కొరాలని ఆయన అన్నారు.సాంకేతికంగా తెలుగును సరిగా వినియోగించుకుంటే పరిపాలనలో తెలుగును పూర్తిగా వినియోగించుకోగలం అని అన్నారు .

డా.సి.భవానీదేవి మాట్లాడుతూ, పాలనారంగంలో తెలుగు అమలు విషయంలో గత ముప్పై సంవత్సరాలుగా తనకు ఎదురైన అనుభవాలను తెలియజేశారు. ప్రభుత్వం సహకరించకపోతే మన పిల్లలకు మనమే ఇండ్లలో తెలుగు నేర్పించి,తెలుగును కాపాడుకోవాలని అన్నారు.

# నెల్లూరులో ప్రజాచైతన్య సభ

# పరిపాలన ప్రజలభాషలోనే నిర్వహించాలి




ప్రసంగిస్తున్న తెలుగు భాషోద్యమ సమాఖ్య గౌరవాధ్యక్షులు డా.సామల రమేష్‌బాబు., వేదికపై సభాధ్యక్షులు శ్రీ చలంచర్ల భాస్కర రెడ్డి, వక్తలు డా.గుంటుపల్లి శ్రీనివాస్,నెల్లూరు జిల్లా రచయిత సంఘం అధ్యక్ష, ప్రధాన కార్యదర్శులు జయప్రకాష్, డా. పాతూరి అన్నపూర్ణ.

రెండు తెలుగురాష్ట్రాలలో పరిపాలన ప్రజలభాషలోనే నిర్వహించాలని తెలుగు భాషోద్యమ సమాఖ్య గౌరవాధ్యక్షుడు డా. సామల రమేష్‌బాబు అన్నారు. మే 28వ తేదీన నెల్లూరు టౌన్‌హాలులోని ఏసీ హాలులో జరిగిన ప్రజాచైతన్య సభలో ముఖ్యఅతిథిగా ఆయన మాట్లాడుతూ 1966 మే 14న తెలుగుభాషను అధికారభాషగా పాలనాభాషగా ప్రకటిస్తూ చట్టం వచ్చిందని అన్నారు. ఇంతవరకు అది సరిగా అమలుకావడం లేదని ఆయన ఆవేదన వ్యక్తం చేశారు. రెండు తెలుగురాష్ట్రాలలో పరిపాలన తెలుగులోనే జరగాలని ఆయన కోరారు.

ప్రభుత్వ ఉత్తర్వులు (జి.వొ.లు) అన్నీ ఇంగ్లీషులోనే వస్తుంటే ఇవి తెలుగు రాష్ట్రాలెలా అవుతాయని, తెలుగును అన్ని స్థాయిల్లో అమలుచేసి తీరాలని,తమ మేనిఫెస్టోల్లో ఈ విషయమై పేర్కొన్న పార్టీలకే రానున్న ఎన్నికలలో ఓటు వేస్తామని ప్రచారం చేయాలని అన్నారు. ఇంతవరకు ఎన్నో సార్లు న్యాయస్థానాలు ప్రభుత్వాలను ఇదే అంశంపై చివాట్లు పెట్టినా, కేవలం ముఖ్యమంత్రులు, మంత్రులు పట్టించుకోకపోవడం వల్లనే ఈ సమస్య పరిష్కారం కావడం లేదన్నారు. పాలకులకే ఆత్మగౌరవం లేనప్పుడు ప్రజల పరిస్థితి ఏమిటి అని ఆయన అన్నారు.బాగా అభివృద్ధి చెందిన ప్రపంచంలోనే 7వ పెద్ద భాష అయిన తెలుగు ప్రజల ప్రభుత్వాలు పరిపాలనను తెలుగులో సాగించలేకపోతున్నాయంటే, మనల్ని చూసి అందరూ నవ్వుకుంటున్నారని ఆయన అన్నారు.పార్లమెంటులో తెలుగులో మాట్లాడే హక్కు సభ్యులకు ఉందని కేంద్రంతో కూడా ఉత్తరప్రత్యుత్తరాలు తెలుగులో చేయవచ్చని ఆయన అన్నారు.తెలుగు ప్రాంతీయభాష కాదని, జాతీయభాష అని ఆయన పేర్కొన్నారు.

సమాఖ్య కార్యదర్శివర్గ సభ్యులు డాక్టర్ గుంటుపల్లి శ్రీనివాస్ మాట్లాడుతూ గ్రామస్థాయి నుండి రాష్ట్ర స్థాయి వరకు తెలుగు భాషలోనే కార్యక్రమాలు నిర్వహించాలని విజ్ఞప్తి చేశారు. న్యాయస్థానాల్లో కూడా తీర్పులు ప్రజాభాషలోనే రావాలన్నారు. భాష ఆత్మగౌరవానికి చిహ్నమని, ఒక మాతృభాష అన్నిరంగాల్లో అమలయ్యేందుకు తెలుగు భాషోద్యమ సమాఖ్య సంవత్సరం పాటు కార్యక్రమాలు చేపడుతుందని అన్నారు. యువత విద్యార్థులు భాషపై మక్కువ పెంచుకుని మాతృభాషలోనే విద్యను కొనసాగించాలని ఆయన కోరారు.ప్రాథమిక విద్యలో మాతృభాష కోసం.పరిపాలనలో తెలుగు వినియోగం కోసం, తాను న్యాయస్థానాలలో ఎలా పోరాడుతున్నదీ ఆయన వివరించారు.

ఈ కార్యక్రమానికి చల్లంచర్ల భాస్కర్‌రెడ్డి అధ్యక్షత వహించారు.భాషా రాష్ట్రాలు ఏర్పడినా, మన భాషలోనే పాలించండి అని మన ప్రభుత్వాలనే 60 ఏళ్ళపాటు వేడుకొన్నా, ప్రయోజనం లేకుండా పోతుందని అన్నారు. చట్టాలు,జి.ఒలు లేక కాదు, వాటిని అమలు చేయకపోవడం వల్లే ఈ పరిస్థితి దాపురించిందని అందుకు కారణం పాలకుల పట్టనితనం కాక మరేముంటుంది అన్నారాయన. కేవలం ఉత్తర్వులిచ్చి చేతెమె దులుపుకోవడం పాలకులకు అలవాటయిపోయింది. అని పాతికేళ్ళకుపైగా తెలుగుకోసం ఉద్యమిస్తున్న ఆయన తన ఆందోళనను వ్యక్తం చేశారు.

ఈ సమావేశంలో పద్య కళాపరిషత్ అధ్యక్షులు మెట్టు రామచంద్ర ప్రసాద్, నెల్లూరు జిల్లా రచయిత సంఘం అధ్యక్ష,ప్రధాన కార్యదర్శులు జయప్రకాష్, డా. పాతూరి అన్నపూర్ణ ప్రసంగించారు

**రాజ్యాంగం గుర్తించిన 22 భాషలూ జాతీయ భాషలే**

### తెనాలిలో ప్రజాచైతన్య సభ

# మాతృభాషలో పరిపాలన కోసం ఉద్యమంలో తెనాలిముందు వరుసలో నిలబడాలి




ప్రసంగిస్తున్న శాసనమండలి సభ్యులు శ్రీ కె.యస్.లక్షణరావు, వేదికపై డా. రమేష్‌బాబు, శ్రీ దావులూరి లక్ష్మీకాంతారావు,డా.వెన్నిసెట్టి సింగారావు

భాషోద్యమ సమాఖ్య ఉద్యమాన్ని మరలా చేపట్టిందని డా.రమేష్‌బాబు అన్నారు. రానున్న ఎన్నికల్లో తమ భాషా విధానాన్ని ప్రకటించాలని సమాఖ్య రాజకీయపార్టీలను డిమాండ్ చేస్తుందన్నారు. సమాఖ్యఆంధ్రప్రదేశ్ సమావేశకర్త శ్రీ వెన్నిసెట్టి సింగారావు - ప్రజల నిత్యజీవితంలో తెలుగును వాడుకలో పెంపొందించుకోవాలని చెపుతూ- ప్రతి ఇంటిపై తెలుగులో పేరుండాలని, సంతకం తెలుగులో చెయ్యడం మన ఆత్మ గౌరవం సంకేతం అని చెప్పారు.

ఇప్పుడు సమాఖ్య చేపడుతున్న ఉద్యమం నిజానికి పాతదే. దీనిపైన కొన్ని సార్లు ఉన్నత న్యాయస్థానాలకు వెళ్లాము. ప్రతిసారీ కోర్టులు సమాఖ్య కోరికలను ఆమోదించి, సానుకూల ఆదేశాలిచ్చాయి.ఐనా ముఖ్యమంత్రులలో, మంత్రులలో సంకల్పబలం లేనందునే అధికారులు పట్టించుకోవడం లేదు అని ఆయన అన్నారు. ఈసారి ఉద్యమం మరికొంత ముందడుగుకు ఉద్దేశించబడింది. ఇందులో ప్రజల భాగస్వామ్యం బాగా వుంటుంది-అని ఆయన వివరించారు.

మే 27వ తేదీన తెనాలి ఆంధ్రప్రదేశ్ పెన్షనర్స్ అసోసియేషన్ సమావేశ మందిరంలో తెలుగు భాషోద్యమ సమాఖ్య అధ్వర్యంలో ప్రజా చైతన్య సభ జరిగింది. కాకతీయ బ్యాంకు ఛైర్మన్ శ్రీ దావులూరి కాంతారావుగారి అధ్యక్షతన జరిగిన ఈ సమావేశంలో సమాఖ్య కేంద్ర కమిటీ సభ్యులు శ్రీ యఱ్ఱంశెట్టి హనుమంతరావు స్వాగతోపన్యాసం చేశారు. ముఖ్య వక్తలుగా శాసనమండలి సభ్యులు శ్రీ కె.ఎస్.లక్ష్మణరావు,సమాఖ్య గౌరవాధ్యక్షులు డా.సామల రమేష్‌బాబు,డా.వెన్నిసెట్టి సింగారావు గారు పాల్గొన్నారు. ఈ సందర్భంగా శ్రీ కాంతారావు మాట్లాడుతూ శ్రీ నందమూరి తారక రామారావు తెలుగుజాతి ఆత్మగౌరవాన్ని తట్టి లేపారని,ఆయన పాలనలో పరిపాలన తెలుగులోనే సాగించారని అన్నారు. తెలుగు భాష పరిరక్షణకు అందరూ ఉద్యమించాలని అన్నారు.

డా.రమేష్‌బాబు మాట్లాడుతూ ప్రజల భాషలో పరిపాలన జరగాలి. న్యాయస్థానాల్లో తీర్పులతో సహా అన్ని వ్యవహారాల్లో తెలుగుకు ప్రాధాన్యత కల్పించాలని అన్నారు.అనేక ఉద్యమాలకు నిలయం తెనాలి. మాతృభాషలో అన్ని స్థాయిల్లో పరిపాలనను సాధించడంలో కూడా తెనాలి ముందుండాలని అన్నారు.

కేంద్రం చట్టసభల్లో తెలుగు సభ్యులు తమ ప్రసంగాలను తెలుగులోనే చెయ్యాలని, తెలుగు జాతి ఆత్మ గౌరవాన్ని ఎలుగెత్తి చాటాలని, ఇందుకోసం సమాఖ్య,వారివెంట పడుతుందని అన్నారు. రాజ్యాంగం, చట్టాలు, అన్ని భాషాప్రయుక్త రాష్ట్రాల్లో మాతృభాషలలో పాలన సాగాలని, చదువులు చెప్పాలని నిర్దేశించినా, ప్రభుత్వాలు కదలడం లేదని, అందువల్ల వారు కదిలేట్లు చేయడానికే తెలుగు

కార్యక్రమంలో ఎం.ఎల్.సి శ్రీ కె.యస్. లక్ష్మణరావు ప్రసంగిస్తూ 'భారతదేశం జాతుల సమాఖ్య.మన రాజ్యాంగం 22 భాషలను గుర్తించింది. ఇవన్నీ జాతీయ భాషలే. ప్రస్తుతం కేంద్రంలో అధికారంలో వున్నవారు దేశానికి ఒకటే జాతీయభాష అంటున్నారు. భాష, చరిత్ర, సంస్కృతి, సంప్రదాయాలు ఇవన్నీ కలిసి జాతిగా గుర్తించబడుతుంది. ఆవిధంగా మనం తెలుగుజాతివాళ్ళం. రాజ్యాంగంలోని 22 జాతీయ భాషల్లోనూ సివిల్స్ పరీక్షలు రాసుకోవచ్చు. అన్ని భాషలూ సమానమే అని శ్రీ లక్ష్మణరావు అన్నారు. తెలుగులోనే తెలుగు రాష్ట్రాలలో పరిపాలన సాగాలని, ఈ విషయంలో ప్రభుత్వం వద్దకు వెళ్ళవలసిన కార్యక్రమాలలో తమ సహకారం ఉంటుదని, ఉద్యమాలతో తాను సహకరిస్తానని ఆయన అన్నారు. ఉద్యమ సంస్థలు వ్యవస్థలను సక్రమంగా పనిచేయించేందుకు ఉద్యమించాలని అన్నారు. తెలుగు భాషోద్యమ సమాఖ్య నిర్వహించనున్న ఉద్యమ కార్యక్రమాలకు తమ మద్దతును, సహకారాన్ని అందిస్తామని వారన్నారు. సభలో డా.జంగా వెంకటరెడ్డి శ్రీయులు కొత్తపల్లి రవిబాబు, బొల్లిముంత కృష్ణ, బొమ్మదేవర వెంకటేశ్వరరావు, బెల్లంకొండ వెంకట్, యక్కల శ్రీమన్నారాయణ, పొత్తూరి నాగేంద్రం తదితర పౌరప్రముఖులు పాల్గొన్నారు. డా.సామల లక్ష్మణబాబు వందన సమర్పణ చేశారు.

# కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావు రచించిన తెలుగు భాషాతత్వము పరిచయం



(పరిశోధకాగ్రేసరుడు, తెలుగు భాషావేత్త కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావు గారు రచించిన 'తెలుగుభాషాతత్వము' అత్యంత విశిష్టమైనది. ప్రతిభాషకు తనదైన తత్వము (ఫిలాసఫీ) వుంటుందని నిరూపిస్తూ కొమఱ్ఱాజు లక్ష్మణరావు గారు రూపుదిద్దిన ఈ 'తెలుగుభాషాతత్వము' గ్రంథానికి చాలా కాలం తర్వాత ముద్రణ భాగ్యం లభించింది. దానికి భాషావేత్త **బూదరాజు రాధాకృష్ణగారు** రాసిన పరిచయవ్యాసాన్ని ఈ దిగువ ప్రచురిస్తున్నాము. తెలుగును అభ్యసించు ఏ స్థాయి విద్యార్థులైనా, పండితులైనా ఈ పుస్తకాన్ని చదువవలసివున్నది. - సంపాదకుడు)

ఇది అరవై ఏడు సంవత్సరాల క్రితం అచ్చు కావలసిన పుస్తకం. ఇరవయ్యో శతాబ్ది ప్రథమ పాదంలోనే కన్నుమూసిన పరిశోధకాగ్రేసరుడు కీ. శే. కొమర్రాజు వేంకట లక్ష్మణరావుగారు తమ జీవిత చరమసంధ్యలో రాసిన గ్రంథమిది. నాటినుంచి నేటిదాకా ఇది రాతప్రతిగానే మిగిలిపోయింది. 1877 మే నెల 18వ తేదీన పుట్టిన లక్ష్మణరావుగారు 1923 జులై 18వ తేదీన తనువు చాలించారు. 1922లో అనారోగ్యంగా ఉండికూడా తెలుగు భాషాతత్త్వము (Telugu philosophy) అనే పేరున ఈ గ్రంథానికి రూపమిచ్చారు. అప్పట్లో అది మూడుభాగాలుగా ఉండాలని సంకల్పించినట్లుంది. బుక్ 'I, II, III,' అని స్వహస్తాలతో రాసుకున్న ప్రతి ఆయన చివరిరోజులలో అన్యాక్రాంతమై పోయింది. 1960 ప్రాంతాల్లో ఆయన కుమార్తె కీ.శే. డాక్టర్ కొమర్రాజు అచ్చమాంబ గారికి బహుప్రయత్న ఫలితంగా దొరికింది. కానీ ముద్రించాలనే తన సంకల్పం నెరవేరకుండానే ఆమెకూడా గతించింది. ఇన్నేళ్ళకు ముద్రణ సాధ్యమయింది. అచ్చమాంబగారి కోరికను ఈ నాటికి విశాలాంధ్ర ప్రచురణాలయంవారు నెరవేర్చగలిగారు, నాతోబాటు.

ఆరవైఏడు సంవత్సరాలనాటి రాతప్రతి తాకితే పొడి అయిపోతుంటే గ్రంథకర్త మనుమడు శ్రీ లక్ష్మణరావుగారు స్వయంగా కాపీచేశారు. యథాతథంగా. అదిన్నీ పది సంవత్సరాలక్రితం. అప్పటికే శిథిలమైన లిఖితగ్రంథాన్ని లేమినేట్ చేయించబోతే మరికొంత శిథిలమయిపోయింది. అందువల్ల తాతగారి రాతప్రతికి మనుమడు రాసిన నకలు ప్రధానాధారంగా ఈ గ్రంథం ఈ రూపం పొందింది. అప్పటికీ ఇప్పటికీ స్పష్టంగాలేని, తెలియని భాగాలను చుక్కలతో వదిలివేయటమే మంచిదనిపించింది. అయినా నేటి పాఠకులకు ఒక క్రమంలో విషయం తెలియబరిస్తే బాగుంటుందని కొన్ని చిన్న మార్పులు చేశాను. పొల్లు మార్చలేదు. విషయక్రమం ప్రచురణ సందర్భంగా ముందువెనకలుగా అమర్చటం మాత్రం భావ్యమనిపించింది. చేశాను.

మూలంలో.. మొదటి పుస్తకంలో విభక్తి ప్రత్యయాలతో మొదలయిన గ్రంథం సర్వనామ, క్రియారూప క్రియపదాల విభజనతో పూర్తయింది. రెండో పుస్తకంలో సంధి, అసమాపకక్రియలు, కర్మణిరూపాలు, లింగవిచారం, కృదంతరూపాలు, విశేషణాలు, సమాసాలు ఉన్నాయి: మూడో పుస్తకం హల్సంధితో మొదలై ప్రచురితగ్రంథంలో 'ఆంధ్రభాషోత్పత్తి' అనే ప్రకరణంలో కనిపించే సమస్త విషయాలతోనూ వర్ణవిచారముతోనూ ముగుస్తుంది. చూసీచూడగానే సంధిని గురించిన చర్చ రెండుచోట్ల ఉన్నట్లు తెలుస్తుంది. అంతేకాదు, ముద్రిత గ్రంథంలో రెండో అనుబంధంలో భాగంగా ప్రచురించిన 'సంధి ప్రకరణము' అనేది రచనా ప్రణాళికను నిర్దేశిస్తున్నది. కానీ విషయచర్చలేదు. అలాగే మొదటి పుస్తకంలోనూ రెండోదాంట్లోనూ క్రియలనుగురించి వేరువేరు చోట్ల రాసివుంది. గ్రంథాంతంలో - మూడో పుస్తకం చివర - వర్ణవిచారముంది. ద్రవిడభాషల గురించిన చర్చ హల్సంధికీ శబ్ద సంగ్రహానికి మధ్య కనిపిస్తుంది. ఇంకా వివరాలకు పోకుండానే మనకిప్పుడు లభించిన ఆయన రాతప్రతి సమగ్రం కాదనీ, ముద్రణయోగ్యప్రతి కానేకాదనీ చెప్పవచ్చు. అనారోగ్యంగా ఉంటున్న చివరిరోజుల్లో అప్పటప్పటికి తోచిన అభిప్రాయాలతో, దొరికిన ఆధారాలతో చిత్తుగా రాసుకున్న పుస్తకం కాబట్టి పున:పరిశీలనమీదట ముద్రణ యోగ్యంగా తయారుచేయవలసివున్నదనిపిస్తుంది:ఈ రచన తరువాత 1923లో ఎరుకల భాషను గురించి ప్రచురించిన వ్యాసాలు మినహా మరేమీ రాసినట్లు లేదు.

లక్ష్మణరావుగారు 46 సంవత్సరాల వయసులోనే దివంగతులైనారు... 1923 నుంచి ఆయన లిఖితప్రతి శిష్యుల, అభిమానుల పాలయిపోయింది. కీ. శే. మల్లంపల్లి సోమశేఖర శర్మగారి నుంచి అనేకులు ప్రచురిద్దామనే ఆకాంక్షతో రాతప్రతిని కొంతకాలం

తమ దగ్గర ఉంచుకున్నారు. తీవ్ర ప్రయత్న ఫలితంగా, కొందరి మీద న్యాయపరమైన చర్యలు తీసుకుంటామని బెదిరించిన తరువాత, 1960లో ఈ లిఖితప్రతి ఆయన కుమార్తె అచ్చమాంబ గారికి లభించింది. ఎవరెవరు ఈ గ్రంథాన్ని ఎంతెంతకాలం ఏయేకారణాలవల్ల దాచివుంచారో, దీన్నుంచి ఎంతెంత లబ్ధిపొందారో వివరిస్తూ ప్రచురిద్దామనుకుంటుండగా ఆమెగారు తనువుచాలించారు. ఈ అవాంతరం రాకపోతే 1960 లోనే నేనే విపులమైన పీఠికతో ప్రచురించాలని అప్పటి నిర్ణయం. అలాజరగ లేదు. రెండేళ్ళ క్రితం గత స్మృతులు నెమరువేస్తుండగా గ్రంథకర్త పౌత్రుడయిన లక్ష్మణరావుగారు కీ.శే. వినాయకరావుగారి పెద్ద కుమారుడు తమ దగ్గర అలనాటి రాతప్రతితోబాటు తాము స్వహస్తాలతో రాసిన నకలు కూడా ఉందన్నారు. మొదట అసలు గ్రంథాన్ని లేమినేట్ చేయించి భద్రపరిచిన మీదట ప్రచురించాలనుకున్నాం. అ ప్రయత్నంలో మొదటికే మోసం వచ్చేలాగుందని తెలుసుకొని విశాలాంధ్ర ప్రచురణాలయం వారిని కోరగా ప్రచురించగలమన్నారు. ఈ దశలో .......

నేటి పాఠకుల సౌలభ్యాన్ని దృష్టిలో పెట్టుకొని మూలగ్రంథంలోని విషయక్రమం మార్చి ప్రచురించాలనిపించింది. భిన్న స్థలాల్లో ఉన్న సంధిని ఏకత్రపరిచినా, రెండో అనుబంధంలో చూపిన భాగం కేవలం ప్రణాళికే కాబట్టి విడిగా ఇద్దామనుకున్నాను. రాతప్రతిలో సుదీర్ఘంగా ఉన్న అధస్సూచికలను వేరుగా ఇవ్వాలని సంకల్పించాను. అందువల్ల పాఠకుడికి విషయగ్రహణంలో ఇబ్బంది కలగదు. ఆకర గ్రంథాలను సూచించిన సందర్భాల్లో ఎక్కడికక్కడే మూలగ్రంథంలోలాగా వాటిని నిర్దేశించాను. కొన్నిచోట్ల నకలు లోని మాటలు స్పష్టంగా లేవు. అలాంటిచోట్ల మూలప్రతిని చూసినా పరిస్థితిలో మార్పులేదు. అటువంటి భాగాలను చుక్కలు పెట్టి (...) నిర్దేశించాను.అక్షరాలు సరిగా కనిపించని, తెలియని సందర్భాల్లో సవరణ సాధ్యమయినా చేయలేదు. లిఖితగ్రంథం ఏ స్థితిలో ఉందో చివరి అట్టమీది బ్లాకు సూచిస్తుంది. ఆయన దస్తూరీ కూడా గ్రంథమంతటా ఒకేరకంగా లేదు.

మూలప్రతి చిత్తుప్రతేననడానికి మరికొన్ని నిదర్శనలున్నాయి. ఒకే భాషపేరును ఆయన భిన్న స్థలాల్లో 'బ్రాహియి, బ్రాహుఇ, బ్రహి, బ్రుహి' అని రాశారు: ప్రమాణీకరించి ఏదో ఒక రూపం నిశ్చితంగా వాడలేదు. మరి కొన్ని మాటల విషయంలో 'పుల్లింగము/పుంలింగము, వైయాకరణులు / వైయ్యాకరణులు' అంటూ రెండురూపాలను వాడారు. 'పూర్వోత్రము (పూర్వోత్తరం), సాంప్రదాయం సంప్రదాయం) వంటి శుద్ధవ్యావహారిక రూపాలు వాడారు. అరసున్నాలనూ బండిరాలనూ నియతంగా వాడలేదు. సంధి నియతంగా చేయలేదు. 'బహు అరుదు' వంటి మిశ్రసమాసాలు వాడేరు. గ్రాంథిక భాషావాదులైన లక్ష్మణరావుగారు తమ జీవిత చరమ సంధ్యలో గురువులయిన కందుకూరి వీరేశలింగం పంతులుగారి లాగానే వ్యావహారిక భాషావాదం వైపు మొగ్గుతూవచ్చారని, సరళగ్రాంథికంకన్నా కూడా సులభతర భాషలో రాశారనీ పైలక్షణాలు సూచిస్తాయి. ఇది చిత్తుప్రతి మాత్రమే కాబట్టి ఇలాంటి రూప వైవిధ్యం, రచనా శైథిల్యం ఉందని ఎవరయినా వాదించినా కాదనలేం. ఆయన విశ్వసించిన గ్రాంథిక భాషావాదం కోసంగాని, నేను నమ్మిన వ్యావహారిక వాదంకోసం గాని ఎటువంటి చేర్పులూ మార్పులూ చేయలేదు. లక్ష్మణరాయ స్వహస్త లిఖితగ్రంథంతో పోల్చిచూసుకోవచ్చు.

కొమర్రాజువారు సంస్కృతం, ప్రాకృతం, మరాఠీ, హిందీ, తమిళం, మలయాళం, ఇంగ్లీషు వగైరా అనేక భాషలనుంచి ఉదాహరణ లిచ్చారు. వారుపయోగించిన, పరిశీలించిన, స్మరించిన ఆయా గ్రంథాల ప్రచురణ వివరాలివ్వటం సాధ్యపడలేదు. ఏప్రతి ఏనాటిదో, ఏనాటి ప్రతిని వారు చూసి రాశారో చాలా సందర్భాల్లో ఆయన సూచించలేదు. అందువల్ల ఉపయుక్త గ్రంథ పట్టికను ప్రత్యేకించి ఇవ్వలేదు. అధస్సూచికల్లో (అనుబంధాల్లో) వారు పరిశీలించిన, ప్రస్తావించిన గ్రంథాలేవో తెలుస్తాయి. ఆయన పాండిత్య విశేషమూ పరిశోధన విస్తృతీ స్వయం వ్యక్తమవుతాయి. ఆయన వాడిన పరిభాష నేటి వాడుకకు కొన్ని సందర్భాల్లో సరిపడదు. ఆర్యభాషల నాయన గౌడభాషలని వ్యవహరించాడు. ఇప్పటివారు నిర్దేశ సర్వనామాలనేవాటిని ఆయన దర్శకసర్వనామాలని పిలిచారు. నేడు సంఖ్యావాచక సర్వనామాలని పిలిచే వాటిని ఆయన సంఖ్యార్థ సర్వనామాలన్నారు. ఈ పరిభాషను ఇప్పటివాడుకకు అనుగుణంగా సవరించలేదు.

ఈగ్రంథ రచనాకాలం 1892. అప్పటికి బిషప్ కాల్డ్వెల్ ప్రతిపాదించిన ద్రావిడ భాషావాదానికి ఆంధ్రదేశంలో గౌరవస్థాన మేర్పడలేదు. తాతవెల్లి మిరాశీదార్ శేషగిరిశాస్త్రిగారు రచించిన 'ఆంధ్రశబ్దతత్త్వము' ఒక్కటే అప్పటికి ప్రచురితమైన గ్రంథం. ఆర్యభాషావాదాన్ని ప్రతిపాదించిన డాక్టర్ చిలుకూరి నారాయణరావుగారి 'ఆంధ్రభాషాచరిత్ర' 1936లో వచ్చింది. ద్రవిడ భాషావాదాన్ని స్థాపించిన గంటి జోగిసోమయాజిగారి 'ఆంధ్రభాషా వికాసము' 1948లో వెలువడింది. కొమర్రాజువారి 'తెలుగు భాషాతత్త్వము' ఈ రెండు సుప్రసిద్ధ గ్రంథాలకన్నా క్రమంగా 1922 సంవత్సరాలకు ముందు అచ్చుపడవలసింది - గ్రంథకర్త మరి రెండేళ్ళు జీవిస్తే అచ్చయ్యేది. చిత్రమేమంటే ఈరెండు గ్రంథాల రచయితలూ ఈగ్రంథం లిఖితప్రతిని కొంతకాలం పాటు తమదగ్గర అట్టిపెట్టుకున్నా దీన్ని స్మరించకపోవటం. భాషావాదంలో, గిడుగు వెంకటరామమూర్తిగారితో పూర్తిగా విభేదించిన కొమర్రాజు వేంకటలక్ష్మణరావుగారు తెలుగు ద్రావిడభాషేనన్న విషయంలో పరిపూర్ణంగా ఏకీభవించారు. గిడుగువారి ప్రత్యక్షశిష్యులై, వారి దగ్గరి అపూర్వ గ్రంథాలనూ ప్రయోగాలనూ వాడుకున్న నారాయణరావుగారు ఆర్యభాషావాదులై తమ గురువుగారితో విభేదించారు. ప్రాకృత భాషాపరిజ్ఞానమూ మరాఠీలో పాండిత్యమూ ఉన్న లక్ష్మణరాయ నారాయణరావు లిద్దరూ తెలుగు ఏ భాషాకుటుంబానికి చెందిందో నిర్ణయించుకోవటంలో పూర్తిగా విభేదించారు. తక్కిన విషయాలెలావున్నా, శబ్దరత్నాకరంలోని పదాలను విశ్లేషించటంలో, లెక్కలు కట్టడంలో, సంస్కృతపదాలు తత్సమాలుగా తెలుగులో ప్రవేశించటంలో సప్తమ్యేకవచన రూపాదులు ప్రాతిపదికగా ఉన్నాయని వాదించటంలో, చిలుకూరి వారు కొమర్రాజు వారిని అనుసరించికూడా స్మరించలేదు. ద్రవిడభాషాపరిగణన, సర్వనామాలచరిత్ర అనేవాటిలో కొమర్రాజువారి ననుసరించిన జోగి సోమయాజి గారు వీరిని ప్రస్తావించలేదు. గ్రంథం అముద్రిత మైనప్పుడు ఈ ఆరోపణసమంజసం కానిమాట నిజమే. అయితే రాతప్రతి ఈ యిద్దరికి కొంతకాలమైనా

అందుబాటులో ఉన్న మాట నిజమయినప్పుడు ఈ ఆరోపణ సమంజసమే. భావి పరిశోధకుల కీ విషయంలోని సత్యాసత్యపరీక్ష వదిలిపెట్టి గ్రంథ స్వభావాన్ని గురించి నాలుగుమాటలు చెప్పాలనుకుంటున్నా.

'తెలుగు భాషా తత్త్వము' అనే ఈ గ్రంథంలో తెలుగు ద్రవిడ భాషా కుటుంబానికి చెందిందని, ఆంధ్రశాఖకు ఆ కుటుంబంలో ప్రత్యేకస్థానముందని కొమర్రాజువారు ప్రతిపాదించి సమర్థించారు. గోండి మొదలయిన వాటిని 'మధ్యవర్తిభాష' లన్నారు. 'ఖీలీ'ని మధ్య ద్రావిడభాషల్లో చేర్చారు. కావ్యప్రయోగాల్లోని ఎరువుమాటలు కృతకశబ్దాలని వాదించారు. మహా ప్రాణోచ్చారణ ద్రవిడభాషల్లో కూడా ఉందన్నారు. 'అకార' యుక్త శబ్దాలు తెలుగులో క్రీ.శ. పదోశతాబ్దం దాకా ఉన్నట్లు 'కనిపట్టితిని' అని చెప్పారు. ఆంధ్ర భాషలోని శబ్దసంపదను శబ్దరత్నాకరం ఆధారంగా విశ్లేషించారు. పాఠ్యగ్రంథాల నుంచి పిల్లల వాడుకలో ఉన్న పదాలను సేకరించారు. ఎరువుతెచ్చుకున్న సంఖ్యావాచకాల వ్యాప్తిలోని విశేషాన్ని ప్రస్తావించారు. తెలుగులో మొదట ఒకే లింగ ముండేదని, తరువాత రెండు లింగాలేర్పడ్డాయని వాదించారు.' డు, ము, వు' లే గాక 'ను,యు' అనే ప్రథమైక వచన ప్రత్యయాలున్నాయని నిర్ధారించారు. ప్రాచీన ద్రావిడంలోని ళ,ణ పర్యాయ రూపతను గుర్తించారు. చేయ్యాదులను సకారాంతాలుగా పరిగణించారు - నేటి భాషాశాస్త్రజ్ఞుల్లాగా. ఇలా అనేకం.

ఈ గ్రంథం మొత్తానికి సమాసాలను గురించిన పదో ప్రకరణం సర్వోత్తమం. సంప్రదాయ వ్యాకరణాలు గాని, ఆంధ్రభాషాచరిత్ర వికాసకారులు గాని గుర్తించని అనేక విషయాలను ఆయన స్పృశించి చర్చించారు. కారక విభక్తులను గురించి 12, 13 ప్రకరణాల్లో ఎన్నో విశేషాలను వెలికితీశారు. డు,పు ప్రత్యయ చరిత్రను అనంతర రచయితల కన్నా విస్పష్టంగా వివరించారు. కర్మణి ప్రయోగం విషయంలో సర్వనామాల చరిత్ర విషయంలో అనేక నూతనాంశాలను ప్రతిపాదించారు. తెలుగు నిఘంటువుల సంస్కృత దాస్యం గురించి ప్రస్తావించారు. మానవ శాస్త్రానికి సంబంధించి ఆయన ప్రసంగాలిప్పటివారికి విడ్డూరంగా ఉండవచ్చు. తమిళ సాహిత్యంలో బ్రాహ్మణేతరుల ప్రాబల్యం వంటి వాస్తవాలను ఆయన సున్నితంగా గ్రహించారు. ఈనాటికీ తెలుగులో వచ్చిన భాషాచరిత్ర గ్రంథాల్లో ఇది మొదటిదని (రచనా కాలాన్ని బట్టి) గ్రహించినప్పుడు ఈ గ్రంథ ప్రామాణ్యాన్ని ఎవరయినా గుర్తించి గౌరవించగలరు.

కొమర్రాజు లక్ష్మణరావుగారి జీవితవిశేషాలను విశాలాంధ్ర ప్రచురణాలయంవారు ఏనాడో ప్రచురించారు. ఆయన 1906లోనే విజ్ఞాన చంద్రికాగ్రంథమండలి స్థాపించారు. ఆయన సహకారంతోనే హైదరాబాదులో స్థాపించిన 'ఆంధ్రపరిశోధకసంఘం' మనే సంస్థ ఆయన మరణానంతరం 'లక్ష్మణరాయ పరిశోధక మండలి' గా మారింది. 'విజ్ఞాన చంద్రికా పరిషత్తు' ను ఆయన 1910లో స్థాపించారు. మొత్తం దక్షిణ భారతదేశంలోనే విజ్ఞాన సర్వస్వ రచనా ప్రచురణలకాయనే ఆద్యపురుషుడు (అందుకే తెలుగు విశ్వవిద్యాలయంలోని ఆ పీఠానికాయన పేరుపెట్టారు) చరిత్ర పరిశోధకులుగా, నవలా రచయితగా, విజ్ఞానసర్వస్వ నిర్మాతగా ఎన్నోరంగాల్లో అపూర్వ కృషిచేసిన లక్ష్మణరావుగారు 46 సంవత్సరాల వయస్సులోనే ఇన్ని పనులు చేసిన ప్రతిభావంతులు. లోకమాన్య బాలగంగాధర తిలక్ గారితో చరిత్రపై ఉత్తర ప్రత్యుత్తరాలు నిర్వహించిన విద్వాంసుడు ఆయన.

భాషా విషయంలో ఆయన సంప్రదాయవాది. తాను విశ్వసించిన విషయంలో పట్టుదల మెండు. గ్రాంథికభాషలో రాయని గ్రంథాలను ప్రచురించనని ప్రతిజ్ఞ పట్టినవాడు. శ్రీనాథుడి మాతామహుడైన కమలనాభామాత్యుడేలిన కల్పట్టణ మెక్కడవుందో వెతికించడానికి ఆయన వేలు వెచ్చించాడు. ఆయన సాహిత్యాభిమానం అంతటిది. ఈగ్రంథం గ్రాంథికభాషలో ఉన్నా గిడుగువారన్నట్లు శిథిలబంధమైన కావ్యభాషలోనే ఉందని చదువరులు గుర్తించగలరు. రచనా భాషకుగాక విషయానికి గౌరవమిచ్చి ఈ గ్రంథాన్ని ఈ రూపంలో ప్రచురించే అవకాశం కల్పించినందుకు విశాలాంధ్ర ప్రచురణాలయం వారినీ, గ్రంథకర్త పౌత్రులనూ అభినందిస్తున్నాను. తప్పొప్పులపట్టిక లేకుండా ముద్రించలేకపోయినందుకు సిగ్గుపడుతున్నాను. మూలగ్రంథాన్ని విశాలాంధ్ర ప్రచురణాలయంలో భాషాభిమానులు చూడవచ్చు.

బూదరాజు రాధాకృష్ణ, హైదరాబాద్,
14-11-1989

---

# ప్రాంతీయ భాషల్లో ఎంటీఎస్ నియామక పరీక్షలు

స్టాఫ్ సెలక్షన్ కమిషన్ (ఎస్ఎస్‌సి) నిర్వహించే మల్టీటాస్కింగ్ స్టాఫ్ (ఎంటిఎస్) పరీక్షలతో పాటు కంబైన్డ్ హయ్యర్ సెకండరీ లెవల్ (సీహెచ్ఎస్ఎల్) పరీక్షలను ప్రాంతీయ భాషల్లోనూ నిర్వహించాలని కేంద్ర ప్రభుత్వం నిర్ణయించింది. హిందీ, ఇంగ్లీషుతో పాటు 13 ప్రాంతీయ భాషల్లో ప్రశ్నాపత్రాలను రూపొందిస్తామని కేంద్రశిక్షణ,సిబ్బంది వ్యవహారాల శాఖ ఒ ప్రకటనలో తెలిపింది. తెలుగు,బెంగాలీ, అస్సామీ, గుజరాతీ,మరాఠి, మళయాళం, కన్నడ, తమిళ్,ఒడియా, ఉర్దూ, పంజాబీ, మణిపూరి,కొంకణి భాషల్లో పరీక్షలు నిర్వహిస్తామని పేర్కొంది. ప్రాంతీయ భాషల్లో కూడా ఎస్ఎస్‌సి పరీక్షలు నిర్వహించాలని ఆయా రాష్ట్రాలనుంచి డిమాండ్లు వచ్చిన రీత్యా నిపుణుల కమిటీని ఏర్పాటు చేసినట్లు తెలిపింది. ముఖ్యంగా గ్రూప్-సీ పోస్టులను ప్రాంతీయ భాషల్లో కూడా నిర్వహించాలని ఆ కమిటీ చేసిన సిఫారసును ఆమోదించినట్లు వివరించింది. ఎంటీఎస్ సిబ్బంది నియామకాలపై ఇప్పటికే నోటిఫికేషన్ జారీ అయింది. సీహెచ్ఎస్ఎల్ నోటిఫికేషన్ మే-జూన్ నెలల్లో విడుదల అవుతుందని ప్రభుత్వం ప్రకటించింది.

శ్రద్ధాంజలి

పులికొండ సుబ్బాచారి
9440493604

# భాష్యాంతవైయాకరణి
# మహామహోపాధ్యాయ ఆచార్య రవ్వా శ్రీహరి



**కనువెలుగు: 05, మే 1943**
**కనుమరుగు 21,ఏప్రిల్ 2023**

**వ్యాకరణం ఎందుకు చదువుకోవాలి?? అది లేకపోతే ఏం? అనే తరం ఒకటి కనీసం మూడు దశాబ్దాల క్రితమే మొదలైంది. అసలు తెలుగు ఎందుకు చదువుకోవాలి అనే పాడు కాలం ఇప్పుడు దాపురించిన నేపథ్యంలో ఒక మహామహోపాధ్యాయుడు వ్యాకరణ ప్రేమికుడు తెలుగు భాష ఆంతరిక సౌందర్యాన్ని ఔపోసన పట్టి శిష్యకోటికి ఆ మాధుర్యాన్ని అందించిన మహావ్యక్తి ఆచార్య రవ్వా శ్రీహరి గారి గురించి ఈ తరం వారు వివరంగా తెలుసుకోవాలి. వారు అసీతి వర్షాల వయఃపరిపాకదశలో ఇటీవలే శరీరాన్ని విడిచిపెట్టి వారి పరిశోధన రాశిని మథించి తీసిన భాషామృతాంతర నవనీతాన్ని తెలుగుజాతికి వదిలిపెట్టారు.**

అర్థశతాబ్దానికి పైబడిన విద్యాజీవితం ఆచార్య రవ్వా శ్రీహరి గారిది. ఇందులో ఎన్నో ఉన్నతోన్నత సోపానాలు. శ్రమైక జీవన సౌందర్యానికి, భాషాసాహిత్యసేవాలగ్న చిరంతన జీవనయానానికి ప్రతీక శ్రీహరి గారు. చేపట్టిన పని ఏదైనా రవ్వలు రాల్చిన ప్రతిభ వారిది. వారిని గురించి చెప్పడం అన్నా తలచుకోవడం అన్నా సంస్కృతాంధ్ర భాషాసాహిత్యపరిమళాలని వారి విద్యైకజీవనయాన మధురిమలను గుర్తుకు తెచ్చుకోవడమే. ఆనందాన్ని అనుభవించడమే.

ఆచార్య రవ్వా శ్రీహరి గారు ఉస్మానియా ఆర్ట్స్ కాలేజీలో మాకు గురువు గారు. ద్రావిడ విశ్వవిద్యాలయంలో వారు మాకు ఉపాధ్యక్షులు. అంతే కాదు 1981 నుండి వారు వెళ్ళిపోయేముందు రెండు నెలల వరకు అస్మదాదులకు గురువుగారే. ఏ సందేహం తీర్చుకోవడానికి ఏ శబ్దసాధుత్వాన్ని వారి నికషోపలం పైన రాసి తెలుసుకోవడానికి ఫోన్ చేసినా ఎంతో ఆనందభరితమైన వారి కంఠం నిశితమైన వారి విశ్లేషణ వివరణ వినిపించేవి. అలాంటి విజ్ఞాన నిధి ఆ తరానికి సాయంసంధ్య వచ్చిందా అని అనిపిస్తున్నది. ఏ సందేహానికైనా ఝటితిగా పరిష్కారం లభించే ఆ విజ్ఞానం ఒక పర్వత సమానం.

ఆనాటి శ్రీహరి గారిని గుర్తుకు తెచ్చుకుంటాను. తెల్లటి చొక్కా తెల్లటి పాంటు చాలా సాదాగా ఉండే మనిషి. గుత్తంగా ఉన్న చిరువంకెలున్న తుమ్మెద రెక్కల్లాంటి జుట్టు. సింపుల్ లివింగ్ అన్న మాటకు ఈయన ఉదాహరణగా ఉండేవారు. అప్పట్లో సైదాబాదులో ఉండేవారు. దాదాపు ఒక దశాబ్దం క్రితమే మలక్ పేటలోని మరింత పెద్ద ఇంటికి మారారు. అప్పట్లో సైదాబాదు నుండి ఆర్ట్స్ కాలేజికి రావాలి. చాలా దూరం కనీసం 20 కి.మీ ఉంటుంది. రెండు బస్సులు మారాలి. తర్వాతి రోజుల్లో వారికి ఆకాలపు రాజ్ దూత్ మోటారు సైకిల్ ఉండేది. కాని మేము విద్యార్థిగా ఉన్న రోజుల్లో అదీ ఉండేది కాదు. చాలా మంది ఆచార్యులు చాలా దూరాలనుండి ఆర్ట్స్ కాలేజికి వస్తూ ఉండేవారు. అసలు ఆర్ట్స్ కాలేజిలో చదవడం అన్నా అక్కడ పాఠాలు చెప్పడం అన్నా ఇటు విద్యార్థులకు అటు ఉపాధ్యాయులకు గర్వకారణం. చాలా గర్వంగా చెప్పుకునేవారు. చాలా మంది ఆచార్యులు వారి పలుకుబడి ఉపయోగించి ఆర్ట్సకాలేజికి రావడానికి ప్రయత్నించేవారు. కాని శ్రీహరిగారు చాలామంది కోరికపైన చాలా సంవత్సరాలు ఆర్ట్సకాలేజిలో పనిచేశారు. ఆరోజుల్లో ఆచార్యులు కొంత మంది కాలేజికి మూడు నాలుగు కి.మీ. దూరంలో ఉన్న శంకరమఠం బస్‌స్టాపు దాకా సిటీబస్సులో వచ్చి అక్కడ దిగి అక్కడనుండి ఆటో తీసుకొని వచ్చేవారు. ఆటో ఖరీదులు ఆరోజుల్లో కూడా చాలా ఎక్కువగా ఉండేవి. అవి ఎప్పుడూ అలాగే ఉంటాయనుకోండి. చాలామంది అంతదూరమూ ఆటోలో రాలేక ఈ పనిచేసేవారు. అయితే కొందరు పెద్ద ఆచార్యులకు సొంత కార్లు ఉండేవి. ఆరోజుల్లో సొంత కార్లు ఉండడం చాలా అరుదు ఏవో కొద్ది మందికే ఉండేవి. అయితే శ్రీహరి గారు మాత్రం చక్కగా బస్సుపాసు తీసుకునేవారు. ఏ మాత్రం బెరుకు లేకుండా దాన్ని చొక్కా పై జేబులోనే పెట్టేవారు. ఇదెందుకు చెప్పవలసి వచ్చిందంటే ఆయన ఏమాత్రం భేషజాలకి పోవడం కాని, లేని ప్రతిష్ఠని చెప్పుకోవడం కాని చేయక ఎంతో సాదాసీదా జీవితాన్ని గడిపేవారని తెలియడానికే. కాని వారికున్నది అహర్నిశలూ విద్యైక జీవితమే. అప్పుడప్పుడూ తాంబూల చర్వణం (సాదాపాన్) చేసేవారు. కాని తీరిగ్గా బేసిన్ దగ్గరికి వెళ్ళి, పరిశుభ్రంగా తయారై, కడిగిన ముత్యంలా క్లాసుకు వచ్చేవారు. ఏ దురలవాట్లు లేని ఆయన ముఖంలో స్వచ్ఛత క్రమశిక్షణాబద్ధమైన వ్యక్తిగత జీవితం స్పష్టంగా కనిపించేవి.

మేము చదువుకునే రోజుల్లో (1980-84 వరకు) ఆర్ట్స్ కాలేజిలో శ్రీహరి గారు వ్యాకరణం, సంస్కృతం బోధించేవారు. ఒకటి, రెండు సెమిస్టర్లలో బాల వ్యాకరణం ప్రౌఢవ్యాకరణం చెప్పేవారు. అలాగే మూడు నాలుగు సెమిస్టర్లలో సంస్కృతం భాష పరిచయం, తర్వాత

సాహిత్యం చెప్పేవారు. బాలవ్యాకరణం ప్రౌఢవ్యాకరణం కలిపి ఒకే సారి చెప్పేవారు. ఒక బాల వ్యాకరణ సూత్రం వచ్చిందంటే దానికి ప్రౌఢవ్యాకర్త చేసిన సూచనలు కాని, మార్పులు కాని, లేదా పరిణామం కాని ఇలా ఉండేవి. కాని రెండు వ్యాకరణాలలో ఉన్న విషయాలు బోధనలో వెంటవెంటనే వచ్చేవి. ఆరోజుల్లో మాకు ఆర్ట్స్ కాలేజిలో క్లాసులు ఉదయం 9.00 కే మొదలయ్యేవి. మధ్యాహ్నం 1.00 దాకా సాగేవి. విద్యార్థులు అందరూ హాస్టల్ కి భోజనానికి వెళ్ళేవారు. ఇక మధ్యాహ్నం నుండి తరగతులు ఉండేవి కావు. పరిశోధక విద్యార్థులకు పార్ట్ వన్ తరగతులు ఉంటే జరిగేవి. తర్వాత విద్యార్థులు చాలామంది లైబ్రరీలోనే ఉండేవారు.

శ్రీహరిగారి తరగతి అంటే అదొక ఆనందం. బాల వ్యాకరణం కాని ప్రౌఢవ్యాకరణం కాని చదవడం కొందరికే కాస్త ఇబ్బందిగా ఉండేది. కాని మా తరగతిలో ఓరియంటల్ బి.ఎ. చదువుకున్న వారు ఎక్కువమంది ఉండేవారు. అలాకాక తెలుగు భాషాసాహిత్యాలతో అంతగా సంబంధంలేని మామూలు బి.ఎ. బి.కాం చదువుకున్న వారు కూడా ఉండేవారు. వీరు కొద్దిమందే ఉండేవారు. ఓరియంటల్ వాళ్ళు కాస్త వేగంగా అల్లుకుపోయేవారు. కాని శ్రీహరి గారి వ్యాకరణ పాఠం మాత్రం ద్రాక్షాపాకంలాగా ఉండేది. కాస్తంత శ్రద్ధ పెట్టి వినేవారికైతే చాలా ఆనంద దాయకంగా ఉండేది. బాల వ్యాకరణాన్ని చెప్పేటప్పుడు చిన్నయసూరి కాలం నాటి విషయాలు కొన్ని ప్రసక్తం అయ్యేవి. అవి వినడానికి చాలా బాగుండేవి. అంతేకాదు శ్రీహరి గారు బాలవ్యాకరణానికి ఉన్న వ్యాఖ్యలలో దువ్వూరి వెంకటరమణ శాస్త్రిగారి రమణీయాన్ని చాలా ఎక్కువ ఇష్టపడేవారు. **వ్యాకరణం అంటేనే భయపడే మనస్తత్వాన్ని దూరం చేస్తూ శాస్త్రాన్ని పువ్వు విరిసినట్లు అరటి పండు ఒలిచి ఇచ్చినట్లు చెప్పడం వారిదైన కళ. మధ్యలో ఆ సూత్ర రచనలలో బిగిని చూచి చెప్పి వారికి వారే ఆనందించి నవ్వుతూ మా వైపు చూచే ఆయన చూపు ఆ ఉత్సాహం నేటికీ గుర్తుకు వస్తుంది. ఆయన కంఠం కూడా చెవిలో వినిపిస్తుంది.**

రమణీయం మాట వస్తే చాలు పొంగిపోయేవారు. దువ్వూరి వేంకట రమణ శాస్త్రిగారు ఎంతటి సున్నితమూ మార్దవమైన వ్యాఖ్యరాశారో చెప్పడంలో శ్రీహరిగారు తన్మయులౌతుండేవారు. చిన్నయసూరి హృదయాన్ని బాగా లోతుగా చూచిన వారు దువ్వూరి వారు అని చెప్పేవారు. ప్రతి సూత్రం దగ్గర వ్యాఖ్యానం చేసేటప్పుడు ఎవ్వరూ చేయని రీతిలో దువ్వూరి వారి వ్యాఖ్య ఉన్న తీరును చాలా వివరంగా చెప్పేవారు. సూత్రం రాయడంలో కాని, దానికి ఉదాహరణలు ఇవ్వడంలో కాని చిన్నయ సూరి పాటించిన ఔచిత్యాన్ని ఉదాహరణలలోని సొబగును చాలా స్ఫుటంగా దువ్వూరి వారు చెప్పిన రీతిని చేసిన వ్యాఖ్యానాన్ని విద్యార్థుల హృదయాలలో హత్తుకునేలా చెప్పేవారు శ్రీహరి గారు. వ్యాకరణ పాఠం అంటే అమ్మబాబోయ్ అనే తీరుకు చాలా భిన్నంగా ఉండేది వారి వ్యాకరణ పాఠం.

అసలు వ్యాకరణ పాఠం చెప్పడంలో వారు పొందే ఆనందం అంతా ఇంతా కాదు. అదేదో ఆయనకు చాలా ఉత్సవంలాగో ప్రతీ క్లాసు ఆయనకొక పండుగ లాగో ఉండేది. కష్టపడి తయారు అయినట్లు కాని, దానికోసం చాలా కష్టంగా ఉండి పనిచేయడం కాని, మేము ఆయనలో ఎప్పుడూ చూడలేదు. ఇంకో ముఖ్య విషయం చెప్పాలి. ఆరోజుల్లో ఆర్ట్స్ కాలేజిలో రెండు గంటల క్లాసులు ఉండేవి. ఉదయం 9.00 లకే తరగతులు మొదలయ్యేవి. శ్రద్ధ ఉన్న విద్యార్థులు సాయంత్రం అంతా లైబ్రరీలో గడిపేవారు. అక్కడ వివిధ రకాల వ్యాకరణ వ్యాఖ్య గ్రంథాలు దొరికేవి. కాస్త ఓరియంటల్ తరగతులనుండి వచ్చినవారు అక్కడున్న వివిధ వ్యాఖ్యానాలు చదివి మాకు రాని మరికొన్ని సందేహాలు అడుగుతుండేవారు. శ్రీహరి గారు తెలుగులో ఎంత పండితులో అటు సంస్కృతంలో కూడా అంతటి పండితులు కావడం ఇక్కడ మరొక విధంగా కలిసి వచ్చింది. సంస్కృత వ్యాకరణంపైన వారికి ఉన్న అధికారం తెలుగు వ్యాకరణం చెప్పడంలో కూడా చాలా బాగా ఉపయోగపడింది. వ్యాకరణ సూత్రాలు చెప్పేటప్పుడు సంస్కృత వ్యాకరణ సూత్రాలు ఎలా ఉండేవి. చిన్నయ సూరి సంస్కృత వ్యాకరణ మర్యాదలని ఎలా పాటించాడో చెప్పేవారు. పాణినీయం గురించి మాట్లాడడం అంటే వారికి ఇక పండుగే. సందర్భం వచ్చినప్పుడల్లా మానవ మేధస్సుకు పాణినీయం ఒక గీటురాయి వంటిది అని పాశ్చాత్య పండితులు ఎలా చెప్పేవారో వివరించేవారు. ఈ సవ్యసాచిత్వం కారణంగానే వ్యాకరణ బోధనలో వారికి బాల ప్రౌఢ వ్యాకరణాలు చెప్పడం అంటే నీళ్ళప్రాయంగా సాగేది.

ఇక్కడ చెప్పవలసిందేమంటే. ఎక్కువ రోజుల్లో మొదటి క్లాసులోనే శ్రీహరి గారి వ్యాకరణ పాఠాలు ఉండేవి. రెండు గంటలు వరుసగా వ్యాకరణ పాఠం చెప్పడం కాని వినడం కాని ఎలా ఉంటుందో బయటి వారు ఊహించుకోవచ్చు. ఒక్కో సారి క్రియా పరిచ్ఛేదం చెప్పేటప్పుడు కాని కారక పరిచ్ఛేదం చెప్పేటప్పుడు కాని చివరి పావుగంటలో సాధారణ విద్యార్థులు బెంచీల మీద అసహనంగా కదలడాన్ని వారు గమనిస్తే ఇక ఆపి, వేరే విద్యార్థులను కొన్ని ప్రశ్నలు అడగడం కాని, వారి నుండి ప్రశ్నలు తీసుకోవడం కాని చేసేవారు. శ్రీహరి గారి పాఠం అంటే అంత విలువైనది.

సాహిత్యాన్ని చెప్పడం ఒక ఎత్తు వ్యాకరణాన్ని విద్యార్థుల మనసు దోచుకునేలా చెప్పడం ఒక ఎత్తు. అంతేకాదు నారికేళం లాంటి వ్యాకరణాన్ని అరటి పండు ఒలిచి చేతిలో పెట్టినట్టు వ్యాకరణాన్ని విప్పి చెప్పడం ఒక ఎత్తు. అది ఒక ప్రత్యేకమైన శాస్త్రం అని అది ఒక ప్రత్యేకమైన కళ. ఇక్కడ ప్రత్యేకంగా చెప్పాలి. ఆ పాఠం చెప్పే విధానాన్ని ఎడ్యుకేషన్ మెథడాలజీలో ఒక మెథడ్‌గా పెట్టాలి అని నాకు అనిపిస్తుంది. అత్యంత అనుభవజ్ఞులైన ఆచార్యులు చెప్పేవిధానాన్ని తెలుసుకోవడం వాటిని మెథడాలజీ పాఠాలలో పెట్టడం చాలా అవసరం అని ఇలాంటి ఆచార్యుల పాఠాలు వినినప్పుడు అనిపిస్తుంది.

మా గురువుగారిలోని రెండవ పార్శ్వం సంస్కృత సాహిత్యం. మాకు మూడు నాలుగు సెమిస్టర్లలో సంస్కృత వ్యాకరణాన్ని, సాహిత్యాన్ని చెప్పేవారు. మూడో సెమిస్టర్లో శబ్దాలు ధాతువులు సంధి సమాసాలు వంటి ప్రాథమిక వ్యాకరణం ఉండేది. నాలుగో సెమిస్టర్లో రెండు పాఠ్య పుస్తకాలుండేవి. ఒకటి పంచతంత్రం రెండోది రఘువంశం. అంతకు ముందు తెలుసుకున్న వ్యాకరణాంశాలు శబ్దస్వరూపాలు ధాతు స్వరూపాలు ఎలా ఉండేవో ఈ సాహిత్యం చదువుకోవడం వల్ల బాగా తెలియవచ్చేది. సంస్కృత సాహిత్యంలో ప్రాథమిక పరిజ్ఞానాన్ని కలిగించడం. తెలుగులో వచ్చేసంస్కృత సమాసాలు పదబంధాలు పదాల సాధురూపాలు తెలుసుకోవడానికి

ఈ పరిజ్ఞానం బాగా ఉపయోగపడింది. ఇక సంస్కృత సాహిత్యం చెప్పడంలో కూడా శ్రీహరి గారి ముద్ర ఉంది. వారిని కేవల వ్యాకరణ పండితులే అని అనుకున్న వారు వారి సాహిత్య పాఠాలు వింటే ముక్కున వేలు వేసుకునే వారు. శ్లోక రచనలోని మర్మాలు, అలంకార రచన, ఔచిత్యాన్ని పాటించి చేసే రచన, కాళిదాసు హృదయాన్ని విప్పిచెప్పడం, కాళిదాసు ఇతర కృతులలోని స్వారస్యాన్ని ఆహ్లాదకరంగా చెప్పడం ఇదంతా వారు రఘువంశం పాఠం చెబుతుంటే మేము విన్న అనుభవాలు. సాహిత్య పాఠం చెప్పేటప్పుడు కూడా తిరిగి వ్యాకరణ చర్చ వచ్చేది. అది కూడా చెప్పే సాహిత్యంతో చాలా దగ్గరి సంబంధం ఉండి చాలా విజ్ఞాన దాయకంగా సాగేది. వారి ఉపాధ్యాయ వృత్తి నైపుణ్యాన్ని గురించి చెప్పడం లో ఇక్కడ ఒక మాట చెప్పాలి. వారు పాఠాలు విని నాకై నాకు 40సంవత్సరాలు దాటింది. కాని ఈ రోజు కళ్ళు మూసుకుని ఆరోజు పాఠం దృశ్యాన్ని గుర్తుకు తెచ్చుకుంటే శ్రీహరి గారి పాఠం చెవికి సజీవంగా వినిపిస్తుంది. అలాగే సజీవంగా హృదయంలో కనిపిస్తుంది. మా బ్యాచి అయిన తర్వాత మరో రెండు బ్యాచిల తర్వాత అనుకుంటా. వారు హైదరాబాదు కేంద్రీయ విశ్వవిద్యాలయానికి వెళ్ళిపోయారు. నా పిహెచ్.డి అయిన తర్వాత నేనూ1992లో హైదరాబాదు కేంద్రీయ విశ్వవిద్యాలయంలోనే, జానపద సంస్కృతి పరిశోధన కేంద్రంలో ఉద్యోగంలో చేరాను. వారు తెలుగు శాఖలో ఉండేవారు. వారి శాఖలో సెమినార్లు జరుగుతుంటే వెళ్ళే వాడిని. జానపద అంశాలపైన సదస్సు జరిగితే నన్ను ప్రత్యేకంగా పిలిచేవారు. అదే పూర్వపు ఆత్మీయత అలాగే కొనసాగింది.

**ద్రావిడ విశ్వవిద్యాలయానికి ఉపాధ్యక్షులు కావడం, ఆ పదవిని వారు నిర్వహించిన తీరు వారి జీవితంలో ఉన్నతమైన మజిలీ.** ఈ పదవిలో వారు 2001 నుండి 2004 దాకా మూడు సంవత్సరాలు పనిచేశారు. అప్పటికి ద్రావిడ విశ్వవిద్యాలయం మొదలై కేవలం మూడు సంవత్సరాలే అయింది. 1997 అక్టోబరు 20 న విశ్వవిద్యాలయం వ్యవస్థాపన జరిగితే అప్పటినుండి మూడు సంవత్సరాలు ఆచార్య అరుణాచలం గారు ఉపాధ్యక్షులుగా చేశారు. కొద్ది రోజులు ఇంచార్జి పాలనలో ఉండగా తర్వాత ఆచార్య రవ్వా శ్రీహరిగారిని దీనికి రెండవ ఉపాధ్యక్షులుగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నియమించింది. వారు వచ్చేటప్పటికి కంపారిటివ్ ద్రవిడియన్ లిటరేచర్ అండ్ ఫిలాసఫీ, కంప్యూటర్ సైన్స్, ఈ రెండు శాఖలే ఉండేవి. అయితే ఈ రెండు శాఖలలో కూడా ఉపాధ్యాయుల పోస్టులు అన్నీ భర్తీ కాలేదు. ఒకరిద్దరే ఉండేవారు. శ్రీహరి గారు వచ్చిన తర్వాతనే ఈ శాఖలలో అప్పటిదాకా ఖాళీగా ఉన్న పోస్టులను భర్తీ చేశారు. విశ్వవిద్యాలయ నిర్మాణం అన్నది దాని రూపురేఖలు అనేవి వారి కాలంలోనే ఏర్పడ్డాయి. ప్లానింగ్ అండ్ మానిటరింగ్ బోర్డుతో సమన్వయం చేసుకుంటూ విశ్వవిద్యాలయం రాబోయే రోజుల్లో ఏ రీతిలో ఉండాలి అనే దిశగా ప్రణాళికా రచన చేసింది, ద్రావిడ విశ్వవిద్యాలయం ద్రావిడ భాషల కోసం ఎలా నిర్మించబడాలి అనే రూపకల్పన కూడా వారి ద్వారానే జరిగింది. వారు చేరిన తర్వాత ఖాళీగా ఉన్న అధ్యాపకపోస్టుల నియామకం జరిగింది. అది రెండు విడతలుగా జరిగింది. తర్వాత డిపార్ట్‌మెంట్ ఆఫ్ ఫోక్‌లోర్ అండ్ ట్రైబల్ స్టడీస్, డిపార్ట్‌మెంట్ ఆఫ్ హిస్టరీ, కల్చర్ అండ్ ఆర్కియాలజీ, శాఖలు పూర్తిగావీరి ఆధ్వర్యంలోనే ఏర్పడ్డాయి. వాటి అధ్యాపక నియామకాలు ఆచార్య శ్రీహరి గారే చేశారు. **అధ్యాపక నియామకంలో నూటికి నూరు శాతం నిజాయితీగా ప్రతిభే పరమ ప్రమాణంగా జరిగిన ఈ నియామక ప్రక్రియ నేటికీ ఆదర్శంగా నిలబడింది. శ్రీహరి గారి నిజాయితీకి వారి వృత్తి బద్ధమైన దీక్షకి, స్థిరసంకల్పానికి ఈ అధ్యాపక నియామకాలు గీటు రాయిగా నేటికీ నిలబడ్డాయి.** సి.డి.ఎల్.పి శాఖలో ఎం.ఎ తెలుగు వీరు ఆరంభించినదే. ఈ రెండు శాఖలలో చాలా దూరదృష్టితో రీసెర్చి ఫెలో పోస్టులు ఒక్కో శాఖకు ఎనిమిది చొప్పున సంపాదించగలిగారు. ఈ రెండు శాఖలే కాదు. ద్రావిడ విశ్వవిద్యాలయానికి అవసరమైన తెలుగు, తమిళ, మలయాళ, కన్నడ, ఇంగ్లీషు, లింగ్విస్టిక్స్ శాఖలకు అవసరమైన అధ్యాపక పోస్టులను ఆనాటి ప్రభుత్వంతో కలిసి పనిచేసి ఆచార్య శ్రీహరి గారే తీసుకువచ్చారు. వారి కాలంలోనే ఈ పోస్టులను ఈ శాఖలను ద్రావిడ విశ్వవిద్యాలయానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కేటాయించింది. ఆ శాఖలలో పోస్టులను భర్తీచేసి, పూర్తిస్థాయిలో శాఖలను ఏర్పాటు చేసే వ్యవధి వారికి లభించలేదు. వాటిని నింపకుండానే వారు పదవీవిరమణ చేశారు. కాని ఆ శాఖలను తెచ్చిన కీర్తి మాత్రం నేటికీ వారికే దక్కుతుంది.

శ్రీహరి గారు ద్రావిడ విశ్వవిద్యాలయం అనేది ద్రావిడ **భాషాసాహిత్యాలకు ఇతర ద్రావిడ అధ్యయనాల శాఖలకు అంకితమై పనిచేయాలనే లక్ష్యంతోనే ఈ నిర్మాణ రూపకల్పన చేశారు. శ్రీహరి గారి తర్వాత వచ్చిన ఆచార్య చలం గారు కూడా ద్రావిడ అధ్యయనానికి పెద్ద పీట వేశారు. ఆ దిశగానే రూప కల్పన చేశారు. కాని వీరు కేవలం ఒక నెల రోజులే పనిచేయడం దురదృష్టకరం. ఆ తర్వాత వచ్చిన ఉపాధ్యక్షుల కాలంలోనే ద్రావిడ విశ్వవిద్యాలయం ద్రావిడ అధ్యయనాల లక్ష్యం నుండి పక్క దారి పట్టడం జరిగింది.** వేరేవేరే సైన్సు శాఖలు ద్రావిడ అధ్యయనాలతో సంబంధం లేని ఇతర శాఖలను ఏర్పాటు చేసి ఈ విశ్వవిద్యాలయ లక్ష్యాలకు దీన్ని దూరంగా తీసుకుపోయారు.

ఆచార్య శ్రీహరి గారి సమయంలోనే ఇంకెన్నో మంచి విద్యాత్మకమైన కార్యక్రమాలు జరిగాయి. జాతీయ అంతర్జాతీయ సదస్సులు జరిగాయి. అంతర్జాతీయ ఆచార్యుడు ప్రొఫెసర్ పీటర్ క్లాజ్ విశ్వవిద్యాలయాన్ని దర్శించి ఉపన్యాసాలు ఇచ్చారు. **విశ్వవిద్యాలయానికి గర్వకారణమైన బహుభాషా నిఘంటువు (మల్టీ లింగ్వల్ డిక్షనరీ)ను ఆచార్య శ్రీహరి ప్రారంభించారు.** ఇందులో తెలుగు పదాలు ప్రధాన ఆరోపాలుగా ఉంటాయి. తమిళ, కన్నడ, మళయాళ పదాలు అర్థాలలో ఉంటాయి. తర్వాత చివరిగా ఇంగ్లీషు లో కూడా ఆ పదానికి అర్థం ఇస్తారు. గ్రంథం చివరిలో అన్ని భాషల పదాల అకారాది సూచి ఉంటుంది. ఈ నిఘంటు నిర్మాణం ద్వారా ఏ భాషకు చెందిన వారైనా ఈ నిఘంటువును వినియోగించుకొని వారి భాష ద్వారా ఇతర భాషలలోని అర్థాలను తెలుసుకోవచ్చు. ఇంతటి బృహత్తర నిఘంటువు పథకాన్ని ప్రారంభించి దానికి కావలసిన సిబ్బందిని నియమించారు. కన్నడం. తమిళం పదాలను కూర్చడం మొదలైంది. కన్నడం పదాలు అచ్చులు హల్లులు కూడా మొత్తం తయారు

అయినాయి. తమిళ భాషకు సంబంధించి అచ్చుల వరకు పని పూర్తి అయింది. మలయాళ భాషకు సరైన ప్రాజక్టు అసిస్టెంటు అప్పటికి లభించని కారణంగా నియామకం సాగలేదు. శ్రీహరి గారు పదవీ విరమణ చేసే నాటికి ఈ నిఘంటువు పరిస్థితి ఇది. ఇదే పరిస్థితి నేటికీ కొనసాగుతుండటం అంటే వారి తర్వాత ముగ్గురు ఉపాధ్యక్షులు వచ్చినా ఈ పని ఆగిపోయి అలాగే ఉండడం దురదృష్టకరం.

**ఆచార్య శ్రీహరి గారి కాలంలోనే ప్రధానమైన భవనాల నిర్మాణం కూడా జరిగింది. నాలుగు ప్రధానమైన భవనాల నిర్మాణం వీరి కన్నా ముందే ఆరంభం అయినా వీరి కాలంలో అవి పూర్తి అయినాయి. అంతేకాదు, భాషాభవనం వీరి కాలంలో మొదలైంది. అధ్యాపకుల క్వార్టర్లు, వి.సి బంగ్లా శ్రీహరి గారి కాలంలోనే నిర్మించబడ్డాయి. వారి స్వప్నంలో మరెన్నో భవనాలు పథకాలు మెదిలాయి. కాని కాలం తక్కువ అయిన కారణాన చాలా పనులు తర్వాత వచ్చిన వారి కాలంలో నిర్మాణాలు పూర్తి అయినాయి. తెలుగు పండిత కోర్సు శ్రీహరి గారి కాలంలోనే మనకు వచ్చింది. గ్రంథాలయం పూర్తి రూపానికి ఈ కాలంలోనే వచ్చింది. అప్పటికే దాదాపు 37వేల పుస్తకాలు చేరాయి. ద్రావిడ విశ్వవిద్యాలయం రూపకల్పన జరిగే కాలంలో ఆచార్య శ్రీహరి గారు ఉండడం అటు విద్యాత్మకమైన పునాది, ఇటు భవనాల రూపంలో పెక్కుపునాదులు వారికాలంలో జరగడం అన్నది గుర్తు పెట్టుకోదగిన అంశం. విశ్వవిద్యాలయానికి వారు చేసిన సేవ కృషి కలకాలం నిలబడేదిగా ఉంది. ఆ పునాదులు పైన చాలా భవనాలు వచ్చాయి. వారి కృషి ఈ రకంగా నిరంతరాయంగా ఉంటుంది.**

ఆచార్య శ్రీహరి గారిని తలచుకున్నప్పుడల్లా వారి పాలన శైలి ఇక్కడ అందరికీ గుర్తుకు వస్తుంది. నూటికి నూరుశాతం అవినీతి రహిత పాలనను వారు అందించారు. నిజాయితీకి మారుపేరుగా నేటికీ శ్రీహరిగారిని చెప్పుకుంటారు. వారు పొందే జీతానికి మినహాయించి ఒక్క పైసాను వారు ఆశించలేదు, పొందలేదు. నియామకాల్లో గాని పనుల నిర్వహణలో కాని వారి పాలన శైలి నేటికీ ఆదర్శంగా నిలిచింది. బస్సులో ప్రయాణిస్తే బస్సు టిక్కెట్టు ఖరీదే తీసుకున్నారు. విమాన ప్రయాణాలు చేయడానికి వారికి అన్ని అర్హతలున్నా వారి పదవి గౌరవం కోసం అలా ప్రయాణించవలసి ఉన్నా కూడా వారు మామూలు బస్సు ప్రయాణం చేశారు. మామూలు రైలు ప్రయాణం చేశారు. నిరాడంబరంగా వారు పదవిని నిర్వహించారు. విద్యైకదృష్టి తప్ప మరొకటి లేదు. నీతి నిజాయితీ రెండు కళ్లుగా సాగిన వారి పాలన నేటికీ ద్రావిడ విశ్వవిద్యాలయంలో ఒక ప్రమాణంగా నిలిచి, ఇంకొకరిని వారితో పోల్చి చూచుకునే పరిస్థితి నేటికీ ఉంది.

ఆచార్య శ్రీహరి గారు నిరుపేద కుటుంబంలో పుట్టారు. పూటగడవని గడ్డుపరిస్థితులను వారు చవి చూచారు. ఎంతో క్లేశానికి గురై, ఆయన చదువుకున్నారు. ఆ పరిస్థితిని వారి మనస్సులో నిలిచి ఉందేమో, వారు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో పనిచేసే రోజుల్లో ఎందరో విద్యార్థులకు ఆర్థిక సహాయం చేశారు. ఇవన్నీ చెప్పడం వారికి ఇష్టం ఉండదు. కాని వారు సహాయం పొందిన వారిలో ఒకడిని అయిన నేను ఆ విషయం ఇక్కడ చెప్పడం నా ధర్మం. ఆర్థిక సహాయం, పుస్తకాలివ్వడం చదువు కొనసాగించలేని వారికి తోడ్పడి కొనసాగేలా చేయడం చేశారు. ఈ పనిని వారు నేటికీ కొనసాగిస్తూనే ఉన్నారు. వారు విద్యార్థిబంధువు.

విద్యార్థుల పట్ల వారి ధోరణి ప్రత్యేకంగా ఉండేది. వారు ఏ విద్యార్థినీ ఏక వచనంతో పిలిచేవారు కారు. ఏమండీ అనే పిలిచే వారు. అలా ఏకవచనంతో పిలిపించుకున్న అదృష్టవంతుడిని మా బ్యాచి విద్యార్థులలో నేను ఒక్కడినే. ఏమండీ అని పిలవడం దూరం చేయడం కాదు. అక్కడ చదువుకోవడానికి వచ్చిన విద్యార్థులు చాలా మంది పెద్ద వయస్సు వాళ్ళు ఉండేవారు. ఇప్పటి లాగా 21 సంవత్సరాలకే ఎం.ఎ లోనికి వచ్చే పరిస్థితి అప్పుడు లేదు. సగం మంది పెళ్ళి అయిన వారు ఉండేవారు. అక్కడ కొత్త ఉపాధ్యాయులకు విద్యార్థులకు వయోభేదం అంత ఎక్కువగా ఉండేది కాదు. అంతే కాదు మా గురువుగారు దివాకర్ల వేంకటావధాని గారు మమ్మల్ని అందరినీ ఏమండీ అనే పిలిచేవారు. ఎప్పుడూ ఏక వచనం వినియోగించే వారు కాదని వేరే అధ్యాపకులు కూడా చెప్పేవారు. ఎలా పిలిచినా విద్యార్థులు అభిమానాన్ని శ్రీహరి గారు నిండుగా పొందేవారు. వారి శిష్యులుగా మూడు దశాబ్దాల క్రితం ఉన్నా ఇప్పటికీ వారిని గుర్తుపెట్టుకునే విద్యార్థులు అప్పటి వారు చాలా మంది ఉన్నారు.

ఆచార్య శ్రీహరి గారికి మహామహోపాధ్యాయ బిరుదు వచ్చింది. దానికి వారు సంపూర్ణంగా అర్హులు. అయినా వారు నిత్యవిద్యార్థి. పుస్తకాలు చదవకుండా కొత్తది నేర్చుకోవాలి చదువుకోవాలి అనే జిజ్ఞాసతో కాకుండా రోజు గడపడం వారికి తెలియదు. అప్పటి భాస్కర రామాయణంపై వారి పరిశోధన దగ్గరనుండి నిన్న మొన్నటి అన్నమాచార్య నిఘంటువు దాకా నేడు కొనసాగుతున్న పాణినీయం వ్యాఖ్యాన గ్రంథం దాకా శ్రీహరి గారు నిత్య భాషాపరిశోధకులు. వారు చేసిన అవిరళకృషి కలకాలం నిలబడేది. సూర్యరాయాంధ్ర నిఘంటువుకు పరిశేషంగా వారు కూర్చిన శ్రీహరి నిఘంటువు పరిశోధక ప్రపంచానికి తెలుగుభాషా సాహిత్యాలకు ఒక వరం. ఏ తెలుగు పరిశోధకుడైనా తెలుగుభాషను వినియోగించుకునే వారు ఆ నిఘంటువును సంప్రదించక తప్పదు. మాండలిక భాషలపైన వారు చేసిన భాష పరిశోధన ఈ రంగంలో పనిచేసే వారికి మార్గదర్శకంగా ఉంటుంది. తిరుమల తిరుపతి దేవస్థానం వారికి ప్రత్యేకంగా ఎడిటర్ ఇన్ ఛీఫ్ బాధ్యతలలో భాగంగా వారు చేసిన కృషి కూడా కలకాలం ఉండేది. ఇంగ్లీషులో ఒక్కో కవికి ఒక నిఘంటువు ఉండడం చూస్తాం. తెలుగు సాహిత్యంలో మహాభారత నిఘంటువు కోసం ఇద్దరు పనిచేశారు. అది ఇంకా పూర్తి కావలసే ఉంది. అంతేకాదు అది ముగ్గురు కవులకు సంబంధించినది. కాగా ఒక తెలుగు కవికోసం ప్రత్యేకంగా వెలసిన నిఘంటువు ఆచార్య శ్రీహరి గారి అన్నమాచార్య నిఘంటువే అని చెప్పవలసి ఉంది. వారు పాణినీయానికే చేసిన వ్యాఖ్యాన గ్రంథం తెలుగు వారికి పాణినీయానికి మధ్య ఉన్న ఎడాన్ని తొలగించి వ్యాకరణం పట్ల మక్కువ ఉన్న ప్రతి తెలుగు వారికీ ఈ గ్రంథం ఒక సేతువులా ఉపయోగపడుతుంది. పాణినీయం అనే సముద్రాన్ని ఈదడానికి ఒక నావలా వినియోగపడుతుంది. అన్నమయ్య భాషావైభవం పేరుతో వారు అన్నమయ్య భాషకు చేసిన వ్యాఖ్యానం విశ్లేషణ ఆలోచనామృతం. ఏడు పదుల వారి జీవితంలో భాషా

**తరువాయి 32వ పుటలో**

సన్నిధానం నరసింహశర్మ
9292055531




# చంద్రిక కథ

## తమిళ మహాకవి సుబ్రహ్మణ్య భారతి అరవంలో వ్రాసిన అసంపూర్ణ నవలకు బంగోరె 'ముందుమాటలు' పరిచయం

**తమిళమహాకవి సుబ్రహ్మణ్యభారతి అరవంలో రాసిన అసంపూర్ణ నవల చంద్రికైన్ కథైకు తెలుగు అనువాదగ్రంథం చంద్రిక కథ గోపాల - కృష్ణ - రాఘవన్ అనే రచయితల త్రయం ఈ అనువాద శ్రామికులు. వీరి వివరాలు 'బంగోరె ముందుమాటలు'లో తెలుస్తాయి.**

నవలగానూ మరోవిధంగానూ దీని ప్రాధాన్యం దీనికున్న ఎక్కువ లెక్కింపు బంగోరె చెప్పినదే.

ఆయన ముందుమాటల్లో - 'దీనికున్న విలువల్లా నా దృష్టిలో కందుకూరి వీరేశలింగం పంతులు వంటి మహాపురుషుణ్ణీ, ఆయన ధర్మపత్ని రాజ్యలక్ష్మమ్మనూ అచ్చంగా కథాపాత్రలు చేసి సుబ్రహ్మణ్యభారతి అంతటి తమిళ ఆధునిక మహాకవి యాభైఏళ్ళక్రితం (1971 నాటికి) ఒక నవల వ్రాసిపెట్టిపోతే దాన్ని ఇంతవరకూ మన తెలుగువాళ్ళు పట్టించుకోకపోవడం అన్యాయంగా భావించి ఇంతకాలానికి ఈ అనామకుడు ఈ రూపంగా వెలువరించ సాహసించడమే' అన్నారు. రాక్షసపరిశోధకుడని పేరుపొందిన బంగోరె తనను అనామకుడు అని పేర్కొనడంలో నిరాడంబరత్వం సహజంగా వుంది.

అర్థశతాబ్దం తెలుగువాళ్ళు పట్టించుకోని దానిని బంగోరె పట్టించుకుని ప్రకటించడంలో ఆయన 'తెలుగు జాతీయ'తపన ఎంత గొప్పదో మనం గ్రహించి తీరాలి. శ్రీ కె.వి.రమణారెడ్డి, శ్రీ చల్లా రాధాకృష్ణ శర్మ పీఠికాదులతో 1971లో చంద్రికకథ ఎంతో విలువైన అంచనాలతో, పరిశోధనాత్మక అంశాలతో వెలుగొందే బంగోరె ముందుమాటలతో వచ్చింది.

1971లో చంద్రికకథ నవలను బంగోరె నెల్లూరినుండి వేశాక నాలుగు దశాబ్దాల తరువాత, కథానవలా ప్రక్రియల్లో సాహితీసేవకులైన శ్రీ వాసిరెడ్డి కావ్య నవీన్ పబ్లిషింగ్ హౌస్, సికిందరాబాద్ వారి ద్వారా పునర్ముద్రించారు. అందులో చంద్రిక కథ- బంగోరె గురించి కొన్ని మాటలు నాచేత రాయించారు.

చంద్రికకథ ముందుమాటలు బంగోరె రాసినవాటిలో అసాధారణాంశాలున్నాయి. అందులో వున్న వాడి, వేడితో పాటు తెలుగువాడి నాడికూడా ఉండటాన్ని డాక్టర్ సామల రమేష్‌బాబు పట్టుకున్నారు. తెలుగు జాతీయ సంస్కృతీపరిరక్షణకూ, బ్రతుకుల్లో అన్ని కోణాల్లోనూ తెలుగుబాస వెలుగురేఖలు నిండాలనే సమరశీలి కనుక ఆయన సంపాదకులుగా వున్న 'అమ్మనుడి'లో చంద్రికకథకు బంగోరె రాసిన ముందుమాటల భాగాన్ని ఈ సంచికనుండి ప్రారంభించి ఇవ్వనుండడం బంగోరె ఆశించిన చంద్రిక కథాకీర్తి వ్యాప్తికి ఒక మేలుదారి. బంగోరెతో నాకున్న పరిచయభాగ్యం స్ఫూర్తిదాయకమైంది. నేను నెల్లూరు వర్ధమానసమాజంలోనూ ఆయనను కలిశాను. కొన్ని ముచ్చట్లున్నాయి.

ఆయన ముందుమాటల లోతుపాతుల గురించి, ఆయన తెలుగు జాతీయ తపనల గురించి నన్ను కొంచెం ప్రారంభవాక్యాలుగా రాయాలని సామలవారు ప్రేమగా ఆదేశించారు. తత్ఫలాలు ఈ మాటలు. బంగోరె కళ్ళు నిరంతర పరిశోధనల అన్వేషణకు టార్చిలైట్లు.పరిశోధనాంశాలకు చెందిన సమకాలీన పుస్తకాలు, పత్రికలు,చివరకు కరపత్రాలు అన్నిటినీ ఆయన ఇతర పరిశోధకులు చూడని కొత్తచూపులతో తరచిచూస్తారు. ఆయనలో ఉత్తమ పరిశోధకుడు, గొప్పరచయిత మాత్రమేకాక తెలుగువారి అప్రకటిత ప్రతినిధి పూరాగా ఆవరించుకునివుంటాడు. తీవ్రపరిశోధనాంశాలు వెల్లడిస్తూ, సామాన్య మానవుని గొంతుతో మాట్లాడగలుగుతారు.

నార్లవారు ఆంగ్లంలో వీరేశలింగంపై రాసిన గ్రంథంపై ఆంగ్లస్వరాజ్యపత్రికలో శ్రీమతి ప్రేమానందకుమార్ గారి సమక్షంలో భారతి రాసిన చంద్రిక కథాసంబంధమైన అంశాలనూ ఎవరూ పట్టించుకోకపోవడానికి బంగోరె ఆశ్చర్యచకితులై 'మన జాతీయ పెద్దపత్రికా రచయితలకు పెద్ద పెద్ద అంతర్జాతీయవిషయాలు పట్టవేమో' అని ముందుమాటల్లో విమర్శించారు. బంగోరె తాను పుస్తకంగా చంద్రికకథను వేయడానికి ముందు దీనిప్రసక్తులు ఎవరైనా ఎప్పుడైనా చేశారా అని తర్జనభర్జనలు చేశారు. కొమాండూరి శఠకోపాచార్యులు, నిడదవోలు వేంకటరావు,కొత్తపల్లి వీరభద్రరావు,చల్లా రాధాకృష్ణశర్మ వంటివారు ఆయా పత్రికల్లో తమ గ్రంథాల్లో చేసిన సమయ సందర్భ ఉద్ఘాటనలు పట్టుకున్నారు. తెలుగువాడి కీర్తిపతాక ఎక్కడ ఎగిరినా పొంగిపోయే ఎద ఆయనది. స్కాట్ రాసిన **సర్జన్స్‌డాటర్** అనే నవలలో మదరాసు



సుబ్రహ్మణ్యభారతి



బంగోరె

తెలుగు ప్రముఖుడు అవధానం పాపయ్య ఒక పాత్ర అని వెల్లడించారు.

కందుకూరిని సుబ్రహ్మణ్యభారతి ఎక్కడైనా కలిశారా చూశారా అనే అంశాలపై వారిద్దరూ ఎప్పుడెక్కడ మదరాసులో ఉన్నారో అనే దానిపై బంగోరె చాలా పనిచేశారు.పరిశోధనల్లో మెరుపుతీగల్ని పట్టుకుని లాగి డొంకల్లోని కదలికలను గమనించడంలో పరిశోధకులకు బంగోరె ఒక దారిదివ్వె వంటివారు.

సాహిత్యాంశాలను సామాజికదృష్టితో, సామాజికాంశాలను సాహిత్యదృక్పథంతో చూడడంలో ఆయన ప్రజ్ఞావంతుడు.దానిని ఈ ముందుమాటలతో పరిశీలించవచ్చు.

తెలుగువారితో భారతి పరిచయాల పరిశోధనలో ఆయన కృష్ణాపత్రిక ప్రమాణంగా - భారతి ఒక వర్ణాంతర విందుభోజనానికి హాజరైనట్టు వెల్లడించారు. వివిధకులాల మతాల ప్రజలకూడిక అనే మేలు తలంపుతో 1906లో కోకా అహోబలనరసింహారావునాయుడు గారు ఒక విందు చేశారు. 75మందికి మించే హాజరై విందు భోజనాలు చేస్తే 15 రూపాయలు వ్యయం జరిగిందట. అచ్చెరువు కూర్చే ఇటువంటి అంశాలూ ఆయన ముందుమాటల్లో చోటుచేసుకున్నాయి.

**నెల్లూరి మాండలికపు సూటిదనాలు, సోయగాలు, విరుపులు - ఆయన వాడుక తెలుగులో పరిమళిస్తుంటాయి. తెలుగుబాస, తెలుగు జాతీయ కీర్తి, ఆత్మగౌరవప్రదీపక అంశాలు ఆయనకు ప్రాణసమానాలు.**

**'సుబ్రహ్మణ్యభారతి అంతటి మహాకవిచేత ఒక నవలలో గౌరవనీయమైన పాత్రగా మలచబడిన విశేషగౌరవం తెలుగుమహాపురుషుడైన వీరేశలింగం గారికి దక్కింది'అని మాత్రమే రాసి ఊరుకుంటే బంగోరె అవరు. మరెవరో అవుతారు. 'ఒక రకంగా తెలుగుజాతికే ఆ గౌరవం దక్కింది అనుకుందాం' అనడంలో తెలుగు జాతీయాభిమానం పొంగిన బంగోరె కనబడతారు. అదీ ఆయన తెలుగు జాతీయభావనలోని తపన.**

పరిశోధనల్లో అంశాలు తేల్చుకోవడంలో బంగోరె తటపటాయింపులు,పూర్వోత్తర పక్షాల స్వీయచర్చలు, ఒకప్పుడు నమ్మినవాటితోనే వుండిపోక, సత్యానుగుణ నిర్ణయాత్మకగుణాలు కలిగివుండటం ఇవన్నీ - ఇన్నీ చంద్రికకథకు బంగోరె రాసిన ముందుమాటల్లో సాకార రేఖలుంటాయి.

ఒక బెంగాలీ బ్రాహ్మణ అమ్మాయి సరోజినీదేవి - ఒక తెలుగు బలిజ అబ్బాయి గోవిందరాజులునాయుడుల వివాహం వీరేశలింగం ఆధ్వర్యంలో జరిగినా - దానిని స్వీయచరిత్రలో తగువిధంగా ఎందుకు రాయలేదా అని బంగోరె ఆలోచిస్తూ వర్ణాంతర వివాహాలు అనే అంశంలో కందుకూరి ఆలోచనలు తీక్షణంగా పరిశీలించారు. వీరేశలింగం పై పాశ్చాత్యుడు జాన్ లియోనార్డ్ ఆంగ్లంలో పరిశోధన చేశాడు. ఆయన విరేశలింగం ఏ కులంలో వారు ఆ కులంలోనే వివాహాలు చేసుకోవడానికి ఆయన ప్రోత్సహించారని అనని బ్రాహ్మణకులసంస్కర్త అని అనవచ్చంటే బంగోరె- జంధ్యాన్ని తీసిన సంఘటనలు ఆనాడు కొందరు పెద్దలలోనే లేవని, వీరేశలింగం తీసేశారని, వీరేశలింగ 'ఉద్యమ విస్తార పరిధిని' బ్రాహ్మణసంస్కర్త అని సంకుచితవరచి విలువకట్టడం సరికాదన్న ఓ అనుకూలభావప్రకటన చేశారు. సరోజినీదేవి వివాహాన్ని వర్ణాంతర రాష్ట్రాంతర వివాహంగా అభివర్ణించారు. అయితే వీరేశలింగంగారి వర్ణాంతర వివాహదృక్పథంపై మరింతగా పరిశోధన చేయాలని భావించారు.

ఇలా సవాలక్ష సామాజికాంశాలు, అనేక సాహిత్యచారిత్రకాంశాలూ ఈ ముందుమాటల్లో ఉన్నాయి. కనుకనే ప్రత్యేకంగా వాటిని మన ఆలోచనలకు, భావనలకు పదునుపెట్టకోడానికీ ఈ ముందుమాటలు 'అమ్మనుడి'లో ప్రత్యేకంగా ఇచ్చారు. నవలలో ఏముందో కూడా సూక్ష్మదృష్టితో ఇచ్చారు.

బంగోరె 'ఈ చంద్రికకథ నవలను గూర్చి ఈ ఉల్లేఖనలను ప్రక్కకునెట్టి దీనికి ఎందుకు దాసుణ్ణయ్యానో చెప్పుకోవాలి. ఒక ఆంధ్రేతరుడు వ్రాసిన నవలలో వీరేశలింగంగారు, ఆయన భార్య రాజ్యలక్ష్మమ్మ పాత్రలుగా ఉండబట్టే దీనికి ప్రత్యేకత వుంది అనే ధోరణికి తెలుగువాణ్ణిగా నేను దాసుణ్ణయ్యాను' అన్నారు. ఆ చంద్రికకథకు సకారణంగా బంగోరె తాను దాసుడను అని ప్రకటించుకోవడం ఆషామాషీ సంగతా? మరి మనం ఏమవుదాం? అ

**వ్యక్తిత్వ వికాసం, భావప్రకటనలను ప్రస్ఫుటింపజేసేదే మాతృభాష.**

# ముందుమాటలు ...బంగోరె

ముందుగా వొక అపాలజీ చెప్పుకోవాల. ఎందుకనంటే ఈనాడు తెలుగునాట కనపడే ప్రతి 'అనన్య సామాన్య ప్రచారం గల' తెలుగు వార – మాస పత్రికల్లో సీరియల్స్‌గానూ, సంక్షిప్తంగానూ, స్వతంత్రంగానూ తెలుగు నవలలు పుట్టగొడుగుల్లా పుట్టుకొస్తున్న ఈ రోజుల్లో మరొక నవలను ఆంధ్రపాఠక మహాశయుల మీదకు విసరుతున్నందుకు అపాలజీగాక ఇంకేం చెప్పుకోవాల? పైగా ఈ మరొక నవల తర్జుమా నవల. కానీ దీన్ని నేను కేవలం మరొక నవలగా వెలుగులోకి తీసుకురావడం లేదు. ఇది పూర్తి నవలకూడా కాదు. అసంపూర్ణంగా వుండిపోయిన నవల. ముద్రణలో పట్టుమని నూరు పేజీలమోయినైనా రాలేదు. అట్లాంటి దీనికి ఏపాటి విలువ వుంటుంది?

దీనికున్న విలువల్లా నా దృష్టిలో వొక్కటే – కందుకూరి వీరేశలింగంపంతులు గారంతటి తెలుగు మహాపురుషుణ్ణి, ఆయన ధర్మపత్ని రాజ్యలక్ష్మమ్మనూ అచ్చం కథాపాత్రలుగా చేసి సుబ్రహ్మణ్యభారతి అంతటి తమిళ ఆధునిక మహాకవి దాదాపు 50 ఏళ్ళక్రితం వొక నవల వ్రాసి పెట్టిపోతే, దాన్ని ఇంతవరకూ మన తెలుగువాళ్ళు పట్టించుకోకపోవడం అన్యాయంగా భావించి, ఇంతకాలానికి ఈ అనామకుడు ఈ రూపంగా వెలువరించ సాహసించడమే. ఎట్లయితేనేం ఈ 50 ఏళ్ళుగా తెలుగువాళ్ళ దృష్టికి రాకుండా అజ్ఞాతంగా వుండిపోయిన ఈ నవల ఈనాడు ఈ రూపంలో వెలువడ్తున్నది. వీరేశలింగంగారి వైపునుండి శ్రీ కె.వి.రమణారెడ్డి పీఠికాప్రాయంగానూ, సుబ్రహ్మణ్యభారతిగారి వైపునుండి డా. చల్లా రాధాకృష్ణ శర్మగారు పరిచయరూపంగానూ రెండు వ్యాసానికలను ఈ నవలకు జతచేసారు. ఇక ఏదిక్కులేని వాణ్ణయిన నేను ఏ దిక్కునుండి ప్రవేశించాలో తెలియడంలేదు.

మొదట ఈ నవల ఇంకొంచెం 'క్రూడ్ ఫార్మ్' లో జమీన్ రైతు పత్రికలో సీరియల్గా వెలువడింది. 'గోపాల-కృష్ణ-రాఘవన్' అనే ముగ్గురు గుప్త నామధేయుల పేర అబందరగా తర్జుమాచేయడం జరిగింది. 'గోపాల' అంటే బంగోరె (గోపాలరెడ్డి), 'కృష్ణ' అంటే పండిత ఎన్.ఎస్.కృష్ణమూర్తి, 'రాఘవన్' అంటే వి.ఆర్. కాలెజి సంస్కృత అధ్యాపకులు వి.ఎస్.రాఘవన్. ఇందులో మొదటివారికి, తమిళ రాజధాని అల్లుడైనా, తమిళం బొత్తిగారాదు; రెండో ఆయనకు 'తోడాతోడా' వచ్చు; మూడో ఆయనకు బాగావచ్చు. మూడో ఆయన తమిళమూలం చదివి తెలుగులో 'డిక్టేట్' చేస్తుంటే,రెండో ఆయన గురునాథుడై వ్రాస్తుంటే, మొదటాయన మామూలు తెలుగులోకి పరివర్తన చేసుకుని సీరియల్గా ప్రచురించేవాడు. ఇట్లా తయారైన ఆ మొదటి ముడిరూపాన్ని తర్వాత కాస్త మెరుగుపెట్టి మూలాన్ని మరొకసారి దగ్గర పెట్టుకుని తెలుగుసేతను మరికొంత సరిచేసి, సాఫీచేసి ఈ రూపంలో వెలువరిస్తున్నాను.

**వెలువరింపు వెనుకకథ**

ఈ నవల ఈ రూపంగా వెలువడ్డానికి వెనక వొక కథవుంది. 1968లో నార్ల గారు ఇంగ్లీషులో వీరేశలింగంగారిపైన వొక పుస్తకాన్ని వ్రాసారు – కేంద్ర సాహిత్య అకాడమీవారి 'భారతీయ సారస్వత నిర్మాతల జీవిత చరిత్రల' సీరీస్‌లో అచ్చయిన కొత్తలోనే అది నాచేతికొచ్చి సగందాక చదివి వుత్తేజితుణ్ణవుతున్న దశలోనే – ఈ పుస్తకంపై ఇంగ్లీషు పత్రిక 'స్వరాజ్య' లో శ్రీమతి ప్రేమానందకుమార్ గారు సమీక్ష చేసారు. 1968 నవంబరు 2వ తేదీ సంచికలో ఇది వొట్టి సమీక్షగా కనపళ్ళేదు – భారతిగారు వీరేశలింగంగార్నీ, ఆయన భార్యనూ పాత్రలుగా చేసి వ్రాసిన ఈ తమిళ నవలను ప్రముఖంగా ప్రత్యేకంగా తెలుగువారి దృష్టికి తెచ్చేదానికోసంగానే ప్రధానంగా ఈ సమీక్షను ఆమె వుపయోగించుకున్నదా అనిపించింది.

అది చదివిన తర్వాత నాలో వుత్సుకత కల్గింది. తెలుగు వీరేశలింగంగార్ని ఏమిటి, అరవ సుబ్రహ్మణ్యభారతిగారు పాత్రగాచేసుకుని నవల వ్రాయడమేమిటి – ఈ విషయాన్ని ఆరాతీయాలనిపించింది. రెండు నెల్లు వేచిచూచాను – తెలుగువాళ్ళకు ఇన్ని పెద్దపత్రికలున్నాయికదా, ఈ పెద్ద పత్రికల్లో పనిచేసే పెద్ద రచయితలు ఈ సమీక్షను చూచినతర్వాతైనా ఆ నవల విషయం పట్టించుకోకుండా వుంటారా అని కొంతకాలం దాటవేసాను. ఎంతకాలం చూచినా ఆ విషయం ఎవరూకూడా పట్టించుకొన్న పాపాన పోయినట్లు లేదు. మన జాతీయ పెద్ద పత్రికా రచయితలకు పెద్ద పెద్ద అంతర్జాతీయ విషయాలుతప్ప, ఇట్లాంటి చిన్నచిన్న జాతీయ దేశీయ విషయాలు పట్టవేమో?

కడకు వొక చిన్న మారుమూల పత్రికలో పనిచేసే నేనే పట్టించుకోవల్సి వచ్చింది.మద్రాసువెళ్ళి ఆ నవల ముద్రిత ప్రతిని సేకరించి చదివించుకోగా ఆశ్చర్యం కల్గింది.ఇంతటి చారిత్రక ప్రాధాన్యం కల్గిన రచనను ఇంతకాలం ఎవరూ పట్టించుకోకపోవడం విడ్డూరంగానే తోచింది. కేవలం వొక చిన్న 'లిటరరీ స్కూప్' గా భావించి హడావుడిగా దీన్ని 'జమీన్ రైతు' లో సీరియల్‌గా ప్రచురించడం జరిగింది. అంతటితో ఆ విషయం తీరిపోయింది.

**ఈ నవలను గూర్చిన కొన్ని ప్రస్తావనలు**

ఇక్కడొకమాట చెప్పవల్సి వుంది.పట్టించుకోలేదనడం సత్యదూరమే అవుతుంది. 1942 ఏప్రిల్ – జూలై 'ఆంధ్ర సారస్వత పరిషత్ పత్రిక' లో కొమాండూరు శఠకోపాచార్యులుగారు 'సుబ్రహ్మణ్య భారతి' అనే వ్యాసంలో ఈ నవలనుగూర్చి ఇట్లా ప్రస్తావించివున్నారు:

'చంద్రికైయిన్ కవితై' అనునది సాంఘిక నవల. దాని కథ చాల మనోహరము. మన సాంఘిక లోపముల బోగొట్టు సంస్కరణోద్దేశముతో భారతి ఈ నవలను రచించెననుట స్పష్టము. విధవా వివాహము సంఘ క్షేమకరమనియు బ్రాహ్మణ శూద్రులమధ్యను వివాహమును నిజముగ ప్రేమజనితమైనపుడు నిర్దోషమనియు నిందలి కథవలన సూచితము. మరియు భారతి సందర్భోచితముగ నీ నవలలో దాక్షిణాత్య సంస్కర్తలలో ముఖ్యుడగు జి.సుబ్రహ్మణ్యయ్యరును, ఆంధ్ర సంస్కర్తలలో నగ్రేసరులైన

మహాకవి శ్రీ వీరేశలింగంపంతులుగారిని కథాపాత్రలుగా బెట్టి వారిట్టి సంస్కరణల కొరకు ప్రచారమును ప్రత్యక్షకృషినిజేసి ధన్యులైనట్లు యధార్థ కథను గూడ నిందు మిళితముచేసి వివరించినాడు. ఇందువలన భారతికి మన వీరేశలింగంగారి పైన విశేష గౌరవముండెననియు నిందువలన వ్యక్తమయినది'

తర్వాత 1948 ఏప్రిల్ 'భారతి' పత్రికలో వీరేశలింగంగారిపై శ్రీ నిడదవోలు వెంకటరావు ఒక వ్యాసం వ్రాస్తూ ఇట్లన్నారు:

'సంఘ సంస్కరణమున వితంతూ ద్వాహ మూలమున వీరేశలింగ కవికీర్తి రాష్ట్రేతర ప్రదేశములయందు వ్యాపించినది. తమిళ దేశీయులకు జాతీయ కవియైన సుబ్రహ్మణ్యభారతి తన రచనలో 'చంద్రికె' అను ఒక నవలయందు వీరేశలింగంగారి పాత్రను అద్భుతముగ చిత్రించి వున్నారు.'

ఆ తర్వాత 'తెలుగు సాహిత్యంపై ఇంగ్లీషు ప్రభావం (1960) అనే గ్రంథంలో డా. కొత్తపల్లి వీరభద్రరావుగారు 439 పేజీలో'ఫుట్‌నోట్స్' గా–.

'ప్రఖ్యాత తమిళ కవియైన సుబ్రహ్మణ్య భారతి తన'చంద్రిక' యను రచనలో వీరేశలింగంపంతులుగారిని పేర్కొని వారి సంఘసేవ నుగ్గడించెను' –అని ఇరికించివున్నారు. ఇక వీటన్నిటి తర్వాత డా. చల్లా రాధాకృష్ణశర్మగారు కూడా తన 'సుబ్రహ్మణ్యభారతి' అనే గ్రంథంలో ఈ నవలనుగూర్చి పేర్కొనక పోలేదు.

ఇట్లా ఈ తమిళ నవలనుగూర్చి ఎట్లనో వొకట్ల మన తెలుగువారు కొన్ని తరాలుగా పేర్కొంటూ వస్తున్నా ఎందువల్లనో ఇంతకాలం తెలుగు వెలుగు చూడలేకపోయింది. ఇన్నాళ్ళకైనా ఈ నవల వెలుగు చూస్తున్నది. అదే పదివేలనుకుందాం. సీరియల్‌గా వెలువడ్డ లగాయితూ ఈ నవలనుగూర్చి అప్పుడప్పుడూ ఆలోచించిన కొద్దీ వీరేశలింగంగారి జీవితానికి సంబంధించి కొన్ని కొత్తకోణాలు స్ఫురిస్తూ కొత్త సందేహాలు కల్గుతూ వచ్చాయి.

## ప్రశ్నలూ - సందేహాలు

అరవ భారతిగారికీ, తెలుగు వీరేశలింగంగారికీ పరిచయమేమైనా వుందా? పరిచయముండివుంటే వీరేశలింగంగారి స్వీయచరిత్రలో భారతిగారి ప్రస్తావన లేదెందువల్ల? పరిచయం లేకపోతే వీరేశలింగంగార్ని వొక పాత్రగా ఎన్నుకుని నవలను నిర్మించేందుకు భారతిగార్ని ప్రేరేపించిన శక్తులేవి? వీరేశలింగం గారు మద్రాసులోను, బెంగుళూరులోను సంఘసంస్కరణ విషయంగా అంత కృషి చేసినపుడు ఆ భాషలవారికి ఆయనపై కల్గిన భావాలేమిటి? వాళ్ళ reaction ఏమిటి? ఏదో 'సెటైరు' గాను 'సింబాలిక్' గానూ వ్రాయడంగాక అసలు సమకాలిక వ్యక్తులను (వొక్క వీరేశలింగంగార్నే గాక, హిందూ పత్రిక సంస్థాపక సంపాదకుడైన జి.సుబ్రహ్మణ్యయ్యర్ను కూడా) అదే పేర్లతో పాత్రలుగా స్వీకరించి నవలగా వ్రాసే సంప్రదాయమేమిటి? అట్లా రచన సాగినపుడు చరిత్రకూ సారస్వతానికీ తేడాను పరిశీలించేదెట్లా? ప్రపంచ సారస్వతంలో ఇట్లాంటి సాదృశ్యాలున్నాయా? (నిజానికి ఇట్లాంటి సాదృశ్యాలు కొన్ని లేకపోలేదు - స్కాట్ వ్రాసిన 'సర్జన్స్ డాటర్' అనే నవలలో మన తెలుగువాడూ ఆ రోజుల్లో మద్రాసు ప్రముఖుడూ అయిన అవధానం పాపయ్య వొక పాత్ర అయి కూర్చున్నాడు: థాకరే వ్రాసిన 'న్యూకమ్స్' నవలలో 'రొమన్‌లాల్' పాత్ర కల్పనకు సాక్షాత్తు మన భారతీయుడు రాజారామమోహనరాయ్‌గారు లండన్లో పర్యటించినప్పటి సన్నివేశాల ప్రభావం వుందంటారు; ప్రిన్సెప్ నవల 'బాబు' లో బ్రిజ్ మోహన్ బెనర్జీ, హెచ్.జి.వెల్స్. 'జోన్ & పీటర్ లో మీర్ జలాలుద్దీన్ వగైరావగైరా సమకాలికులు పాత్రలుగా ప్రవేశపెట్టబడినటు 'మిథిక్ సొసైటీ జర్నల్' 1942 జనవరి సంచికలో పి.ఆర్. కృష్ణస్వామిగారు వ్రాసిన 'ఇండియన్ కారెక్టర్స్ ఇన్ ఇంగ్లీషు ఫిక్షన్' అనే వ్యాసంలో పేర్కొని వున్నారు). ఇట్లా ఈ వివిధ ప్రశ్నలపై మనసుపోయి కొంత పరిశీలన - పరిశోధన చేయవల్సి వచ్చింది.

## వీరేశలింగంగారికీ భారతిగారికీ పరిచయముందా?

వీళ్ళిద్దరికీ పరిచయమున్నట్లు దాఖలాలేమీ లేవు - వున్నంతమటుకు వీరేశలింగంగారి స్వీయచరిత్రలో భారతిగారి ప్రస్తావనే ఎక్కడా లేదు. వీరేశలింగంగారి అస్తమయం 1919లో, భారతిగారిది 1921 లో - రెండేళ్ళ ఎడమవుంది. భారతిగారు పుట్టింది 1882లో, వీరేశలింగంగారు 1848 లో - ఇద్దరిమధ్య 34 ఏళ్ళ తేడా వుంది. మిగతా విషయాల సంగతటుంచి వీరేశలింగంగారు భారతిగారికన్నా వయస్సులోనూ అనుభవంలోనూ పెద్దవారు. ఈ పెద్ద చిన్న ప్రస్తావన లటుంచి ప్రవృత్తిలో ఇద్దరికీ చాలామటుకు ఏకతవుంది గాబట్టి, వొక విధంగా సమకాలికులు కావడమేగాక ఇంకోవిధంగా మద్రాసుతో ఇద్దరికీ సన్నిహిత సంబంధమున్నప్పుడు పరిచయం లేకుండా ఎట్లుంటుందనేది మొదటి సందేహం.

వీళ్ళ జీవిత చరిత్రలను సూక్ష్మంగా పరిశీలించినపుడు ఆ సందేహానికి తావులేదు. వీరేశలింగంగారు పెద్దయి, కాస్త ప్రముఖుడై మొట్టమొదట మద్రాసుకు వచ్చింది 1875లో. అప్పటికి భారతి పుట్టనేలేదు. తర్వాత 1882 - 83 లో వచ్చినపుడు భారతి ఇంకా ఎట్టయాపురం పొత్తిళ్ళు దాటి రానేలేదు. ఇకపోతే దీనితర్వాత 15 ఏళ్ళకు 1897లో వీరేశలింగంగారు మద్రాసువచ్చి ప్రెసిడెన్సీ కాలేజీ తెలుగు అధ్యాపకుడై ఇతర సామాజిక వుద్యమాల్లో కూడా ప్రముఖుడుగా వుంటూ అక్కడే స్థిరపడి 1904 చివరిదాకా మద్రాసులోనే వుండి 1905 జనవరిలో రాజమండ్రి చేరుకుంటారు. ఈ టైముకు భారతి అన్నిటా పెద్దవాడై 'స్వదేశమిత్రన్' దినపత్రికలో 1904 లో చేరడానికి మద్రాసు వచ్చారు.

1905 తర్వాత వీరేశలింగంగారి జీవితానికి వొక విధంగా రాజమండ్రే కేంద్రమై పోయినా ఆ తర్వాత కాలంలో మద్రాసుకొచ్చిన సందర్భాలు కొన్ని వున్నా అప్పుడు భారతిగారు వీరేశలింగంగార్ని కల్సివుండే అవకాశం వుండదు. ఎందుకనంటే 1908 నుండి 1918 నవంబరు దాకా పదేళ్ళ పర్యంతం భారతిగారు పాండుచ్చేరిలో ప్రవాసిగా వుండిపోవల్సి వచ్చింది. అ

...... తరువాయి వచ్చే సంచికలో

- గుండె లోతుల్లోంచి వచ్చేదీ, మనసు విప్పి చెప్పగలిగిందీ మాతృభాషలోనే.
- తల్లిని మరువలేనట్లే తల్లిభాషనూ మరువలేము.
- గోరుముద్దలు పెడుతూ అమ్మ నాకు నేర్పిందే నా భాష.

భాష - సాంకేతికత

కందగట్ల శ్రవణ్ కుమార్
99088 43592

# ప్రాంతీయ భాషల్లో సాంకేతిక కోర్సులు: ప్రయోజనాలు, సవాళ్లు

జాతీయ నూతన విద్యా విధానం-2020 ప్రకారం అట్టడుగు వర్గాలకు చెందిన విద్యార్థులు సాంకేతిక విద్యలో ప్రత్యేకమైన (specialization) కోర్సులని మాతృభాష లేదా ప్రాంతీయభాషల్లో విద్యను అభ్యసించడాన్ని ప్రోత్సహిస్తుంది. భారతదేశం లాంటి అభివృద్ధి చెందుతున్న దేశానికి ఇటువంటి అనువైన విధానాలను అమలు చేయడం అంత సులభం కాదు. మొదట్లో ప్రాంతీయ భాషల్లో సాంకేతిక విద్యా బోధనకు వ్యతిరేకంగా కొన్ని విద్యాసంస్థల నుంచి తీవ్ర వ్యతిరేకత వచ్చింది. ఏది ఏమైనప్పటికీ, అసమానతలు ఉన్నప్పటికీ మన దేశంలో ఉన్న కొన్ని ఇంజినీరింగ్ విద్యాసంస్థలు స్థానిక భాషల్లో సాంకేతిక కోర్సులు అందుబాటులోకి తెచ్చాయి. గతంలో భారతదేశంలోని అటల్ బిహారీ వాజ్‌పేయి హిందీ విశ్వవిద్యాలయం, అన్నావిశ్వవిద్యాలయం ఇంజనీరింగ్ వంటి సాంకేతిక విద్య కోసం ప్రాంతీయ భాషా కోర్సులను ప్రవేశపెట్టడానికి ప్రయత్నించాయి. కానీ విజయవంతంగా అమలు చేయలేకపోయాయి. ఎందుకంటే చదువుకోవడానికి అవసరమైన మెటీరియల్ చాలా వరకు ఇంగ్లీష్ లో ఉంది. ఇది విద్యార్థులకు అనేక సమస్యలను కలిగించింది. ఈ సమస్యను ఎదుర్కోవడానికి, ఇంజినీరింగ్ అధ్యయనానికి సంబంధించిన విషయ పరిజ్ఞానం ప్రాంతీయ భాషల్లోకి అనువదించే ప్రయత్నాన్ని ఆల్ ఇండియా కౌన్సిల్ ఫర్ టెక్నికల్ ఎడ్యుకేషన్ (AICTE) చేస్తున్నది. భారతదేశంలో ఎక్కువ సంఖ్యలో వృత్తిపరమైన కోర్సులు ఆంగ్లంలో బోధించబడుతున్నాయి. సైన్స్, ఇంజినీరింగ్, వైద్య, న్యాయ శాస్త్రాల బోధన స్థానిక భాషలో ఆచరణాత్మకంగా లేవు. ఎక్కువ మంది విద్యార్థులు స్థానిక భాషలలో ఉన్నత విద్యను అభ్యసించడానికి అతిపెద్ద అడ్డంకులలో సాంకేతిక కోర్సులలో నాణ్యతను కలిగిన పాఠ్యపుస్తకాలు అందుబాటులో లేకపోవడం ప్రధాన అంశంగా కనబడుతున్నది.

పాఠశాల స్థాయి నుండి ఉన్నత విద్య స్థాయి వరకు బోధన, పుస్తకాలు ప్రాంతీయ భాషలో అందుబాటులో తేవడం ప్రపంచ వ్యాప్తంగా ఉంది. ప్రపంచంలో పలు దేశాలలో పాఠశాల స్థాయి నుండి కళాశాల స్థాయి వరకు అన్ని రకాల కోర్సులని స్థానిక భాషల్లోనే అందిస్తున్నాయి. జి-20 దేశాలలో చాలా దేశాలు అత్యాధునిక విశ్వవిద్యాలయాలను కలిగి ఉన్నాయి. వీటిలో విద్యార్థులకు వారి ఆధిపత్య భాషలో బోధన అందించబడుతుంది. దక్షిణ కొరియాలో దాదాపు 70 శాతం విశ్వవిద్యాలయాలు కొరియన్‌లో బోధిస్తున్నాయి.. దక్షిణ కొరియా ప్రభుత్వం పాఠశాలలు కొరియన్ భాషలో విద్యార్థుల ప్రావీణ్యం మందగించినందున 2018లో మూడవ తరగతికి ముందు ఇంగ్లీష్ బోధించడాన్ని నిషేధించింది. జపాన్‌లో అత్యధిక విశ్వవిద్యాలయ కార్యక్రమాలు జపనీస్‌లో బోధిస్తున్నారు. చైనాలో విశ్వవిద్యాలయాలు మాండరిన్‌ని బోధనా మాధ్యమంగా ఉపయోగిస్తున్నారు. ఫ్రాన్స్ దేశం బోధనా మాధ్యమంగా 'ఫ్రెంచ్-మాత్రమే' అనే విధానాన్ని అమలు చేస్తున్నారు. జర్మనీ దేశంలో తృతీయ విద్యలో కూడా అన్ని మాస్టర్స్ ప్రోగ్రామ్‌లు 80% కంటే ఎక్కువ జర్మన్ భాషలోనే బోధించబడుతున్నాయి.

**సాంకేతిక విద్యలో బోధన, కోర్సు మెటీరియల్ వంటివి స్థానిక భాషలోనే అందిస్తే విద్యార్థులకు, ప్రత్యేకంగా గ్రామీణ ప్రాంత విద్యార్థులకు నిర్దిష్ట భావనలను బాగా అర్థం చేసుకోవడానికి సులభంగా అర్థమయ్యే అవకాశం ఉంది.** కొంతమంది విద్యార్థులు ఇంగ్లీష్ మాట్లాడే నైపుణ్యాలు, అత్యుత్తమ ప్రతిభను వెలికి తీయడానికి, విదేశీ భాషను అర్థం చేసుకోవడంలో విఫలమైనందున సాంకేతిక నైపుణ్యాలలో ఉన్నత విద్యను అభ్యసించాలనుకునే వారి కోరిక నేరవేరడానికి కూడా ఉపయోగపడుతుంది. సాంకేతిక విద్యలో ప్రాంతీయ భాషలలో బోధన, వ్యక్తులలో నైపుణ్యాన్ని పెంచడంలో సహాయపడుతుంది. సాంకేతిక విద్య ద్వారా ఒక వ్యక్తిని ఉపాధి పొందేలా చేయడం కొంత మేరకు నిరుద్యోగాన్ని నిర్మూలించడంలో సహాయపడుతుంది. ఉదాహరణకు అమెజాన్ లాంటి ఈ-కామర్స్ ప్లాట్‌ఫారమ్‌లో ప్రాంతీయ భాషలను ప్రవేశపెట్టినప్పుడు, డెవలపర్‌చే సృష్టించబడిన ఇ-కామర్స్ సైట్‌లో ప్రాంతీయ భాష ఆదరణీయంగా నడపగలిగినప్పుడు, ఒక వ్యక్తికి ప్రాంతీయ భాషలో అవసరమైన నైపుణ్యాలను అందించడం ద్వారా ఎక్కువ ఆర్డర్స్ చేయగలడు.

నూతన విద్యా విధానం విద్యా వ్యవస్థను విదేశాలలో ఉన్న వ్యవస్థల వలె మరింత సరళంగా, ఓపెన్‌గా మార్చడం ద్వారా కొన్ని మార్పులని చేసింది. అదనంగా సాంకేతిక విద్యను సాధారణ ఉన్నత విద్యా పాఠ్యాంశాలతో విలీనం చేయడం ద్వారా ప్రయోగాత్మక అనుభవాన్ని పొందడానికి ఈ ప్రోగ్రామింగ్ భాషలను ఎప్పుడు, ఎక్కడ, ఎలా ఉపయోగించవచ్చో అర్థం చేసుకోవడంలో సహాయపడే కోర్సును రూపొందించడానికి ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వబడింది. ఇవి స్వయంచాలక వాతావరణాన్ని నిర్మించడానికి ఈ సాంకేతిక యుగంలో విద్యార్థులు వారి ఆసక్తి గల రంగంలో తమ కెరీర్‌ను నిర్మించుకోవడంలో సహాయపడతాయి. 2021వ సంవత్సరంలో నూతన విద్యా విధానానికి అనుగుణంగా దేశంలోని 14 ఇంజినీరింగ్ కాలేజీలు ప్రాంతీయ భాషల్లో బోధించేందుకు ముందుకొచ్చాయి. 14 ఇన్‌స్టిట్యూట్‌లలో దాదాపు సగం కాలేజీలు హిందీలో టెక్నికల్ కోర్సులను అందిస్తున్నారు. వాటిలో ఉత్తరప్రదేశ్ నుంచి నాలుగు, రాజస్థాన్ నుంచి రెండు, ఉత్తరాఖండ్ నుంచి ఒకటి, మధ్యప్రదేశ్ నుంచి ఒకటి ఉన్నాయి. ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర, పశ్చిమ బెంగాల్, తమిళనాడులో తెలుగు, మరాఠీ, బెంగాలీ, తమిళంలో కోర్సులను అందిస్తున్నాయి. సమర్థవంతమైన బోధనను పెంపొందించడానికి వీలైనంత వరకు మాతృభాషలో ఇంజనీరింగ్ కోర్సులను అందించాలని ఆల్ ఇండియా కౌన్సిల్ ఫర్ టెక్నికల్ ఎడ్యుకేషన్ (AICTE) నిర్ణయించింది. ఆ తర్వాత 20 పైగా

కాలేజీలు ప్రాంతీయ భాషలో సాంకేతిక విద్యను అందించటానికి ముందుకు వచ్చాయి. ఈ విధానం సమాజంలోని అట్టడుగు వర్గాలకు మరింత ఉపయోగకరంగా ఉంటుందని, వారికి మెరుగైన ఉపాధి అవకాశాలను అందిస్తుందని, వారిని మరింత స్వావలంబనగా చేస్తుందని భావించింది. 2021 నుండి ఇంజనీరింగ్ కోర్సులు 11 భాషలలో (హిందీ, మరాఠీ, తమిళం, తెలుగు, కన్నడ, గుజరాతీ, మలయాళం, బెంగాలీ, అస్సామీ, పంజాబీ, ఒరియా) అందించబడుతున్నాయి. మొదట్లో ఎంపిక చేసిన ఇంజనీరింగ్ బ్రాంచ్‌లకు AICTE అనుమతిని మంజూరు చేసింది. వాటిలో ఎక్కువ భాగం కంప్యూటర్ సైన్స్ ఇంజనీరింగ్ తర్వాత ఎలక్ట్రికల్ ఇంజనీరింగ్, సివిల్ ఇంజనీరింగ్, మెకానికల్ ఇంజనీరింగ్, ఇన్ఫర్మేషన్ టెక్నాలజీకి సంబంధించినవి ఉన్నాయి. ఐఐటీలు, ఎన్ఐటీలు కూడా ఇదే విధానాన్ని అనుసరిస్తాయని, త్వరలో ప్రాంతీయ భాషల్లో అన్ని సాంకేతిక కోర్సులను కూడా అందజేసాయని ప్రభుత్వం ప్రకటించింది. ప్రస్తుతం ప్రాంతీయ భాషా అధ్యయనాలకు అందుబాటులో ఉన్న కొన్ని సాంకేతిక కోర్సులు కంప్యూటర్ సైన్స్, ఎలక్ట్రానిక్స్ ఇంజనీరింగ్, ఎలక్ట్రికల్ ఇంజనీరింగ్, మెకానికల్, ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ మరియు సివిల్ ఇంజనీరింగ్, ఈ కోర్సులు అధిక సంఖ్యలో ఇంజనీరింగ్ అడ్మిషన్ సీట్లను కలిగి ఉంటాయి. కాబట్టి వాటిని ప్రాంతీయ భాషల్లో అందుబాటులో ఉంచడం వల్ల భారతదేశంలో ఇంజనీరింగ్‌కి మరింత జనాదరణ కలుగుతుంది. అలాగే వివిధ విద్యా నేపథ్యాల నుండి వచ్చిన విద్యార్థులందరికీ సమాన అవకాశాన్ని అందిస్తుంది. 2022లో మధ్యప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం MBBS మొదటి సంవత్సరానికి సంబంధించిన మూడు పుస్తకాలని హిందీలో అనువదించారు.

ప్రాంతీయ భాషల్లో సాంకేతిక కోర్సుల బోధన ఆశించిన ఫలితాలు రావొచ్చుని భావన కల్గవచ్చు. అయితే, ఈ రోజు మనం జీవిస్తున్న నేటి యుగం మారింది, అలాగే మన ఆసక్తులు. అందుబాటులో ఉన్న వనరులు కూడా మారాయి. కాబట్టి విద్యార్థులు ఇకపై అదే పాత డిప్లొమా కోర్సులు లేదా కొన్ని యాదృచ్ఛిక వృత్తిపరమైన కోర్సులను ఎంచుకోవడానికి ఇష్టపడకపోవచ్చు. కానీ ప్రత్యేకతలను కలిగిన సాంకేతిక కోర్సులు ఆ రంగాలలో వృత్తిని సంపాదించడానికి దోహదపడవచ్చు. గ్రామీణ ప్రాంతాల్లో కూడా విస్తృతమైన కెరీర్ అవకాశాల గురించి అవగాహన వ్యాప్తి చెందుతోంది. కాబట్టి దానిని జోడిస్తూ, నూతన విద్యా విధానం ఇప్పుడు భాషని ఏ విధంగానూ అడ్డంకిగా ఉండనివ్వకుండా ఈ సమస్యను పరిష్కరించడానికి సహాయం చేస్తుంది. నాన్-ఇంగ్లీష్ మీడియం నేపథ్యాల నుండి వచ్చిన విద్యార్థులు ఇప్పుడు వారు కోరుకునే ఏ కోర్సునైనా రెండవ ఆలోచన లేకుండా కొనసాగించడంలో వారి సామర్థ్యం గురించి ఎలాంటి భయం లేకుండా ఎన్నుకోవచ్చు.

ముగింపు: మాతృభాషలో బోధనపై ఒత్తిడి తీసుకురావడం సరియైనది కాదు. కానీ ఒకరు వీలైనన్ని ఎక్కువ భాషలను నేర్చుకోవాలి, కానీ దానికి అవసరమైనది బలమైన పునాది మాతృ భాష మాత్రమే. **నేటి సాంకేతిక యుగంలో ప్రజలు, ముఖ్యంగా విద్యార్థులు ఎప్పుడు 'మాతృభాష వర్సెస్ ఇంగ్లీష్' అనే భావన కంటే 'మాతృభాష ప్లస్ ఇంగ్లీష్' విధానం అనుసరిస్తే సాంకేతిక భాషల్లో స్థానిక భాషా ప్రభావం ఉంటుంది.** మనం ఒక భాషను నిర్లక్ష్యం చేస్తే, అమూల్యమైన జ్ఞానాన్ని కోల్పోయే అవకాశం ఉంది. కాబట్టి తమ మాతృభాషలో వృత్తిపరమైన కోర్సులను అభ్యసించాలని ఆసక్తి విద్యార్థుల్లో తీసుకురావాలి. ప్రైవేట్ విశ్వవిద్యాలయాలు కూడా తప్పనిసరిగా కొన్ని ద్విభాషా కోర్సులను ప్రారంభించడానికి ప్రభుత్వంతో చేతులు కలపాలి. AICTE మరియు IIT మద్రాస్ ఎనిమిది ప్రాంతీయ భాషలలో స్వయం కోర్సులను (ఆన్లైన్ కోర్సులు) అనువదించడానికి సహకరించాయి. ఇది ఇంజనీరింగ్ విద్యార్థులకు ఒక పెద్ద ప్రోత్సాహకరం. ఉన్నత విద్యను ప్రజాస్వామ్యీకరించడానికి ఇలాంటి సాంకేతికతతో కూడిన మరిన్ని కార్యక్రమాలు అవసరం. ప్రాంతీయ భాషల్లో సాంకేతిక కోర్సులు అభ్యసించాలని విద్యార్థులకు ఉన్నా - సరియైన ఉపాధి, ఉద్యోగ అవకాశాలు రావనే భావనతో చాలా మంది విద్యార్థులు ఆసక్తి చూపించటం లేదు. కానీ సరియైన మెటీరియల్ అందుబాటులోకి తెచ్చి, ప్రాంతీయ అవసరాలను బట్టి పరిశ్రమలను నెలకొల్పి, గ్రామీణ, స్థానిక మార్కెట్ అవసరాలను దృష్టిలో పెట్టుకొని ప్రాంతీయ భాషలో సాంకేతిక విద్య అభ్యసించిన వారికి ప్రత్యేకంగా శిక్షణ ఇచ్చి, ఉపాధి అవకాశాలు కల్పిస్తే ప్రాంతీయ భాషలో సాంకేతిక విద్యా ప్రవేశాల నమోదు పెరుగుతుంది, రాష్ట్ర ప్రభుత్వాలు కూడా ఇందుకు కావాల్సిన చర్యలు తీసుకుంటే సత్ఫలితాలు వస్తాయి.

---

వ్యాస రచయిత- అకడమిక్ కౌన్సిలర్, డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ ఓపెన్ యూనివర్సిటీ, యూనివర్సిటీ ఆర్ట్స్ అండ్ సైన్స్ కళాశాల, హనుమకొండ

---

**26వ పుట తరువాయి**

సాహిత్యాలకు చెందిన సేవ పంటగా పుష్కలంగా పండింది. చివరి దాకా అలసటలేని బాటసారిగా వారి రచనావ్యాసంగం సాగించారు. **శ్రీహరి గారి గురించి వారు గురువుగారు, మా ఇద్దరికీ గురువుగారు, సుప్రసిద్ధ సంస్కృతాంధ్ర పండితులు ఆచార్య బిరుదు రాజు రామరాజుగారు అన్నమాటని ఇక్కడ ఒకసారి గుర్తుకు తెచ్చుకోవాలి. శ్రీహరి నాకన్నా గొప్ప పండితుడు. ఋషి తుల్యులైన రామరాజుగారి మాట శ్రీహరి గారి పాండిత్యానికి మంచి బిరుదుగద్య.** ఇలా సమాజానికి ఉపయోగపడే బుద్ధిజీవులు కలకాలం జీవిస్తే జాతి మూడు పూవులు ఆరు కాయలుగా వికసిస్తుంది. మనిషి ఆశాజీవి అలా ఉంటే బాగుంటుంది అని అనుకుంటాము. కాని లోకంలోనికి ప్రవేశించడం ఎంత నిజమో, విడిచివెళ్ళడం కూడా అంతే నిజం. మధ్యకాలంలో ఏం చేసి జాతికి ఏది అందించారు అనే దానిపైన మనిషి చిరకాలం జీవిస్తాడు. శ్రీహరి గారి స్ఫూర్తి చిరకాలం కొనసాగేలా శాస్త్రస్ఫూర్తి వచ్చేతరాలకు అందించేలా వారి స్మరణను కొనసాగించే పనిని చేయడం మనందరి ధర్మం, బాధ్యత.

---

- ఆచార్య పులికొండ సుబ్బాచారి, ద్రావిడ విశ్వవిద్యాలయం పూర్వ ఆచార్యులు, ప్రముఖ రచయిత

అమ్మభాష

సడ్లపల్లె చిదంబరరెడ్డి
9440073636

# స్థానిక పదజాలమే అమ్మభాష!

శ్వాస తీసుకొన్నట్లు అసంకల్పితంగా పెదవుల నుండి దాటి వచ్చేది అమ్మ భాష! ఆ భాషలో చదవడం రాయడం వస్తే ఇతర విషయాలూ భాషలూ మనిషికి వొంటబట్టడం పెద్ద సమస్యకాదు.

మన మాతృభాష తెలుగే! అందులో సందేహం ఏ మాత్రం లేదు!! అయితే ఆ తెలుగులో చేరుకొన్న సంస్కృత, ఇతర ప్రాంతీయ పదాలే ప్రాథమిక దశలో పిల్లలను నానా ఇబ్బందులకు గురిచేస్తున్నాయి.

నేను చాన్నాళ్లుగా నా ఉండూరి భాషలో(స్థానిక పదజాలంతో) రచనలు చేస్తూ, ఇతరులు రాసిన వాటికి కూడా అదే భాషలో స్పందిస్తూ ఉంటే.... అందరూ నన్నే పురాభావాల పుట్ట అని,మార్పును కోరని మనువాదుల మందలోని జీవి అని అనుకోవడం... నాతో వాదించడమూ జరిగింది.వారికి అసలు విషయాన్ని చెప్పడానికే ఈ ప్రయత్నం.

నా వయస్సు 73. నేను గత 40 సంవత్సరాలపాటు 50 యేళ్ల వయోజనుల నుండి ఐదు సంవత్సరాల గ్రామీణ పిల్లలు, మూడు సంవత్సరాలు పైబడ్డ ఆంగ్ల మాధ్యమ పిల్లలు,కన్నడం మాతృభాషగా కలిగి బలవంతంగా తెలుగు నేర్చుకొంటున్న ఉన్నత పాఠశాల విద్యార్థులకు చదువులు నేర్పిస్తూ...నేను చిన్నప్పుడు చదివిన సమయంలో పడిన ఇబ్బందులనూ గుర్తుంచుకొని.. ఆ పరిధుల్లో చెప్పడానికి ప్రయత్నిస్తాను.

పిల్లలకు విషయ బోధన కనీసం పదవ తరగతిదాకా వారి స్థానిక పదజాలం తోనే ఉండాలి (దానినే మాండలికం, గ్రామీణం, పల్లెటూరి భాష, ఉండూరి భాష...ఇలా రక రకాల పేర్లతో పిలుస్తారు) అలా ఉన్నప్పుడు వారు విషయగ్రాహకానికి పదాలను కంఠస్తం చేయకుండా సహజ పదాలుగా గుర్తుంచుకొనే అవకాశం ఉంది.

అట్లని ప్రతి మండలానికీ ఒక్కో పాఠ్య పుస్తకం ముద్రించడం సాధ్యమా? పిల్లలని ఇతర ప్రాంత తెలుగు పదాలకు దూరం చేయడం మంచిది కాదు కదా?అని మీరు అడగవచ్చు!

అన్ని ప్రత్యేక పుస్తకాలు అక్కర లేదు. ఏదో ఒక ప్రాంతం విద్యాధికుడు అతనికి తెలిసిన పదజాలంతో పుస్తకం రాస్తాడు. అది అతనికి తప్పదు. రాయనీయండి.

అతడు రాసిన పుస్తకంలో (1)బర్రె (2)ఆంబోతు (3)పొట్టోడు (4)గడుసరి (5)బాబాయి (6)కొండచిలువ (7)నాగలి (8)రాబందు (9)పాతిక (10)పెందలకడనే (11)మేష్టారు (12)మాపటేల (13)మోటార్ బైకు (14)అలుగు పారు (15)చీనీ కాయ (16)బొప్పాయ (17)చోళ్లు (18)ఉల్లి పాయలు (19)అటక (20)సీతాకోక చిలుక.... మొదలైన పదాలు ఉన్నాయి అనుకొందాము.

పై పదాలను ఏ ప్రాంతంలో ఎలా పిలుస్తారో ఆ పదాల్ని తెలుసుకొని ఆ పదాలతోనే బోధించాలి. పిల్లలు రాసిన ప్రాంతీయ పదాలలో అక్షరదోషాలుంటే సవరించాలి. కానీ, వారు రాసిన పదాలను గౌరవించి మార్కులు వేయాలి. **రచయిత పుస్తకాల్లో ప్రయోగించిన పదమే ఉండాలని బలవంతంగా వారి నెత్తిన రుద్దడమే ఇక్కడ తెలుగు భాషలో వచ్చిన చిక్కంతా!**

పైన ఉదహరించిన పదాలను నేను నా సొంత ఊరి(మండలం అనికూడా అనవచ్చు) పదాలుగా మారిస్తే (1)ఎనుము (2)కుర్ర (3)పొట్టోడు (4)గట్టోడు (5)చిన్నాన్న (6)దాసరి పాము (7)మడక (8)కాలు బాగం (9)పీతిరి పంత (10)పొద్దున్నే (11) అయ్యవారు (12)పొద్దు పడి/సాయంత్రం (13)కుటు కుటు మోటార్ (14)మరువ పారు (15)తిత్తుల కాయ (16)పరంగి కాయ (17)రాగులు (18)యర్ర గడ్డలు (19)అట్టువ (20)ముత్యలమ్మ పురుగు ....

ఈ విధంగా పదో తరగతిదాకా అయినా బోధిస్తే, కనీసం విద్యార్థులకు తెలుగులో తప్పులు లేకుండా చదవడం వచ్చే అవకాశం ఉంది.

మీరంతా పదో తరగతి మార్కుల శాతాన్ని చూసి మోసపోతున్నారు. అక్కడ 100% వచ్చిందంటే 30% కిందే లెక్క!! మిగిలినదంతా టార్గెట్ కోసం చెప్పించిన 20 మార్కుల బిట్లూ...పరీక్ష పేపర్లు దిద్దినప్పుడు 25/30 వస్తే, ఫెయిలు చేస్తే మాత్రం ఏమి చదివి ఏడుస్తాడని అక్కడొకటి, ఇక్కడొకటి ఇరికించి 35 మార్కులకు జుట్టుపట్టి లాగుతాము!!

**10 పాసయిన వారిలో సగం మందికి తమ పేర్లను తప్పులు లేకుండా రాయలేక పోతున్నారని చెప్పడానికి సిగ్గుపడుతున్నాను.**

8 సంవత్సరాలకు ముందు బియ్యే పాసయి, బి ఈ డీ ముగిస్తూ అందులో భాగంగా శిక్షణ కోసం విద్యార్థులకు పాఠం బోధించడానికి నేను పని చేస్తున్న బడికి కొందరు వచ్చారు. (ఆ పని జిల్లా విద్యా యంత్రాంగం చేస్తుంది)

ఎదురుగా కూర్చొంటే జంకుతో ఇబ్బంది పడతారని, తరగతికి పరిచయం చేసి బయటికి పోయాను. పిరియడ్ ప్లాను చూస్తే అక్షరదోషం లేకుండా ఒక్క వాక్యం కూడా లేకపోవడం గమనించి, గతంలో నేను రాసింది ఇచ్చి దాన్ని అలాగే రాసి ఇవ్వమన్నాను.చూచిరాతలో కూడ వంద తప్పులు.(నా దృష్టిలో భాష ఉన్నది- విషయ పరిజ్ఞానాన్ని బండ్ల కెత్తి వంకలో తోసేద్దాం- తప్పులు లేకుండా రాయడం చదవడానికే) దానికి టిక్కులు కొట్టి సంతకం చేయడం నా చేత కాలేదు! చివరికి అక్కడ నాతో పాటూ పనిచేసే గ్రేడ్ II తెలుగు ఉపాధ్యాయునికిచ్చి ఆ తతంగ మేదో ముగించమన్నాను.

వీరు ఉపాధ్యాయులై ఏ భాషను బోధిస్తారు!

ప్రభుత్వమైతే అందరూ బడిలో చేరాలి.అందరూ కనీసం పది పాసు కావాలి! అనే నినాదాలైతే చేస్తుంది. నిజంగా అందరూ అక్షరాస్యులు కావాలంటే, నా అనుభవంతో...

సొంత ఊరి పదజాలంతో తప్పులు లేకుండా చదవడం రాయడం

**తరువాయి 36వ పుటలో**

శతకాలు

గాడి సత్తిబాబు
9492188047

# కోనసీమ శతకాలు - గ్రామ దేవతల వైశిష్ట్యం

కోనసీమ పేరు వింటేనే పచ్చని పసిడి సీమగా, కోటి అందాల సీమగా గుర్తుకువస్తుంది. పాడిపంటలతో ప్రకృతి అందాలతో శతాబ్దాల చరిత్రగల ఆరామాలతో, ఆలయాలతో, పౌరాణిక నేపథ్యం గల ఇతిహాసాలతో విరాజిల్లుతూ జైన,బౌద్ధ,క్రైస్తవ, హిందు, మహమ్మదీయుల దేవాలయాలతో భిన్నత్వంలో ఏకత్వాన్ని సాధించి ఆదర్శంగా నిలిచిన సామరస్య సీమగా, కవులతో, కళాకారులతో అలరారే అందాల కవనసీమగా, కళాసీమగా పేరొందింది కోనసీమ. ఈ సీమలో సాహితీ సంపద పుష్కలంగా లభిస్తుంది. విశిష్ట కవులతోపాటు, ఆధునిక వర్తమాన కవులతో, విభిన్నమైన రచనలతో విలసిల్లుతోంది కోనసీమ.

కోనసీమలో ఉన్న ఆధునిక శతకవులలో ముఖ్యంగా చెప్పుకోదగినవారు గుంటు వీరభద్రకవి, సవేరా, నూజిళ్ళ లక్ష్మీనరసింహం, రేకపల్లి శ్రీనివాసమూర్తి, పచ్చిమాల శివనాగరాజు, డా.గూటం స్వామి, మంగళంపల్లి పాండురంగ విట్టల్, గౌరి మల్లిక్ మొదలైన వారు. వీరు వ్రాసిన గ్రామ దేవతల్లో విశిష్టతను, ఇతిహాసాలతో వెలసిన నేపథ్యాన్ని, ప్రజల్లో ప్రచారంలో ఉన్న జన ఐతిహ్యాలను, సాహిత్యంలో వాటి స్థానం, స్థల మహాత్మ్యం వంటి విశేషాలను పరిచయం చేయడమే ఈ వ్యాసం యొక్క ముఖ్యోద్దేశ్యం.

**గ్రామదేవతలు - విశిష్ఠత :**

గ్రామ దేవతలు ఇలవేల్పులుగా, గ్రామ రక్షకులుగా భావించి గ్రామీణులు మొక్కులు మొక్కుకోవడం తీర్చడం, పూజా పునస్కారాలు చేయడం, బలులు అర్పించడం, నైవేద్యం పెట్టడం, ప్రసాదం పంచడం, తలనీలాలు ఇవ్వడం, బట్టలు సమర్పించడం, దినాలు చేయడం, భోజనాలు పెట్టడం, తీర్థాలు తిరునాళ్ళు చేయడం, జాతర్లు జరపడం ఆయా సందర్భంలో పిల్ల పాపలతో ఇంటిల్లపాది పాల్గొనడం, కొత్తబట్టలు కొనుక్కోవడం, బంధువులను పిలవడం ఇవన్నీ గ్రామీణ సంస్కృతి సంప్రదాయాల్లో చెప్పుకోదగ్గవి. గ్రామ దేవతలు లేకుండా ఏ గ్రామం కనబడదు. రూపం లేకపోయినా ప్రకృతిలో కనిపించే చెట్టు, పుట్ట, చెరువు, రాయి, రప్ప వంటివి గ్రామ దేవతలుగా కనిపిస్తాయి. **ఇది విచిత్రంగా ఉన్నా, గ్రామీణులు ప్రకృతిని ఎంత ప్రేమించి దైవంగా మొక్కుతారో పర్యావరణాన్ని ఎలా ప్రేమిస్తారో గుర్తుంచుకోవచ్చు. అందుకే శతకకవులు వస్తువుగా స్వీకరించి శతకాలలో రాశారు.**

కోనసీమలో వెలసిన దేవతలు :

ప్రకృతిలో కనిపించే చెట్టును దైవంగా మొక్కే సంప్రదాయం నేటకీ కనిపిస్తుంది. అందులో చెప్పుకోదగినవి కోనసీమ జిల్లాలో, కొత్తపేట మండలంలో బోడుపాలెం దగ్గర పెద్దమర్రి ఉంది, ఆ మర్రి ధనమ్మమర్రిగా పూజలందుకుంటుంది. 3,4 ఎకరాల్లో విస్తరించిన మర్రి ధనమ్మగా వెలసింది. ఆనవాయితీగా గ్రామీణ ఆచారంగా నేటికి ఆ మర్రిని ఆడబడుచుగా, కాపుల ఆడపడుచుగా ధనమ్మ వెలసింది అని జన ఐతిహ్యాలు చాలా ప్రచారంలో ఉన్నాయి. అలాగే వానపల్లిలో వెలసిన పళ్ళాలమ్మ కేవలం ఒక కాలువపక్కన ఏరూపం లేని రాయి. పల్లాలమ్మగా పూజలందుకుంటుంది, నేటికీ విశేషస్థానం పొందినదిగా కనిపిస్తుంది. అక్కడ మూడు నెలలపాటు తీర్థం జరగడం విశేషం. ఆమెను వానపల్లిలో వెలసింది కాబట్టి వానపల్లి పళ్లాలమ్మగా, గ్రామ ప్రజలకు ఇలవేల్పుగా, గ్రామ దేవతగా పూజలందుకుంది. ఈమెకూడా కాపుల ఆడపడుచుగా కొనియాడటం విశేషం. అయినవెల్లి మండలంలో నేదురూరులో వెలసిన శతాబ్దాల చరిత్రగల గ్రామ దేవత దుర్గమ్మ, చాకలి వారి ఆడపడుచుగా పేరు పొందిన ఈమె చాకలి చెరువు జమ్మిచెట్టు దగ్గర, వెలసిన కారణంగా దుర్గమ్మ జమ్మిచెట్టు అని పేరు పొందింది. పూజలు అందుకుంటుంది. బెల్లంపూడిలో ఉన్న కట్లమ్మ తల్లి కాపుల ఆడపడుచుగా పూజలందుకుంటుంది. బెల్లం వ్యాపారం చేస్తున్న కారణంగా ఒకరోజు కలలో కనిపించి బెల్లం కట్టలలో ఉన్నాను నన్ను వెలికితీసి పూజించండి అని పెదకాపుకి చెప్పగా, అదే విధంగా బెల్లం కట్లలో దొరికింది కాబట్టి ఆమె "కట్లమ్మతల్లి" అయ్యింది. నేదునూరు పెదపేటలో 4 వీధులకు మధ్యలో ఉన్న తాడిచెట్టు ముత్యాలమ్మ తాడిచెట్టుగా, ముత్యాలమ్మ తల్లిగా పూజలందుకుంటుంది. ప్రతీ సంవత్సరం ఉత్సవ ఊరేగింపులు జరుగుతాయి. రాజోలులో ఉన్న పుంతలో ముసలమ్మ కుంతలేశ్వరిగా పూజలందుకుంటుంది. అమలాపురం మండలంలో రావిగుంట చెరువు గుట్టన ఉన్న రావిచెట్టు రావులమ్మగా పూజలందుకుంటుంది. ఈ విధంగా ఎందరో గ్రామ దేవతలమీద కోనసీమ కవులు, అనేక శతకాలు వ్రాసారు. వాటిలో కొన్ని ప్రధానమైన శతకాలు పరిశీలిస్తే భక్తితత్వం వాటి వైశిష్ట్యం తెలుస్తుంది.

**కోనసీమ భక్తి శతకాలు-వైశిష్ట్యం :**

వానపల్లిలో వెలసిన పళ్ళాలమ్మపై గుంటు వీరభద్ర కవి వ్రాసిన శతకం విశిష్టమైన శతకంగా చెప్పవచ్చు. వారు పళ్లాలమ్మ తల్లిని ఆరాధనా విధానాన్ని, భక్తుల మొక్కులను వివరిస్తూ గ్రామీణుల నమ్మకాలను బలీయంగా అభివర్ణించారు. పళ్లాలమ్మ అనే మకుటంతో వ్రాసిన ఈ శతకంలో ఇష్టదేవతగా ప్రస్తుతిస్తూ

అంభాశాంభవి సుగుణ క
దంబా! నిగమావలంబ! దానవభూభృ
చ్చుంబా! ప్రణతభా
వంబున నిను దలతునమ్మ పళ్ళాలమ్మ ... అంటారు

పళ్లాలమ్మను శాంబవిగా, సుగుణ కదంబంగా, నిగమావలంబగా, ధనగుణ సంపన్నురాలుగా కొలుస్తూ గ్రామీణులు భక్తి భావనను ఆచార సంప్రదాయాల్లో భాగమైన ఇలవేల్పులకి ఇచ్చే పురాతన భక్తి విశిష్టతను వ్యక్తీకరించారు.

భక్తులు ఏవిధంగా ముడుపులు చెల్లిస్తారో, పళ్లాలమ్మ

ఏవిధంగాకోర్కెలు తీరుస్తుందో, అభయంగా ఏవిధంగా నిలుస్తుందో వివరిస్తూ గ్రామీణుల భక్తితత్వాన్ని, మనస్తత్వాన్ని కవిత్వీకరిస్తారు. వాటిలో భక్తుల చిత్త వృత్తిని, మనసులో దాచుకున్న విషయాలను అమ్మవారి ముందు ఆవిష్కరించిన విధానాన్ని వీరభద్రకవి ఎంతో నిశితంగా పరిశీలించినట్లు అనుభవంతో కొన్ని, అనుభూతులతో కొన్ని, విన్నవి కొన్ని, కన్నవి కొన్ని వివరిస్తూ

ముడుపం గట్టిన యంతన
చిడుముడి జడు లంతరింపచేయు దానమ్మా
గుడిలో నీసత్తెంబగ
బడజేసియు! వానపల్లి పళ్ళలమ్మ... అంటూ

ముడుపులు కట్టినంతలోనే చిడుముడి జడులు లాంటివి, కష్టాలు, నష్టాలు, ఒడిదుడుకులు వంటివి మాయమైపోతాయని అంటారు. గడిలోనే అనే పదాన్ని ప్రయోగించడంవల్ల భక్తులు కోరిన గడియల్లోనే కష్టాలన్నీ తొలిగిపోయి సుఖ శాంతులు కలుగుతాయని, పళ్లాలమ్మ మాహాత్మ్యన్ని ఆమె చేసే అద్భుతాలను వరాల జల్లుగా ఇచ్చే అనేక మేలులను వివరించారు. పల్లాలమ్మ సత్తెముగల తల్లి అంటారు. ఇదే నమ్మకం నేటికి కనబడుతుంది.

సత్తెముగ తల్లి నీవనె
ముత్తెదులు మగులు గూడి మ్రొక్కిన నీకున్
బత్తిగల యెదదలన్ సం
పత్తులుగాన వానపల్లి పళ్ళాలమ్మ... అంటారు

వీరభద్రకవి పల్లాలమ్మను సత్తెము గల తల్లియని, నేటికి గ్రామ ప్రజలు నమ్మకం. అందుకే కోరుకొనిన మ్రొక్కులను తప్పక తీరుస్తారు. ముత్తైదువులు అందరు వచ్చి మొక్కులు తీర్చుకుంటారని ఒక ఆచరణగా తెలియజేసారు. ఇప్పటికి ముత్తైదువులు అందరూ కలిసి పసుపు, కుంకాలు, తిలకం, గాజులు, పళ్ళు, కొత్తచీర, రవిక, పట్టుకొని వెళతారు. భక్తితో ఆరాధించి మొక్కులు చెల్లించి దీవెనలు పొందుతారు.

**కాంచన దుర్గ వైశిష్ట్యం :**

పచ్చిమాల శివనాగరాజు గారు తన ఆరాధ్య దైవం గాను, ఇలవేల్పుగాను కొలిచిన ఇష్టదేవత కాంచన దుర్గమ్మ. ముమ్మిడివరంలో వెలసి కనకదుర్గను భక్తితో మొక్కుతూ ఒకప్పుడు జీవితాన్ని తలచుకుని తనకు తానే నిందించుకుంటూ నేను నాస్తికునిగా ఉండి, నిన్ను దూషించానని, నేనొక బండలాగ మారిన నన్ను ఒక కవిగా, కళా తపస్విగా; కళాకారునిగా, తెనాలి రామలింగడికి ఏవిధంగా కవిత్వాన్ని సంపదగా ఇచ్చిందో నాకు అలాగే ఇచ్చిందని కృతజ్ఞత తెలియజేస్తూ దుర్గా వైశిష్ట్యాన్ని వివరిస్తూ

అమ్మా అని పిలవగా
సమ్మోదము నిండి మమ్ము సాకెడి జననీ
అమ్మవు నాన్నవై లో
కమ్ముల పాలింతు నీవు కాంచన దుర్గ... అంటారు

అమ్మవు నీవు, నాన్నవు నీవే మమ్ములని సాకెడి జననీ నీవే, సకల లోకములకు అమ్మవు నీవే అంటూ ప్రస్తుతించారు. సకల దేవతలకు నీవే అమ్మవై ముగ్గురమ్మల మూలపుటమ్మ కదా నీవు, నీవు లేకుండా జగతిలేదు, నీవు లేకుండా ఏ ప్రాణి జీవించలేదు, దుష్టశిక్షణకు నీవే కదమ్మా శాంభవి, లోకబాంధవి, అంటూ పచ్చిమాల శివనాగరాజు దుర్గ విశిష్టతను కవిత్వాన్ని కవిత్వీకరిస్తూ తల్లిగా, చెల్లిగా, సుతగా, ఎల్లపుడు కాపాడే జననిగా, కల్లోలాలను తొలగించి ఆనందాలను హరివిల్లులను జల్లుగా కురిపించే కనకదుర్గవు, కాంచన తేజస్సుతో కోర్కెలు తీర్చే తల్లివి అంటూ

మహిషాసుర మర్దనీ! నీ
మహిమలు తెలియంగ లేక మంధుడనైతిన్
అహమును తొలగింపుము నా
గ్రహములు కరుణింపజేయు కాంచన దుర్గ!

అంటూ నాలో ఉన్న అహాన్ని తొలగించమని, ఆగ్రహము చూపకుండ అనుగ్రహింపమని, పశ్చాత్తాపముతో వేడుకుంటాడు. ఒక భక్తునిగా పచ్చిమాల శివనాగరాజు వేడుకోవడం విశేషం. మహిషాసుర మర్ధనీ నీ మహిమలు తెలుసుకోలేక మంధుడనయ్యానని నివేదనను చెప్పి తప్పును సరిదిద్దుకొనడం, దుర్గదగ్గర విమోచన కోసం వేడుకోవడం ఇవన్నీ భక్తులు చేసేసహజమైన విన్నపాలను, తన జీవితంలో జరిగిన కొన్ని సంఘటనలను గుర్తుచేసారు శివనాగరాజు. మట్టిని గంపలో ఎత్తిన శ్రమజీవితాన్ని, పడిన శ్రమను గుర్తు చేసుకొని శ్రమను తొలిగించే వరాల తల్లిగా మొక్కుతారు. మరొక శతకం ఐశ్వర్యంబిక శతకం కామాక్షి శతకం చెప్పుకోదగ్గది.

**అమ్మ ఐశ్వర్యంబిక తల్లి వైశిష్ట్యము :**

కోనసీమలో పేరు పొందిన సాహితీ వేత్త, సంగీత విజ్ఞాన కోవిదుడైన రేకపల్లి శ్రీనివాస మూర్తిగారు ఒకరు. వీరు అటు సంగీతం, ఇటు సాహిత్యంలోని ఉత్తమమైన పండితునిగా పేరు పొందారు. కోనసీమ శతక కవుల్లో ఎక్కువ శతకాలు రాసింది వీరే. అందులోను వినూత్నంగా మాత్రా ఛందస్సులో శతకరచన చేసి ఎంతోమందికి మార్గదర్శకులయ్యారు. వీరు వ్రాసిన శతకాల్లో భక్తి శతకాలే ఎక్కువ. అందులోని వీరి ఇలవేల్పు పైనే కాకుండా కోనసీమలో వెలసిన దేవతలు, దేవుళ్ళమీద అపారమైన భక్తితో శతకాలు వ్రాసారు. వాటిలో అమ్మ ఐశ్వర్యాంబిక శతకం సుప్రసిద్ధమైంది. ఐశ్వర్యాంబికను ప్రస్తుతిస్తూ

అమ్మనీవై అయ్యనీవై అరయ గురువు నీవై
అఖిలప్రాణుల ఆర్తిమాపెడు అమ్మ ఐశ్వర్యాంబిక...

అంటూ నా సమస్తము నీవే, నా జీవిత గమనము నీవే, గమ్యము నీవే, నీవుతప్ప ఎవరున్నారమ్మ ఐశ్వర్యాంబిక అంటూ హృదయాన్ని ఆవిష్కరిస్తారు రేకపల్లి. భక్తుల బాధలు వినవా అంటూ నా వేదన నీ పాదాల చెంతకు చేరలేదా, నన్ను బ్రోవ రావమ్మా, నీకు కరుణ లేదా, నాపై జాలి లేదా, కంటినే కామాక్షి, కంటినే మీనాక్షి అమ్మా ఐశ్వర్యాంబిక కరుణజూపవే, కనికరించవా, కన్నతల్లి మిన్నకుండిన కన్నబిడ్డ కలతపడదా అమ్మా నన్ను రక్షింపవా అంటూ ఆవేదన వ్యక్తంచేస్తూ

కలము కదలదు, తలపు నిలువదు
కవితమెరయదు, కనుల పండదు
కలికిరో నిను కవితనింపక అమ్మ ఐశ్వర్యాంబికా...

అంటూ కలం పట్టిననూ ఒక కదలిక లేక నా తలపునిండా నీవే కదా ఉన్నది. కన్నుల ముందు నీవే నాకు కనిపించే దైవం అమ్మ. మా మనుషుల మనసులను శుద్ధిచేయమ్మా అంటూ. కావు కావుమని కాకిలాగా అరచిననూ కావకుంటివి. కరుణలేదా అంటూ విషాద అశృవులతో విలపిస్తాడు. ఒక భక్తునిగా ఐశ్వర్యాంబిక ముందు ప్రణమిల్లి

అజ్ఞానుడై అల్పుడైనను వేల్పులను మన్నించమని వేడుకుంటిని అన్నాడు. భక్తితత్వాన్ని భక్త జన లోకానికి నివేదించుకుంటాడు. భక్తుడు తన విజ్ఞాపనలు దేవుడు వింటాడనే తపన, అందులో భక్తితో కూడిన తపన కనిపిస్తుంది.

**కామాక్షి అమ్మవారి వైశిష్ట్యం :**

అమలాపురంలో వెలసిన అమ్మ కామాక్షమ్మ, కోర్కెలు తీర్చే తల్లిగా, కోనసీమకు కొంగు బంగారమై వెలసింది. అమ్మ కరుణాకటాక్ష వీక్షణాలు అందరిమీద ఉంటాయని నిష్ఠాగరిష్టులు భక్తి శ్రద్ధలతో, హృదయశుద్ధితో త్రికరణ శుద్ధిగా జపించమని, అలా చేస్తే సకల సుఖాలు కలుగుతాయని కామాక్షి విశిష్టతను వివరిస్తూ

అన్నవస్త్రము లిచ్చుదానవు
ఆన్నాహారము నొసగుదానవు
అన్నపూర్ణా! అపర్ణా! ఉమా!
రక్షమాం కామాక్షిరో... అంటూ

అమలాపురంలో కామాక్షి అమ్మవారిపేరిట ఒక పీఠం కూడా ఉన్నది. అక్కడ అనాథపిల్లలు ఎంతో మందిని కామాక్షి అమ్మవారు కరుణతో కాపాడుతారని చెబుతారు. పెద్దలు, పిల్లల పాలిట, పేద పిల్లల పాలిట, తల్లిలేని పిల్లలకు అమ్మవారే తల్లిగా దీవించి కాపాడి రక్షిస్తారు. అందున అమలాపురంలో అమ్మవారికి అత్యంత విశిష్టత ఉందని చెప్పవచ్చు. రేకపల్లి వారు భక్తకోటికి అమ్మవారు కోనసీమలో చాలా చోట్ల చాలా రూపాల్లో ఉన్నారని మాలిని, మహిషాసుర మర్దిని, మానినీ, మాతంగి, వైభవ శాలినీ, శ్యామలాంబ, భార్గవి, అని వేనోళ్ళ పలుకుతారని అమ్మ విశిష్టతను వివరిస్తూ వరాల తల్లిగా భావిస్తూ

భక్తకోటికి క్షణములోనే
ముక్తినిడ ముక్తేశ్వరంబున
ముక్తికాంతగా వెల్గుచుంటివి ...

అంటూ కామాక్షి శక్తి స్వరూపిణిగా, విశ్వమంత నిండిన జననిగా, భక్తుల పాలిట ఇలవేల్పుగా అభివర్ణించారు. కామాక్షి ఇచ్చే వరాలను చక్కగా చమత్కరిస్తూ లోకంలో కనిపించే భక్తుల పాలిట అద్భుతాలు, ఆశ్చరాలను గూర్చి

కన్యకకు తగిన వరుని యిత్తువు
బ్రహ్మచారికి వధువు యిత్తువు
వంధ్యులకు సంతానం యిత్తువు... అంటారు.

అలాగే నేను జపాలు, తపాలు, యజ్ఞాలు, యాగాలు, చెయ్యలేనని, బుద్ధిచాలదు నిన్ను గూర్చి తెలుసుకోవడానికి శక్తి చాలదు. నిన్ను కొలవగ భాషచాలదు, నిన్ను పొగడడం సతతము నీ నామ స్మరణతప్ప ఇంకేమి చెయ్యలేనని వేడుకుంటాడు వినమ్రంగా రేకపల్లి. భక్తుల మనస్తత్వాలను నివేదనను చక్కగా వివరించి నూతన ఉత్సాహాన్ని నింపి సమాజంలో భక్తి భావనకు ఆహ్వానం పలికారు రేకపల్లి.

**ముగింపు :** కోనసీమ శతక సాహిత్యంలో భక్తి శతకాలకు ఒక ప్రత్యేకత ఉంది. వాటిలో దేవతలకు సంబంధించిన శతకాలు, దేవుళ్ళకు సంబంధించిన శతకాలుగా విభజించవచ్చు. వీటిలో చాలావరకు శతక కవులు ఇష్టదేవతలమీద, ఇష్టదైవాల మీద, ఇలవేల్పులమీద, తమ గ్రామాల్లో వెలసిన దేవతలమీద శతకాలు వ్రాసి అటు భక్తి తత్వాన్ని, ఇటు గ్రామ దేవతల కీర్తి ప్రతిష్ఠలను, విశిష్టతలను, స్థల మహత్వ్యాలను, వెలసిన రీతిని, లోకరీతిని, లోకనీతిని భక్తి సంప్రదాయాలను, ఆచార పద్ధతులను, నియమాలను వస్తువుగా స్వీకరించి రచించారు. అందునా కోనసీమ శతకాల్లో అనేక అంశాలు కనిపిస్తున్నాయి. భక్తులతత్వం, లోకంపోకడ, మనుషులపోకడ, కూడా వివరించే ప్రయత్నం చేసారు కోనసీమ శతక కవులని చెప్పవచ్చు. గ్రామ దేవతల విశిష్టతను తెలియజేసి భక్తి భావనను పెంపొందించినారని శతక కవులను గుర్తించవచ్చు. రేపటితరం మరచిపోతున్న ప్రాచీన వారసత్వ సంపదగా వస్తున్న భక్తి భావనతో కూడిన భక్తి తత్వాన్ని, ఆచార సంప్రదాయాలను, పూజా విధానాన్ని, పద్ధతులను గూర్చి చాలా రచనలు రావలసివుంది. వాటిపై అధ్యయనం చేసే ఆలోచన కలిగించారు కోనసీమ శతక కవులని చెప్పవచ్చు.

రచయిత- ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం,
గుంటూరు, పరిశోధక విద్యార్థి

**33వ పుట తరువాయి....**

ఐదో తరగతి దాకా ఇతర సబ్జెక్టులను గాలికి వదిలేసి వారి సొంత ఊరి పదజాలంతో తప్పులు లేకుండా చదవడం రాయడం నేర్పిస్తే చాలు. పదేళ్లు దాటాక వారిలో నేర్చుకోవాలనే తపన, కుతూహలం పెరిగితే సైన్సూ, గణితమూ,ఇతర భాషలూ, కళలూ వారి వారి శక్తిని, అభిరుచిని బట్టీ ఒకటి రెండేళ్లలో నేర్చుకోగలరు!!

**ఈ మౌలికమైన సూక్ష్మాన్ని గమనించకుండా కొందరు"ధనవంతులేనా! ఆంగ్ల పాఠశాలల్లో చదివి, అమెరికాకు వెళ్లి డాలర్లు సంపాదన చేసేది? వెనుకబడ్డవారు ప్రభుత్వ పాఠశాలల్లో తెలుగు చదివి ఇంకా వెనుకబడి పోవాల్సిందేనా! కాబట్టి మా పిల్లలకోసం ఒకటో తరగతి నుంచీ ఆంగ్ల మాధ్యమం ఉండాల్సిందే" అని వాదన చేస్తున్నారు.**

**అట్టి వారికి నేను చెప్పేది ఒక్కటే!! నేను పని చేస్తున్నప్పుడు ప్రభుత్వం ఆరవ తరగతి నుంచీ ఆంగ్ల మాధ్యమం ప్రవేశపెడితే ప్రతి తరగతిలో సగం మందికి పైగా ఆంగ్లానికి మారారు. వారు పదికి వచ్చేసరికి అటు ఇంగ్లీషు,ఇటు తెలుగూ రాక ఎంత పరిజ్ఞానాన్నీ, జీవితాన్నీ పోగొట్టుకొన్నారో ఎలా చెప్పను!**

కాబట్టి మాతృభాష అంటే తెలుగే కానీ, సంస్కృత పండితులు, మాబోటి తెలుగు పండితులు గ్రంథాల్లో నేర్చినది మాత్రం కాదని మరోసారి మనవి చేస్తూ.... **శ్వాస తీసుకొన్నట్లు అసంకల్పితంగా పెదవుల నుండి దాటి వచ్చేది అమ్మ భాష! ఆ భాషలో చదవడం రాయడం వస్తే ఇతర విషయాలూ భాషలూ మనిషికి వొంటబట్టడం పెద్ద సమస్య కాదు.** అ

- ప్రజల భాషలోనే పరిపాలన సాగాలి
- ముఖ్యమంత్రి, ముఖ్యకార్యదర్శి కార్యాలయాల నుండే పూర్తిగా తెలుగులో పరిపాలన సాగాలి

సంస్కృతి

రాగ్యానాయక్ ఆడావతు
9133220230

# బంజారా యువతుల పండుగ తీజ్

తీజ్ పండుగనే మొలకల పండుగ అంటారు. మొలకెత్తిన గోధుమ నారునే తీజ్ అని అంటారు. తీజ్ పండుగ ఆడ పిల్లల పండుగ. పెళ్ళికాని ఆడపిల్లలే దీన్ని జరుపుకుంటారు. తీజ్ పండుగ తెలంగాణలోని బతుకమ్మ పండుగను పోలి ఉంది. సీత్లా భావానీ పూజ ముగిసిన రోజు సాయంత్రం పెళ్లి కాని ఆడపిల్లలు అందరూ కలిసి పాటలు పాడుతూ ఇంటింటికి తిరిగి వారి పెద్దవాళ్ళను కలుస్తారు. కాకా, దాదా, భీయా (చిన్నాన్ని, తాత, అన్న) లను తీజ్ పండుగ జరపించాలని కోరుతారు. పెద్దలందరూ కలిసి తీజ్ పండుగ చేయడానికి తండా నాయకుని అనుమతి తీసుకుంటారు.

తండాలో తీజ్ జరపడానికి 'నాయేక్' అనుమతి తప్పనిసరిగా తీసుకోవాలి. ఇది తండా కట్టుబాటు. ఈ సందర్భంగా పాడే పాట

మారో బాపు జబరజ్ హూంసియా కనాయియో
ఓరి బేటిపూన తీజ్ బొరాదూ కేరోయే
కువారీర్ ఆసీస్ లీదోరే కనాయియో
బడలారేజూ వదియారే కనాయియో
ఘరలేజు ఫాలియారే కనాయియో
(రమావత్ ద్వాలీ భాయి, దేవరకోండ, నల్లగొండ జిల్లా)

భావం:తీజ్ పండుగ చేసుకోవడానికి మా ఇంట్లో అందరు ఒప్పుకున్నారు. మా అశీస్సులు వారికి కావాలంటున్నారు.అలాగే ప్రతి ఇంట్లో సమ్మతిస్తున్నారని అమ్మాయిల భావన.

ఈ పాట కొద్ది పాటి మార్పులతో దేశమంతటా కూడా ప్రచారంలో ఉన్నది. మహారాష్ట్రకు చెందిన డా. గణవత్ రాతోడ్ గారి "బంజారాలోక్ గీతోంకా సాంస్కృతిక్ అధ్యయన్"అనే గ్రంథంలో బంజారాల తీజ్ పండుగ సందర్భంగా పాడే పాట కూడా ఇదే పాటను సూచించడం ఇందుకు తార్కాణం.

ఈ సంవత్సరం 'తీజ్' చెయ్యకపోతే మా అమ్మాయి తీజ్ పండుగ చెయ్యకుండానే అత్తవారింటికి పోతుంది. తప్పకుండా చెయ్యాలి అని తండాలోని ఆడపిల్లల తండ్రులు, అన్నలు, నాయక్‌ను ఒప్పిస్తారు. అలా ఒప్పుకున్నాక ఆడపిల్లలు ఆనందముతో పాటలు పాడుతారు.

"నాయక్ బాపూ బొరాయెతీజ్
బాయీా తారో పాలేణా !
నాయక్ బాపుతి రాజీయేగి తీజ్
బాయిా తారో పాలేణా !
మారి హుంసణ గొరీ తీజ్
బాయిా తారో పాలేణా !
మారే బాపూతి రాజీయేగి తీజ్
బాయితారో పాలేణా !
(మోగావత్ సక్రిబాయి, అల్వాల తండా,అలీయా, నల్గొండ జిల్లా)

భావం:తీజ్ పండుగ చేయడానికి మా నాయకుడు ఒప్పుకున్నాడు. అందుకు నాయక్‌ను ప్రశంసిస్తూ తమ సంతోషాన్ని తెలియపరుస్తున్నారు.

**మేర**

తీజ్ పండుగ చేద్దాం అని నిర్ణయించుకున్న తర్వాత ఆడపిల్లలందరూ కలిసి తండాలోని ప్రతి ఇంటికి వెళ్ళి విరాళాలు వసూలు చేస్తారు. దీన్నే **'మేర'** అంటారు. వాళ్ళు వసూలు చేసిన డబ్బులతో ఒకరిద్దరిని అంగడికి పంపించి గోధుమలు సెనగలు తెప్పిస్తారు. సాయంత్రం గోధుమలు, సెనగలు నానబెడతారు. ఆ సందర్భంలో ఒక పాట

"ఘొవులారే తోన మిరాగూడతి మంగాయి
ఘొవులారే తోన టపారేమ గోకి
ఘొవులారే తోన ఝరళేమ గోకి
ఘొవులారే తోన టోకణేమ గోకి
ఘొవులారే తోన నంగరిమ గోకి
(రామవత్ బాజు, ఎర్రకుంట తండా, దేవర కొండ, నల్లగొండ జిల్లా)

భావం : గోధుమ నిన్ను మిర్యాలగూడ నుంచి తెచ్చాము. పెట్టెలో దాచి పెట్టాము. నిన్ను బిందెలో దాచి పెట్టాము. బుట్టలో నానబెట్టాము అని భావం.

గోధుమలు నానబెట్టిన తర్వాత ఆడపిల్లలు "పినోళీర్ వెల్ది (దుసేరు తీగ)లతో చిన్న చిన్న బుట్టలను అల్లుతారు. అన్నలతో, నాన్నలతో అల్లిస్తారు. మరుసటి రోజు ఆడపిల్లలు పుట్ట మట్టిని కలిపి బుట్టలతో నింపుతారు. ఆ బుట్టలకు సేవా భయా బుట్ట అని మేరామ బుట్ట అని, అలాగే వారి ఇష్టదైవం పేరుతో బుట్టలను చేస్తారు. తండా నాయక్ చేత గోధుమలు చల్లిస్తారు. ఈ సందర్భంలో కన్యలు పలు రకాల పాటలు పాడుతారు.

"ధండీ యాడీ బొరాయి తీజ్
బాయిా తారో పాలేణ

నీళ్ళను తెచ్చి బుట్టలో పోస్తారు. తొమ్మిది రోజులు జరిగే ఈ తీజ్ పండుగ సంబరాలు బాలికలకు కలిగించే అనందం అంత ఇంత కాదు. పండుగ ప్రతి సందర్భంలో ఒక పాట ఉండడం ఇక్కడ గమనించదగ్గ అంశం.

"బోద ఖోదారే సేవభాయ కువలా ఖోద
కువలేరో పాణి అకెలాబి భరే, సకేలాభీ భరే
చ్వారావాళీ భరే, చ్వారివాళీ భరే
జళ ఊండోరే కాజళ నిలోకచ
(జటావత్ సాలీ, జటావత్ తండా, మల్లెపల్లి, నల్లగొండ జిల్లా)

భావం : సేవా భాయా బావిలో నీటిని అందరూ తోడుకోవడానికికి వీలుగా లోతైన బావిని తవ్వించి ఎంతో మేలు చేశాడన్న విషయం స్పష్టమవుతుంది. బావిని తవ్వించడం వల్ల ఎంతో

పుణ్యం వస్తుంది.

నీళ్ళ కోసం బావి దగ్గరకు వెళ్ళినప్పుడు పాడే పాట ఇది.

బావిలో నుంచి నీళ్ళను తోడుకోని వచ్చి తీజ్ పై చల్లుకుంటూ ఈ విధంగా పాటను పాడుతారు.

" లాంబీ లాంబీయే లాంబడి ఎకేరియా
లార లేరియే లాంబడి ఎకేరియా
ధోక ఖారియే లాంబడి ఎకేరియా
లాంబీ లాంబీయే లాంబడి ఎకేరియా

(రమావత్ లీక్కిబాయి, ఎర్రకుంట తండా, దేవరకొండ, నల్లగొండ జిల్లా)

భావం : లాంబడి (తీజ్) చాలా వీపుగా ఎదుగుతుందని అర్థం

ఢమోళి

ఏడో రోజు జరిపే కార్యక్రమమేాడమోళ్ళి ాచుర్మో (రొట్టెలు, బలం కలిపిన ముద్ద) మేరామా భవానీ కి సమర్పించే కార్యక్రమానికి దమోళి అని పేరు దమోళి జరిపే రోజు మేరా మా భవానికి బలి ఇవ్వడం ఆచారం. వెండితో చేసేవి మేరామా భవానీ విగ్రహాన్ని కాని లేదా ఒక రూపాయి బిళ్లను పెట్టి దాని ముందు మేకపోతు బలి ఇస్తారు. అట్లా రూపాయి పెట్టి దాని ముందు మేకపోతును బలి ఇస్తారు. అట్లా రూపాయిని పెట్టి పూజించడాన్నే'అకాడో' అంటారు. ప్రతి ఇంటి నుండి పావుసేరు చొప్పున బియ్యం సేకరించి పాయం (కడావో) వండుతారు. వండిన పాయాన్ని బలిగా ఇవ్వబడిన మేక మాంసాన్ని ఇంటింటికి పంపిస్తారు. ఆ తర్వాత తండా వాసులంతా తీజ్ దగ్గర చేరి ఆటపాటతో ఆనందంగా గడుపుతారు.

గణ్ గోర్

ఎనిమిదవ రోజు శృంగార, హాస్యభరితమైన గేయాలను పాడుతూ ఆడుతారు. బంజారాలు 'గణగోర' అనే ప్రతిమలను వివస్త్రగా ఎనిమిదవ రోజు తయారు చేస్తారు. కొన్ని ప్రాంతాల్లో స్త్రీ పురుషుల రెండు ప్రతిమలను తయారు చేస్తారు. ఒక ప్రతిమకు భూక్య మరొక ప్రతిమకు కొర్రా చౌహన్ అనే వియ్యమందవలసిన గోత్ర నామాలను పెడతారు. ఆడపిల్లలు వరసైన యువకుల పైన బూతు గేయాలను పాడుతూ బొమ్మను చూపిస్తూ ఆడుతుంటారు. బూతు పాటలను వినలేక యువకులు ఆ నగ్న ప్రతిమ ధ్వంసం చేయడానికి ప్రయత్నం చేస్తారు. అందుకు ఆడపిల్లలు అడ్డుపడి కర్రలతో యువకులను కొడతారు. యువకులు ఆడపిల్లలు కొట్టె దెబ్బలను భరించి ఆ ప్రతిమలను నాశనం చేయడంతో వీరి అల్లరికి ముగింపు పడుతుంది.

కన్యలందరి పొత్తులో ఒక బుట్ట ఉంటుంది. ఆ బుట్టను చడకి ఓల్డి అంటారు. ధోనా అని కూడా అంటారు. అమ్మాయిల అన్నదమ్ముల వారిని ఏడిపించాలన్న ఉద్దేశంతో ఈ బుట్టను కావాలని దాచి పెడతారు. ఆ పిల్లలంతా అన్నయ్యలను బతిమిలాడే సందర్భంలోని పాట.

'నవసన దాడేరి భూకి రభీయో
తరసిరే భీయో, ధోనా దోరే ధోనా దో
ఘరేన ఛోడి బారేన ఛోడి
ధళాయి ఛోడి క్వాడి ఛోడి
భాజ్జిరి పత్యామ కీదిరే భీయో
దోనదోరే దోనడో

(భూక్యజానీ బాయి, నర్సపురం తండా, మిర్యాలగూడ, నల్లగొండ జిల్లా)

భావం : అన్నలారా తొమ్మిది రోజులుగా ఉపవాసం ఉన్నాం. దాహంతో ఉన్నాం ఆకు కూరలు తింటున్నాం. కాబట్టి మాకు మీతో మాట్లాడే శక్తి లేదు. దయచేసి మా ధోనా (బుట్ట) మాకివ్వండి.

తీజ్ తోడేరో

తొమ్మిదో రోజు మధ్యాహ్నం కాగానే ఇంటింటికి వెళ్ళి ఈ రోజు సాయంత్రం తీజ్‌లను తెంపడానికి అందరూ రావాలని చెప్పి వస్తారు. ఆ రోజు సాయంత్రం దేవతల బుట్టలను పీటల మీద పెట్టి వాటిలో నుంచి ఐదురుగు ముత్తైదువలను తీజ్ నారును తెంపుతారు. ఈ సందర్భంలోని పాట

'సేవా భాయా బోరాయో తీజ్
బాయి తారో పాలేణా
సేవా భాయాతి రాజీ యోగి తీజ్
బాయి తారో పాలేణా
మేరామా యాడి బోరాయా తీజ్
బాయా తారో పాలేణా
మేరామా యాడీతి రాజీయోగి తీజ్
బోయా తారో పాలేణా
బాయా తారో పాలేణా

(జటావత్ పేణా, జటవత్ తండా, మల్లెపల్లి, నల్లగొండ జిల్లా)

ఈ తీజ్ సేవా భాయా, మేరాతితో రాజీ అమ్మాయి అని అమ్మాయిలు భక్తి శ్రద్ధలతో చేసే పూజా విధానం వల్ల వేపుగా పెరిగిన తీజ్ సేవభాయా, మేరామాలు ఇష్టపడుతున్నాయాని భావం.

తీజ్ నిమజ్జనం చేసే ముందు తండా వాళ్లందరూ తలపాగ కట్టుకొని గుండ్రంగా కూర్చుంటారు. అమ్మాయిలు భక్తితో తెంచిన తీజ్‌ను తండాను నాయకుని తలపాగాలో పెడతారు. ఆ తర్వాత అందరి తలపాగలో పెడతారు. అదే విధంగా తండా స్త్రీలు కూడా అందరి తలపాగాల్లో తీజ్‌నారును కూర్చుంటు పాటలు పాడుతారు.

'కాచిగ పాకీయే బోరడియే
కాయి సేవలా భాందోయే పాంకేడియే
కసేరో రోళోయే చుంగేలా
కాయా పాటేరో రోళోయే చుంగేలా
కాయా దండియాడీరియే బోరడియే
కాయా కాచీగ పాకీయే బోరవడియే
కణసీ బాయిరియే బోరడియే
కాయా శీతత బాయిరియే బోరడియే
కాయా రాగియా బాందోయే పాంకేడియే
కాయా కసేరో రోళోయే ఛుంగేలా
కాయా పాటేరో రోళేయే ఛుంగేలా'

(రమావత్ భారతి, ఎర్రకుంట తండా, దోవరకొండ, నల్లగొండ జిల్లా)

భావం : గుండ్రంగా కూర్చున్న తండా నాయకులను సేవాభయా, దండియాడిలతో పోల్చి, తలపాగలో తీజ్‌ను తురాయిలుగా గుచ్చుతున్న నేపథ్యాన్ని తెల్పుతుంది.

ఈ సందర్భంగా తండాలోని హాస్యాన్ని పండించే ఒకరిద్దరు ఆడవాళ్ళ డ్రసులు వేసుకొని ఆడవాళ్లతో, పిల్లలతో వరసైన వదినలతో హాస్యాన్ని పండిస్తారు. తరువాత అందరూ రొట్టెలు కట్టుకొని తీజ్ నిమజ్జనానికి బయలుదేరుతారు.

## తీజ్ వేరాయేర్

తీజ్ వేరాయేర్ అంటే తీజ్ నిమజ్జనం చేయడం దగ్గరలో ఉన్న నీటిలో చేస్తారు. అక్కడికి చేరుకున్నాక అన్నలు, తమ్ముళ్ళు, చెల్లెలు కాళ్ళు కడిగి దండాలు పెట్టి తేజ్ బుట్టలను నీటిలో నిమజ్జనం చేస్తారు. ఈ సందర్భంలో కన్నె పిల్లలు ఏడుస్తూ విలపించే పాట.

'తూకతేతి అయియే వ్యాకరణ రంగా
మారీ ఓడతిరో జోడ్ లేయీా చాలీయే దగరచాలి
తూ కతేతి అయొరే సోళగాసో ఖాలీయా
దీమారి సాతణురో జోడ్ లేయిచాలోరే దగరేచాలో
తూ కతేతి అయియే పాపణీయే గంగా
మారి నంగరిరో జోడ్ లేయీా చాతియే దగరచాలి'

(భానవతు దివ్యభాయి, భాండవత్ తండా, మిర్యాలగూడ, నల్లగొండ జిల్లా)

భావం : గంగా తొమ్మిది రోజులుగా ఎంతో భక్తి శ్రద్ధలతో పెంచిన తీజ్ బుట్టలను తీసుకెళుతున్నావు. అసలు నీవు ఎక్కడి నుంచి వచ్చావు. మా తీజ్ బుట్టలను తీసుకెళ్ళతున్నావు అని కోపం ప్రదర్శిస్తున్నట్లుగా ఉంటుంది.

తీజ్ బుట్టలను నిమజ్జనం చేసిన తర్వాత అందరూ తీజ్ పందిరి వేసిన ఇంటి ముందుకు చేరుకుంటారు. ఆ తర్వాత కన్నెల అన్నలు వారి కోసం ఉయ్యాలలు వేస్తారు. అందరూ ఆడి, పాడి ఉయ్యాలలూగుతారు.

'తోళ్జ యాడిరో హింజోళో బాగేమా
హించలరే హింజోళో బాగేమా
దండియాడిరో హింజోళో బాగేమా
సోనేరో హింజోళో బాగేమా
మత బోలో మకేలియారి బాగేమా
సోనేరో హింజోలో దేవళేమా
హించలరే హింజోళో నంగేరిమా
హన్ మాన్ బాపురో హీంజోళో దేవళేమా
హీంచలరే హీంజోళో మాలేరి గామేమా'

(మూణావత్ రంగీ, మూణావత్ తండా, మల్లెపల్లి, నల్లగొండ జిల్లా)

భావం : అమ్మాయిలు ఉయ్యాలలూగుతూ పాటలు పాడుతారు. మేము ఉగుతున్న ఉయ్యాళ్ళు దేవతల గుడిలో ఉన్న ఉయాలవంటివే! మా తండాల్లో వీటిని మా నాయకులు కట్టించారు అని ఆనందంతో పరవశిస్తారు. ఇలాగే బంజారాలు తీజ్ పండుగ తొమ్మిది రోజులు ఎంతో భక్తి శ్రద్ధలతో జరుపుకోని ఆనందోత్సాహాలతో ముగిస్తారు.

ఆధార గ్రంథాలు

1. ఆచార్య యం. గోనానాయక్ : భారతదేశంలో బంజారాలు తెలుగు అకాడమీ హైదరాబాద్ 2005
2. బి. చీనియా నాయక్ : బంజారా చరిత్ర - సంస్కృతి - ప్రగతి - శ్రీ హాథీరాం బావోజి పబ్లికేషన్స్ 1998
3. ఆచార్య సూర్య ధనుంజయ్ : బంజారా సాహిత్యం - జీవన చిత్రణ నల్లగొండ జిల్లా 2009
4. జనపాల శంకరయ్య : తెలుగు లంబాడీల గేయ సాహిత్యం స్వీయ ప్రచురణ హైదరాబాద్ 2001

---

రచయిత- హైదరాబాద్, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయంలో పరిశోధక విద్యార్థి

---

## అమ్మబాసకు ఏటికోళ్ళు

ఉ.మా: **అచ్చులు** ఊపిరై నడుప నచ్చుతెలుంగు పదాలు వెల్గురా
మెచ్చగ హల్లులాభరణమించులు నింపును భావపుష్టికై
నిచ్చలు మానసాబ్జములు నిక్కపు చొక్కపు సుప్రకాంతులన్
పచ్చపొలమ్ముగా మనసు పంటనుపెంచు తెలుంగుమాటయే

తేటగీతి: **అలతి** పదముల తళుకుతో మలుపుమలిపి
నీతి బోధను జోడించి రీతిపెంచు
జనము లెరిగిన పదముల జట్టుగట్టి
పరిచయము లేని పదముల పలుకనేర్పు

తేటగీతి: **కాలరీతిని** తెలిపెడు కావ్యములను
సంఘరూపపు సాహిత్య చరితములను
మంచిఉక్తులు సూక్తులు మనసుకెక్కు
బతుకు మెతుకుల పండించు బాట చూపు

తేటగీతి: **కవులగొప్పను** తెలిపెడు కలమురాత
ఆయుధమ్మయి మెదడుకు హోళిపెంచు
పలుకు చాణక్యములకును పంటభూమి
పలకరించిన హృదయాలు పులకరించు

తేటగీతి: **తెలుగుతో** సైన్సు గణితాల తెలివిపెరుగు
తెలుగుతో శాస్త్ర చరితల వెలుగులందు
బయటిభాషల మైత్రితో నయము పెరుగు
ఇంపు సొంపుల మన తెల్గు కేటికోళ్ళు

**- వల్లభాపురం జనార్దన** 9440163687

---

## అమ్మనుడులు ఆత్మగౌరవ ప్రతీకలు

## స్థానిక అస్తిత్వ భావనలను గౌరవించాలి

శ్రద్ధాంజలి

కలిమిశ్రీ
9246415150

# బ(బా)లీయమైన బంధం......



**కనువెలుగు: 28,సెప్టెంబరు 1942**
**కనుమరుగు 17, ఏప్రిల్ 2023**

ఆయన గీతల్లో ఎంత వేగముందో అంత సౌందర్యమూ వుంటుంది. ఎంత శృంగారముందో అంత ఆధ్యాత్మికతా వుంటుంది. ఆయన గీతలు ఎంత ఎంత అర్థవంతమో అంత 'శబ్ద'వంతంగానూ వుంటాయి. ఆయన ప్రముఖ చిత్రకారుడు బాలి. తెలుగువారి హృదయాలను కొల్లగొట్టిన చిత్రకారుల్లో బాపు వరుసలో బాలిని కూడా తప్పక చెప్పుకోవాలి. ఇప్పుడు కొత్తతరం గీతలు రాజ్యమేలుతున్నప్పటికీ నిన్నటితరం చిత్రకారుల ప్రతిభకు ఎలాంటి ఢోకా లేదని **బాలి** చిత్రాలు నిరూపిస్తున్నాయి. బాలి వేలాది పుస్తకాలకు ముఖచిత్రాలు గీశారు. వేలాది కథలకు, సీరియల్స్‌కు బొమ్మలు గీశారు.వేలాది కార్టూన్లు వేశారు. తెలుగుదనానికి, సంప్రదాయానికి ప్రతిరూపాలుగా బాలి బొమ్మల్ని, కార్టూన్లని చెప్పుకోవచ్చు.

బాలి అసలు పేరు మేడిశెట్టి శంకరరావు. స్వాతంత్ర్యానికి ముందు 1942 సెప్టెంబరు 28న విశాఖ జిల్లా అనకాపల్లిలో లక్ష్మణరావు-అన్నపూర్ణ దంపతులకు జన్మించారు బాలి. హైస్కూల్ స్థాయిలోనే చిత్రకళపై మక్కువ పెంచుకున్నారు.స్కూల్లో డ్రాయింగ్ టీచర్ పెద్దపల్లి వెంకటరత్నం గారు బాలికి చిత్రకళలో మెలకువలు నేర్పారు. వివాహం జరిగాక జీవిత అవసరాల కోసం కొంతకాలం ప్రభుత్వంలో గుమస్తా ఉద్యోగం చేశారు.

ప్రభుత్వ ఉద్యోగాన్ని సైతం వదులుకొని బొమ్మలు గీయడమే నా పని అని ఆత్మవిశ్వాసంతో చెప్పిన గొప్ప చిత్రకారుడు బాలి. బాలికి ఒక కూతురు, ఒక కొడుకు. ఇద్దరూ అమెరికాలో స్థిరపడ్డారు. గత సంవత్సరం అమెరికాలో ఏర్పడ్డ మంచు తుపానులో బాలి కొడుకు ప్రమాదానికి గురై మరణించారు. అప్పటినుండి బాలి ఆరోగ్యం క్షీణిస్తూ వచ్చింది. పేగులకు సంబంధించిన వ్యాధితో ఆసుపత్రిలో చేరి ఏప్రిల్ 17న మరణించారు.

**పత్రికారంగ ప్రవేశం**

ప్రభుత్వ ఉద్యోగానికి రాజీనామా చేసిన తర్వాత ఈనాడు దినపత్రికలో పొలిటికల్ కార్టూనిస్టుగా చేరారు. అప్పటినుండి బాలి విజయవాడకు మకాం మార్చారు. ఈనాడులో బాలి వేసిన చిత్రాలు ఆనాటికే ఈ రంగంలో స్థిరపడ్డవారిని ఆలోచింపచేశాయి. ఆ తర్వాత ఆంధ్రజ్యోతి వీక్లీకి మారవలసివచ్చింది. బాలి జీవితం ఇక్కడ మలుపు తిరిగింది. బాలి చిత్రాలను అప్పటికే అభిమానించే ఆంధ్రజ్యోతి వారపత్రిక,దినపత్రిక సంపాదకులు నార్ల వెంకటేశ్వరరావు, పురాణం సుబ్రహ్మణ్యశర్మల ప్రోత్సాహం, వారి సలహాలు బాలిని తిరుగులేని చిత్రకారుడిగా తీర్చిదిద్దాయి. 14 సంవత్సరాలు ఆంధ్రజ్యోతి సంస్థలో పనిచేసిన అనుభవం బాలికి జీవితంలో ఎంతో ఉపయోగపడింది.

**చిత్రకారుడిగా బాలి**

బాలి పిల్లలకు చెందిన పలు పత్రికలకు చిత్రాలు వేయడం, ప్రత్యేకించి 'బొమ్మలు గీద్దాం రండి' అనే పుస్తకం ద్వారా చిన్నారుల్లో చిత్రకళపై ఆసక్తిని పెంచారు.ఎన్‌సిఇఆర్‌టి న్యూఢిల్లీ వారి పాఠ్యపుస్తకాల తయారీలో బాలి సహకారం అందించారు.బుద్ధుడి జాతక కథలకు, ఉమర్‌ఖయాం రుబాయత్‌లకు చిత్రాలు గీశారు. సుప్రసిద్ధ నవల మాక్సింగోర్కీ 'మదర్' (అమ్మ) సంక్షిప్త తెలుగు చిత్రానువాదానికి పిల్లలు ఇష్టపడే విధంగా అద్భుతమైన బొమ్మలు గీశారు.'బాలల బొమ్మల అమ్మ' పేరుతో 2022లో విడుదలైంది ఈ పుస్తకం.

**కథకుడిగా బాలి**

బాలి చిత్రకారులే కాదు.మంచి కథకులు కూడా. వివిధ సంస్థలు నిర్వహించిన కథల పోటీల్లో బాలి కథలు బహుమతులు కూడా గెలుచుకున్నాయి.బాలి రాసిన 32 కథలతో గత సంవత్సరం జులైలో 'బాలి కథలు' పేరుతో ఆయన కథా సాహిత్యాన్ని మల్లెతీగ సాహిత్య సంస్థ గ్రంథస్థం చేసింది.

'బాలి గీత నిలువుగా వుంటుంది. గీతల్ని వంపులు తిప్పకుండా బొమ్మలు గీసే శక్తేదో బాలిగారిలో వుంది. సాహిత్యమంటేనే వక్రోక్తి కదా. మరి వంపులు తిరిగి చుట్టూ తిరిగి వచ్చే పక్షి యెగరడంలాంటి దారిలో కాకుండా నిటారుగా కథలెలా రాయెచ్చు.? రాయెచ్చునని బాలి గారి కథలు నిరూపిస్తాయి. ఆయన బొమ్మల్లాగే ఆయన కథల్లోనూ పొదల చుట్టూ బాదే డొంక తిరుగుళ్లుండవు. రామాయణమంత కథనైనా ఆయన "కట్టె,కొట్టె,తెచ్చె" అని సూటిగానే చెప్తారు.' అంటారు మధురాంతకం నరేంద్ర, 'బాలి కథలు' పుస్తకానికి రాసిన ముందుమాటలో.

**విజయవాడతో అనుబంధం**

1987 నుండి నాకు బాలిగారితో పరిచయం వుంది. నేను ఆంధ్రపత్రికలో పని చేస్తున్నప్పుడు ఆ పత్రికాఫీసుకు వచ్చేవారు. ఆ తర్వాత నేను ఆంధ్రజ్యోతికి మారిన తర్వాత ఆ ఆఫీసుకీ వచ్చేవారు. ఏలూరు రోడ్డు, బందరు రోడ్డుపై బాలి గారి పాదముద్రలు ఇప్పటికీ ఆయన గీతల్లాగే పదిలంగా వుంటాయి. 1980ల్లో ఆయన చేత ఇలస్ట్రేషన్ గీయించుకోని రచయిత గాని, రచయిత్రి గాని వుండేవారు కాదు. వేలాది కథల పుస్తకాలకు, వందలాది నవలలకు ఆయన ముఖచిత్రాలు వేశారు. ఇప్పటికీ బాలి చిత్రాలు గీస్తూనే నిష్క్రమించారు. బాలి గారికి శ్రద్ధాంజలి.

అ

జనవాణి

వై. ఆనందనాయుడు
9966663979, 8317513880

# తెలుగును బతికించుకుందాం

దేశంలో మొట్టమొదటి భాషా ప్రయుక్త రాష్ట్రం, అలా ఏర్పడి మొట్టమొదట రెండుగా విడిపోయిన రాష్ట్రం కూడా మనదే. తరచి చూస్తే మన భాష పట్ల మనకెంత చిన్నచూపో అర్థం అవుతుంది. కాబట్టే విడగొట్టబడ్డామనిపిస్తుంది. జాతీయ సమైక్యవాదులుగ ఇలా విడగొట్టబడిన చిట్టచివరి రాష్ట్రం కూడా మనదే కావాలని కోరుకుందాం. ఇరు తెలుగు రాష్ట్రాలలో ఎంతమంది తెలుగువారున్నారో సుమారుగ వెలుపల అంటే దేశంలో గాని దేశం వెలుపల గాని అంతమంది తెలుగువారు ఉంటారని ఒక అంచనా. అయితే ఇటీవలి కాలంలో ఈ సంఖ్య, స్థాయి క్రమేణ తగ్గుతున్నట్లు తెలుస్తోంది. అంతర్జాతీయ స్థాయిలో ఎక్కువమంది మాట్లాడే భాషగా తెలుగు మాట్లాడే వారి స్థానం 13 నుండి 15వ స్థానానికి, జాతీయస్థాయిలో రెండవ స్థానం నుండి నాలుగవ స్థానానికి దిగజారినట్లు తెలుస్తోంది. దీనికి కారణం ఏమిటి? మిగిలిన భాషల జనాభా పెరుగుతూ ఉంటే తెలుగు మాట్లాడే వారి జనాభా మాత్రం తగ్గిపోతోందా? ఖచ్చితంగా కానే కాదు. తెలుగు భాష సౌలభ్యము వలన ఏ ఇతర భాషల నైనా తేలిగ్గా నేర్చుకోగలుగుతారు. అయితే అదే తెలుగు వారి పాలిట శాపం అయిందని అనిపిసున్నది.తన మాతృభాష తెలుగు కావడం వలననే ఇతర భాషలను తేలిగ్గా నేర్చుకోగలుగుతున్నామనే స్పృహను కోల్పోయి తన మనుగడకు, ఉన్నతికి కారణమైన మాతృభాషను ఏరు దాటి తెప్పను తగలేయడం చేస్తున్నాడు. ఇటీవలి కాలంలో ప్రత్యేకించి ప్రపంచ ఆర్థిక సంస్కరణలు, ఐ.టి విప్లవం తరువాత ఆంగ్లం పట్ల వ్యామోహం మరింత పెచ్చరిల్లింది. దాదాపుగ 50 పైగా దేశాలలో ఈనాడు తెలుగు వారు గౌరవప్రద స్థాయిలో ఉన్నారు. కానీ పరస్పర సమాచార మార్పిడి నైపుణ్యాలకు ఉపయోగపడే మాతృభాషను విస్మరించడమే ఆశ్చర్యకరం, విషాదకరం. ఇలా లబ్ధిపొందిన వారు తమ భాష విలువను గుర్తించక విస్మరిస్తే నష్టపోయేది తరువాత తరానికి ప్రతినిధులైన మన పిల్లలే. **ఒక్క మాటలో చెప్పాలంటే నేటి ప్రపంచ జనాభా 800 కోట్లలో 400 కోట్ల మంది మాట్లాడే ఇండో యూరోపియన్ భాషలలో దేనినైనా తేలికగ నేర్చుకొనే వెసులుబాటు సౌకర్యాన్ని మన తెలుగు కలిగిస్తుందనే వాస్తవాన్ని మరువరాదు.** దానికి కారణం తెలుగు ద్రవిడ భాష అయినప్పటికీ కూడా ఇండో యూరోపియన్ వర్గానికి చెందిన సంస్కృత భాష ప్రభావం దీని మీద అత్యధికంగ ఉండటమే.

గతంలో అంటే 2000కు పూర్వం 10-20 శాతం విద్యార్థులు ఆంగ్లభాష మాధ్యమ విద్య అభ్యసించగా మిగిలిన వారందరూ దాదాపుగ తెలుగు మాధ్యమ విద్య నభ్యసించిన వారే.అంతే కాకుండా ఆంగ్ల మాధ్యమ పాఠశాలలలో కూడా సమాంతరంగా తెలుగు మాధ్యమ తరగతులుండేవి. ఆంగ్ల మాధ్యమ తరగతులలో సైతం తెలుగు ఒక సబ్జెక్టుగ ఉండి విద్యార్థులు భాషపై పట్టు సాధించే విధంగా బోధన ఉండేది. క్రమంగా అన్ని రంగాలలో వలెనే విద్యారంగంలో కూడా ప్రైవేటీకరణ జరిగి విద్యార్థుల, తల్లిదండ్రుల అవగాహనా రాహిత్యాన్ని సొమ్ము చేసుకునే విధంగా ఆంగ్ల మాధ్యమం వేలం వెర్రిగా విస్తరించింది. ఫలితంగా ఆలోచనామృత అమ్మభాష పోయి, బట్టీ చదువుల ఆంగ్లభాష మాధ్యమం విస్తరించింది. దీని ప్రతిఫలమే విఫలమైన నిరంతర సమగ్ర మూల్యాంకన (సిసిఇ) విద్యా విధానం. సుమారుగ వేయి సంవత్సరాలుగ కాపాడుకుంటూ వచ్చిన ఈ లిపిరంజకమైన తెలుగు, స్వల్ప కాల వ్యవధిలో అల్ప సంఖ్యాకులు మాట్లాడే లిపి లేని భాషగ మారి, క్రమంగా అంతరించే ప్రమాదం ఏర్పడుతోంది. ఇటువంటి క్లిష్ట పరిస్థితులలో అనేకమంది విజ్ఞులు అనేక స్థాయిలలో తమ వంతు ప్రయత్నంగా భాషను బ్రతికించే ప్రయత్నం చేస్తున్నారు.ఇక్కడ కొన్ని సూచనలు చేస్తున్నాను. పరిశీలించండి.

**1) పాఠ్యపుస్తకాలన్నీ కూడా డిగ్రీ స్థాయి వరకు తప్పనిసరిగ తెలుగు,ఆంగ్లమాధ్యమాలలో విధిగా ముద్రించాలి.** దానివలన విద్యార్థులకు, శిక్షణనిచ్చే సిబ్బందికి, వివిధ పోటీ పరీక్షలకు తయారయ్యే అభ్యర్థులకు, ఉపయోగపడుతుంది.

2) విద్యార్థికి ఐదవ తరగతి పూర్తయ్యేటప్పటికి భాషపై ఓ మాత్రం పట్టుంటేనే ఆరవ తరగతి నుండి సబ్జెక్టుపై పట్టు సాధించడానికి సాధ్యమవుతుంది. కనుక 5వ తరగతి తరువాత ఇంగ్లీషు, తెలుగు భాషలలో టోఫెల్ లాంటి పరీక్షను ప్రభుత్వేతర సంస్థలచే పారదర్శకంగా నిర్వహింపజేసి ఏ భాషపై పట్టుందో ఆ భాషా మాధ్యమం చదవడానికి అనుమతించాలి. **లేకుంటే బ్రిడ్జ్ కోర్సు లాంటిది ఏర్పాటు చేసి భాష సమస్య లేకుంటేనే పై తరగతులకు అనుమతించాలి.**

**3) ఇంటర్మీడియట్ స్థాయిలో రెండవ భాషగా తెలుగును తప్పనిసరి చేయాలి.** ఫలితంగా ఉత్తరోత్తర సివిల్ సర్వీసెస్ వంటి పరీక్షలు రాసేటప్పుడు ఈ భాషా పరిజ్ఞానం ఉపయోగపడుతుంది.

**4) అలాగే డిగ్రీ స్థాయిలో కూడా తెలుగు సబ్జెక్టును తప్పనిసరి చేయాలి.**

**5) ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ లో గ్రూప్-1 పరీక్షలలో తెలుగును ఒక అర్హత పరీక్షగ మాత్రమే నిర్వహిస్తున్నారు. అలాకాకుండా తెలుగును ఒక పేపర్ గ అన్ని పరీక్షలకు అంటే గ్రూప్ I, II, III,iv పరీక్షలకు ఒక పేపర్గ ఉంచాలి. అంటే అభ్యర్థి ఎంపికను తెలుగు భాషా పరిజ్ఞానం శాసిస్తుంది. అంతేకాకుండా ఒకవేళ అభ్యర్థి ఎంపిక అయితే తరువాత ప్రజలతో మమేకమై తమ దైనందిన కార్యక్రమాలను నిర్వహించడానికి ఎంతో సహాయపడుతుంది.**

**6) ప్రభుత్వాలపైన రాజకీయ పార్టీలపైన ఒత్తిడి తీసుకుని రావడం కోసం వారి వారి మేనిఫెస్టోలలో తెలుగు భాష ప్రాధాన్యం వచ్చేట్లు చూడాలి. దాని వలన కనీసం 5 నుండి 10 శాతం ఓట్ల ప్రభావం చూపగలిగినా రాజకీయ పార్టీలు తమ పంథాలు మార్చుకోగలవు.** నేడు కొంతమంది ఆంగ్ల మాధ్యమ విద్యార్థులు తెలుగు రాతలో చాలా కష్టపడుతుంటారు. కనుక తెలుగు నేర్చుకొన్నప్పుడు కనీసం బాగా చదవగలిగే పరిజ్ఞానం అయిన వారికి అబ్బేట్లు చేయాలి. దానివలన వివిధ పోటీ పరీక్షలకు తెలుగు మాధ్యమంలో చదివి ఆంగ్ల మాధ్యమంలో రాయగలిగే నైపుణ్యాన్ని పెంపొందించుకుంటారు. సివిల్ సర్వీసెస్ లాంటి పరీక్షలకు సిద్ధమయ్యేటప్పుడు కనీసం 50 శాతం సమయం ఆదా అవుతుంది.

7) దేశంలో ఉన్నత స్థాయి ఉద్యోగాలైన సివిల్ సర్వీసెస్ పరీక్షల్లో అత్యుత్తమ ర్యాంక్ సాధించిన వారిలో చాలామంది ఉత్తర భారతదేశంలోని హిందీ మాతృభాషగ కలిగినవారే ఉంటున్నారు. తెలుగులో కూడా రాయడం ప్రోత్సహించినట్లయితే తెలుగులో రాసేవారికి ఉత్తమ ర్యాంకులు వచ్చే అవకాశం ఉంటుంది. ఒకవేళ **ఆంగ్ల మాధ్యమంలో రాసినా కూడా ఆప్షనల్ విషయంగ తెలుగు ఎంపిక చేసుకొనే అవకాశం ఉండి మంచి మార్కులు పొందడానికి వీలవుతుంది. దానికి కారణం ఆంగ్లంతో పోల్చినప్పుడు తెలుగులో తక్కువ పదాలలో తక్కువ అక్షరాలలో ఎక్కువ అర్థం వచ్చేట్లు రాయగలిగే వీలుండడమే.**

ఉదాహరణకు ఈ కింది ప్రశ్నను పరిశీలించండి.

1) హిమాలయ పర్వతాలను గురించి నూరు పదాలు మించకుండా జవాబు రాయండి. మార్కులు-10

1) Himalayas are the highest mountains in the world. Their average approximate height is 6 kms. They extend from North Western part of India to Eastern parts of India with approximate length of 2500 kms. There are about 110 peaks with height of 7 kms approximately. Mount Everest is the highest peak among all with a height of 9 km approximately. Among these peaks Kanchanzunga the highest peak in India and third in Himalayas,with height of 8.5 kms approximately is between Nepal and India.It's geographical location saves sub-continent from the severe cold waves of Northern Siberia(97 పదాలు-475 అక్షరాలు)

2) ప్రపంచంలోకెల్లా హిమాలయ పర్వతములు ఎత్తైనవి. వాటి సగటు ఎత్తు సుమారుగ 6 కిలోమీటర్లు. భారతదేశ వాయువ్య దిశ నుండి 2500 కిలోమీటర్ల పొడవుతో తూర్పు వైపునకు వ్యాపించి ఉన్నాయి. వీటిలో సుమారుగ సగటు ఏడు కిలోమీటర్ల ఎత్తుతో 110 శిఖరాలు కలవు. అన్నింటిలోకి సుమారుగ తొమ్మిది కిలోమీటర్ల ఎత్తుతో మౌంట్ ఎవరెస్టు ఉన్నతమైనది. వీటిలోనే భారత నేపాల్ దేశాల మధ్య సుమారుగ 8.5 కిలోమీటర్ల ఎత్తుతో భారతదేశంలో కెల్లా ఎత్తైన, హిమాలయాల్లో మూడవ ఎత్తైన కాంచన గంగ అనే పర్వతం కూడా కలదు. ఈ పర్వతముల భౌగోళిక ఉనికి ఉత్తర సైబీరియా నుండి వీచే అతి శీతల వాయువుల నుండి భారత ఉప ఖండాన్ని కాపాడుతుంది.(75 పదాలు-275 అక్షరాలు)

3) ప్రపంచంలోకెల్లా హిమాలయ పర్వతములు ఎత్తైనవి. వాటి సగటు ఎత్తు సుమారుగ 6 కిలోమీటర్లు. భారతదేశ వాయవ్య దిశ నుండి 2500 కిలోమీటర్ల పొడవుతో తూర్పు వైపునకు వ్యాపించి ఉన్నాయి. వీటిలో సుమారుగ సగటు ఏడు కిలోమీటర్ల ఎత్తుతో 110 శిఖరాలు కలవు. అన్నింటిలోకి సుమారుగ తొమ్మిది కిలోమీటర్ల ఎత్తుతో మౌంట్ ఎవరెస్టు ఉన్నతమైనది. వీటిల్లోనే భారత నేపాల్ దేశాల మధ్య సుమారుగ 8.5 కిలోమీటర్ల ఎత్తుతో భారతదేశంలో కెల్లా ఎత్తైన, హిమాలయాల్లో మూడవ ఎత్తైన కాంచన గంగ అనే పర్వతం కూడా కలదు. ఈ పర్వతముల భౌగోళిక ఉనికి ఉత్తర సైబీరియా నుండి వీచే అతి శీతల వాయువుల నుండి భారత ఉప ఖండాన్ని కాపాడుతుంది.

హిమాలయ పర్వతముల వలన గంగ, సింధు, బ్రాహ్మపుత్ర వంటి జీవ నదులు ఏర్పడి, ఉపఖండ నాగరికతకు, అభివృద్ధికి, ఇతోధికంగ వీలుపడింది. ఉపఖండంలో సంవత్సరము పొడవునా పైరుపచ్చలతో సహజ సిద్ధంగా మనిషి బ్రతికే వీలు ఏర్పడింది.(100 పదాలు-378 అక్షరాలు)

1) మొదటి విద్యార్థి ఉపాధ్యాయుడు చెప్పినట్లు ఆంగ్లంలో సుమారుగ నూరు పదాలలో రాశాడు. సుమారుగ 500 అక్షరాలున్నాయి.మార్కులు 6/10 పొందాడు.

2) రెండవ విద్యార్థి అదే విషయాన్ని తెలుగులో 75 పదాలలోనే రాయగలిగాడు.అక్షరాలు కూడా సుమారు 400 మాత్రమే వచ్చాయి. మార్కులు 7/10 పొందాడు.ఎందుకంటే ఆంగ్ల మాధ్యమ విద్యార్థి కంటే తక్కువ పదాలు తక్కువ అక్షరాలలో అంతే విషయాన్ని రాయగలడం వలన సమయం కూడా ఆదా అయింది. తప్పులను సరి జేసుకోవడానికి కూడా వీలైంది.

3) ఇక మూడో విద్యార్థి పై ఇద్దరు విద్యార్థులు రాసిన విషయాన్ని రాశాడు.ఇంకా మిగిలిన 25 పదాలలో అదనపు విషయాన్ని రాయగలిగాడు. అలా రాసినప్పటికీ కూడా ఆంగ్ల అక్షరాల 500 కంటే సుమారు 100 అక్షరాలు తగ్గి అంటే 400 అక్షరాలలోనే రాయగలిగాడు. అంటే ఎక్కువ విషయాన్ని తక్కువ సమయంలో రాయగలగడం వలన తప్పులను సరిచూసుకోగలగడం వలన అత్యధికంగా 8/10 మార్కులు వచ్చాయి.

**చివరగా ఒక్కమాట: మాతృభాష అనేది డి విటమిన్‌తో సమానం.** జీవనశైలి మారడంతో ఇటీవల కాలంలో ప్రతి నలుగురులోనూ ముగ్గురికి డి విటమిన్ లోపం ఉన్నట్లుగా తెలుస్తోంది. మిగిలిన విటమిన్ లు లాగా 'డి' విటమిన్ ప్రతిరోజు తీసుకొనవలసిన అవసరం ఉండదు. దానికి నిల్వ ఉండే సామర్థ్యం కూడా ఉంటుంది. కాబట్టి సంబంధిత బిళ్ళలు తీసుకునే వారుకూడ వారానికి ఒకటి చొప్పున లేదా మరో రకంగానూ తీసుకుంటూ ఉంటారు. శరీరంలో చాలా జబ్బులకు డి విటమిన్ కారణమని తెలుస్తోంది. శరీరంలో సరిపడునంత డి విటమిన్ ఉంటేనే మనం తినే ఆహార పదార్థాలు అన్నీ కూడా చూషణ జరుగుతుంది. లేదంటే తిన్నవి తిన్నట్టే బయటకు వెళ్ళిపోయి అనారోగ్యం పాలవుతుంటాం. మాతృభాష కూడా చిన్నతనంలో అంతా మనసుపెట్టి నేర్చుకోగలిగితే జీవితాంతము కూడా వెన్నంటి ఉండి అందం, ఆనందం, ఆరోగ్యం, ఐశ్వర్యం అన్నింటిని పొందడానికి ప్రత్యక్షంగా కానీ పరోక్షంగా కానీ సహకరిస్తుంది.

కనుక తెలుగు భాషాభిమానులు అందరూ పైన తెలిపిన విధంగా ఆచరణ సాధ్యమయ్యే చర్యలను ఒక వైపు తీసుకుంటూ తెలుగు వలన ఎలాంటి అదనపు ఫలితాలను సాధించవచ్చు అనే విషయాన్ని విద్యార్థులకు బాల్యం నుండి, వీలైతే విద్యార్థుల తల్లిదండ్రులకు కూడా వివిధ రకాలుగా ప్రచారం చేయవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది. అప్పుడే సరళత,స్పష్టత,శాస్త్రీయతల కలబోతయిన తెలుగు చిరస్థాయిగా మన గలుగుతుంది. అ

## గ్రంథాలయం

**అమ్మమ్మ గారి ఊరు**

రచన: ఎస్.ఆర్.పృథ్వి

పుటలు: 32, వెల 20/-

ప్రతులకు: శ్రీమతి పి.ఉషారాణి
104-6-140, రామకృష్ణానగర్,
రాజమహేంద్రవరం - 533 101
ఫోన్:94927 04750

వెలిసిపోతున్న పదాలు

జి.వి.పూర్ణచందు
9440172642

# 'ధగిడి' సమ్మె

"బండగులాములు యాచక/తండంబుల కియ్యలేరు తము చండించే ముండల కిత్తురు ధగిడీ/గండలు మరి కుందవరపు కవి చౌడప్ప..."

అంటూ వెలయాండ్ర కోసం ఎంతైనా ఖర్చుపెడతారుగాని, బిచ్చగాడికి పట్టెడన్నంపెట్టని ధగిడీల గురించి కవి చౌడప్ప వ్రాశాడు. ఇక్కడ ధగిడీ అంటే విటుడు అని! చౌడప్పగారు క్రీ.శ. 1580 నాటి కవి. తంజావూరు ప్రాంతం వాడు. షుమారుగా 5-6 వందల యేళ్ళనుండీ ఈ ధగిడీ అనే తిట్టు మన వ్యవహారంలో ఉందని దీన్ని బట్టి గ్రహించవచ్చు.

'దాతను వాజులు జెరివే దబ్బిలి తలమీదనె సొద్దుచెయ్యి' అనే పల్లవితో సారంగపాణి పదాలలో ఓ గమ్మత్తయిన పాట ఉంది. 'ధాతువ తెలియని వైద్యముజేసే ధగిడి కొక సొద్దు/గట్టిగ పనిలేకను పొరుగిండ్లకు తిరిగే పణతికి వక సొద్దు/చెప్పిన మనవులు భూపతి కెరుగించని దుర్మంత్రికి వక సొద్దు/గట్టిగ కలిగియుండి పొట్టకు దినజాలని కఠినుని కొకసొద్దు/తన వెలదిని పరపురుషుల తార్చే మగ వెధవకు వకసొద్దు/గట్టిగ లంచము దిని పనులు చక్కసేయని లండికి వక సొద్దుమాట' ఇలా సాగుతుందీ పదం. తెలిసి తెలీని వైద్యం చేసే ధగిడిక్కూడా సొద్దు వేస్తున్నాడీ సారంగపాణి కవి. ఇక్కడ ధగిడీ అంటే అసంపూర్ణప్రజ్ఞావంతుడనే అర్థం కనిపిస్తోంది కవి. ఈయన చౌడప్పగారికన్నా 100 యేళ్ల తరువాతి వాడు. క్రీ.శ.1680 నాటి వాడని భావిస్తారు. 'ధర్మకార్యముల కడ్డము బలికే దబ్బిలి దొక బ్రతుకా?' అంటూ దబ్బిలి అనే మరో తిట్టుపదాన్ని కూడా సారంగపాణిగారే దగాకోరు అనే అర్థంలో ప్రయోగించాడు.

సముఖం వెంకట కృష్ణప్పనాయకుడు తన అహల్యా సంక్రందనం కావ్యంలో కుబేరుడి కొడుక్కీ, చంద్రుడికీ మధ్య వివాదాన్ని వర్ణిస్తూ, ధగిడీ పదాన్ని నీచుడనే అర్థంలో ప్రయోగించాడు. సముఖం వారు మధురనాయక రాజుల కాలంలో చొక్కనాథుడి దళవాయి. షుమారుగా 1660 ప్రాంతంవాడు.

మహమ్మదీయ ప్రభువుల ఏలుబడిలో ఉన్న ఆంధ్రప్రాంతంలో ప్రజల్ని పశువులకన్నా హీనంగా చూస్తూ, కించపరుస్తూ అధికారులు ధగిడీ లాంటి పదాలను ఊతపదాలుగా వాడుతూ నోరు పారేసుకునేవాళ్లు. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు పరిష్కరించిన వెంకటేశ్వర లఘుకృతులు గ్రంథం (కవి పేరు తెలీదు) లో ఒక పద్యం ఆనాటి పరిస్థితికి అద్దం పడ్తుంది. 'గరిమనరే గజ్జూగోండూ యనకపోరు/భువి నెట్టి యాచార్య పురుషునై న/సొలసి యనే భేటీచోదా యనకపోరు/ 'వెఅపించి షట్శాస్త్ర వేత్తనైన/దర్పితులై యరే ధగిడీ యనకపోరు/కదు సోమయాజుల కొడుకునైన/మీటి యరే హరాంకోరా యనకపోరు బహువేదశాస్త్ర సంపన్ను నైన... ఇలా ఆనాటి పాలకులు మహాపండితుల్ని, గురువుల్ని, షట్శాస్త్రవేత్తల్ని, బహువేద శాస్త్రసంపన్నుల్ని కూడా గజ్జూగోండూ, భేటీచోదా, ధగిడీకే, హరాంకోరా... ఇలా 'అరె ఒరే' భాషలో నోటికొచ్చినట్టు మాట్లాడుతూ కించపరిచేవారని వ్రాశాడు. మాటలు గాలికి పోతాయి, వాటికి సాక్ష్యాలు ఉండవనుకోకూడదు. ఎంత నిస్సహాయులైనా ఎక్కడో ఒకచోట ఇలా గ్రంథస్థం అవుతాయవి!

శ్రీపాద కృష్ణమూర్తి గారి బొబ్బిలి యుద్ధం నాటకంలో రంగారావు కుమారుని రక్షించబోయిన ఓ సేవకిని పట్టుకుని : 'దొంగా ధగిడీ ఇద్ది దీన్కి పట్టీ కొయ్య చాలా వుంది' అంటాడు. అదీ ఆనాటి పరిపాలకులు ప్రజలతో మాట్లాడిన తీరు.

'రామభజన శేయరా లమిడికా, నీ తామస మణచర ధగిడీ కా', 'భాంచెతు నేనెంతో చెప్పిన, చంచలమదుగవు ఛీ...ఛూ... మనసా' లాంటి తత్త్వాలు హాస్యం కోసం వ్రాసినవి కాదు. మనల్ని కించపరచిన ఆ ధూర్తులు తరచూ వాడిన ఈ తిట్టు పదాలను ఇలా యద్దేవా చేశారని అర్థం చేసుకోవాలి.

ధగడమియ్యా అంటే అసాధ్యుడు అనే మరో అర్థం ఉంది. అరుణ్ గాలీ అనే మాఫియా నాయకుడు'డాడీ' అనే పేరుతో మహారాష్ట్రలో 1980ల్లో ఒక వెలుగు వెలిగాడు. అతని కథని 2015లో దగాడీ చావల్ అనే హిందీ సినిమాగా తీశారు. గాడ్ ఫాదర్, నాయకర్‌ల కోవకు చెందిన సినిమా ఇది. 2017లో డాడీ పేరుతో మరో సినిమాకూడా వచ్చింది.

గాడేపల్లి వీరరాఘవశాస్త్రిగారిని ఉద్దేశించి మద్దులపల్లి వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు'చమత్కార కవిత్వము' గ్రంథంలో 'శాస్త్రిగారు ధగిడీ భిక్షయే గాని, దైన్యభిక్ష యెప్పుడు ఎఱుగరు' అని వ్రాశారు. ఇది చదవగానే ఒకింత ఆశ్చర్యం వేసింది. ధగిడీ భిక్ష ఏమిటీ? పోరాడి సాధించింది లేదా ప్రతిభతో గెల్చుకుందని దీని అర్థం.

సుల్తాన్ల కాలంలో ధగిడీ పదాన్ని మనల్ని కించపరిచేందుకు వాడినా, ఆ పదాన్ని శక్తిని చాటటం అనే అర్థంలోకి మార్చారు మన కవులు. కొన్ని ప్రయోగాలు పరిశీలించండి:

♦ 1946 డిసెంబర్ 13న ఆంధ్రపత్రిక:'1500 రైల్వేపనివాండ్ల ధగిడీ సమ్మె' అని ఓ వార్త వ్రాసింది. ఉదయం 7 నుంచీ 9 వరకూ రైల్వే కార్మికులు మెరుపు సమ్మె చేసినట్టు ఈ వార్తలో ఉంది. ధగిడీ సమ్మె అనేది ఓ కొత్త ప్రయోగం.

♦ 1947 జూన్ 16 ఆంధ్రపత్రిక: పొగాకు ఫ్యాక్టరీలో కార్మికులు ధగిడీ సమ్మె చేశారని వార్త వ్రాసింది, ఫ్యాక్టరీ లోపలే రేయింబవళ్లు కార్మికులంతా ఉండిపోయి సమ్మె నిర్వహించినట్టు ఈ వార్త సారాంశం.

తొలిదశలో ధగిడీ అంటే కులట అనే అర్థంలో స్త్రీ వాచకంలోనే ఈ పదప్రయోగం ఎక్కువగా జరిగింది. పోటదుర్తి గొల్లకలాపంలో 'ధగిడీ' అనే పదం ముండ అనే తిట్టుగా

తరువాయి 48వ పుటలో.....

శ్రద్ధాంజలి

పెనుగొండ లక్ష్మీనారాయణ
94402 48778

# సమాజం పట్ల ఎంతో 'అపేక్ష'ను ప్రదర్శించిన రచయిత 'కేతు'



**కనువెలుగు: 10, జులై,1939**
**కనుమరుగు 22, మే, 2023**

**'రాయలసీమ పండితులకుండే సహజమైన వైలక్షణ్యం, మట్టి చరిత్రను అనుభవించి, పాఠకులను అనుభూతం చేయించే సూక్ష్మపరిశీలన, స్త్రీల చాకిరీనీ, బాధల్నీ అవగాహన చేసుకునే సమ్యక్‌దృష్టీ వెరసి కేతు విశ్వనాథరెడ్డి' 'దక్షిణాంధ్ర గ్రామాలలో ముడివడి వికసించిన జీవితమైనా పై లక్షణాలే వారిని సమకాలీన రచయితల్లో సమున్నతుని గావించాయి. కథా రచయితగా, నవలాకారుడిగా, విమర్శకుడిగా పరిశోధకుడిగా చతుర్ముఖమైన ప్రతిభతో ఆధునిక తెలుగు సాహిత్యాన్ని అలరింపజేసిన ప్రజ్ఞాశాలి ఆచార్య కేతు విశ్వనాథరెడ్డి'.(14-11-1995న అమరజీవి పులుపుల వెంకట శివయ్య సాహితీ సత్కారాన్ని గుంటూరు జిల్లా అరసం అందిస్తున్న సందర్భంలో ప్రచురించిన కరపత్రం నుండి..**

తెలుగు సాహిత్య లోకానికి, అత్యంత ఆత్మీయులైన కేతు విశ్వనాథరెడ్డి విస్తృతమైన సాహిత్యాన్ని మనకు అందించి వెళ్ళిపోయారు. వారి ఆకస్మిక మృతి ఎంతో విషాదం.

ఆషాడ బహుళ అష్టమ సోమవారం తొలి ఘడియల్లో అనంతపురం జిల్లా తాడిపత్రి తాలూకాలోని పాతపల్లె గ్రామంలో పుట్టినట్లు 'వేర్లు-బోధి' నవలల సంపుటి చివరి అట్టపైన రాసివుంది. దీని ప్రకారం 1939 జులై 10 కేతు పుట్టిన రోజు అయివుంటుంది. వారి తల్లిదండ్రులు నాగమ్మ, చిన వెంకటరెడ్డి, స్వగ్రామం కడప జిల్లాలోని రంగశాయపురం. కేతు 22మే 2023 సోమవారం ఉదయం ఒంగోలు పట్టణంలో గుండెపోటుతో కనుమూశారు. అభిమానులు కేతు అని విశ్వం అని వారిని ప్రేమగా పిలుస్తుంటారు. బహుముఖ ప్రజ్ఞాశాలి అయిన కేతు ప్రధానంగా కథారచయితగా పేరొందారు. రాయలసీమ కథకు లైట్‌హౌస్‌గా కీర్తి గడించారు. 'దృష్టి' వీరి సాహిత్య వ్యాససంపుటి. 'కడప జిల్లా 'ఊర్లపేర్లు' వీరి విశిష్ట పరిశోధనా గ్రంథం. తాను ఎంతగానో ప్రేమించే కడపసీమకు కేతు సమర్పించిన విలువైన కానుక ఈ పరిశోధన. ఈ పరిశోధన తరువాత ఎందరికో మార్గదర్శకమైంది. కూడా. కేతు విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ ప్రచురించిన కొడవటిగంటి కుటుంబరావు కథా సంపుటాలకు సంపాదకునిగా వ్యవహరించారు. అదొక ప్రామాణిక కృషి. డాక్టర్ బాబా సాహెబ్ అంబేద్కర్ రచనలు-ప్రసంగాలకు, తెలుగు చరిత్ర-సంస్కృతి, రాయలసీమ రాగాలు, చదువు కథ సంకలనాలకు సంపాదకత్వం వహించారు. 2002 అక్టోబరులో విశాలాంధ్ర ప్రచురించిన 'విశాలాంధ్ర తెలుగు కథ 1910-2000 సంకలనానికి కేతు ప్రధాన సంపాదకులు. (సింగమనేని నారాయణ, పెనుగొండ లక్ష్మీనారాయణ, సదానంద్ శారద ఈ సంకలనం సహ సంపాదకులు) డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయ పాఠ్యాంశాలు. రూపకల్పనలో సరికొత్త పంథాను అనుసరించారు. వీరి తొలి సాహిత్య కేంద్రం కడప.రారా, ఆర్వియార్, సోమా సోదరులు, కుప్పిరెడ్డి పద్మనాభరెడ్డి, కొత్తపల్లి రవిబాబు మరికొందరితో సాన్నిహిత్యం. 'సంవేదన' పత్రిక నిర్వహణలో రారాకు తోడ్పాటు. 1980 ప్రాంతంలో కడపలో ఏర్పాటైన 'యువసాహితి' కి చేయూతనందించిన కార్యకర్త కేతు.

అభ్యుదయ సాహిత్యోద్యమంతో,అభ్యుదయ రచయితల సంఘంతో తొలినుంచీ ప్రగాఢ పరిచయం. అరసం కడప జిల్లా కార్యదర్శిగా, రాష్ట్ర కార్యదర్శిగా బాధ్యతలు నిర్వహించారు. అరసం అధ్యక్షులుగా 1996 మార్చి నుంచి ఆగష్టు 2004 వరకు కొనసాగారు. కడపలో 2003 సెప్టెంబరు 13,14 తేదీలలో జరిగిన 15వ రాష్ట్ర మహాసభలలో కేతు ప్రారంభోపన్యాసం చేశారు. ఇప్పుడు ఆంధ్రప్రదేశ్ అరసం అధ్యక్ష వర్గ సభ్యుడుగా కొనసాగుతున్నారు.

కేతు విశ్వనాథరెడ్డిది మార్క్సిస్టు దృక్పథం. కమ్యూనిస్టు ఉద్యమంతో సన్నిహిత సంబంధాలున్న కామ్రేడ్.

'చుట్టూ వున్న జీవితాన్నే కథల్లో ఇతివృత్తంగా తీసుకున్నాను. రక్తమాంసాలున్న మనుష్యుల్నే పాత్రలుగా చిత్రించడానికి ప్రయత్నించాను. పాత్రలు జీవితంతో సంబంధం లేని గాలి కబుర్లాడకుండా చూశాను. వస్తు శిల్పాల మధ్య సామరస్యం కోసం తపించాను.' అని కథా నిర్మాణం గురించి వినయంగా చెప్పుకున్న రచయిత కేతు.

1958లో 'ఆమె' కథతో సాహిత్యరంగ ప్రవేశం చేసిన వీరి కథలు జప్తు, కేతు విశ్వనాథరెడ్డి కథలు 1,2 భాగాలు ఇచ్ఛాగ్ని సంపుటాలుగా వెలువడ్డాయి. వేర్లు, బోధి నవలలు రెండూ ఒకే పుస్తకంగా సెప్టెంబరు 1994లో ప్రచురితమైంది. ఇంకా వ్యాసాలు, సంపాదకీయాలు, పరిచయం (ముందుమాటలు,సమీక్షలు) సంగమం (వ్యాసాలు,ప్రసంగాలు) పాత్రికేయం వీరి కథలన్నీ ప్రసిద్ధమైనవే, పేర్కొనదగినవే. 'జప్తు' (1972) కథ వడ్డీ వ్యాపారుల దోపిడీ వలన

రైతు కూలీగా మారటాన్ని చిత్రించింది. 'నమ్ముకున్న నేల' కథావస్తువు రైతులు సిమెంటు ఫ్యాక్టరీలలో పనులకు పోతూ కూలీలుగా మారడం. 'గడ్డి' కథ రాయలసీమ కరువును చిత్రించినది. 'వాన కురిస్తే' 'దాపుడు కోక' 'పీర్ల చావిడి' మరెన్నో మంచి కథలున్నాయి.

'నా కథకేంగానీ, మన బాల్యాలూ, మన యౌవనాలు, మన పెళ్ళిళ్ళూ,కాపురాలు, వృద్ధాప్యాలు అన్నిటికీ మన ఆడవాళ్ళమే కర్తలైతే ఎంత బావుండు' అని స్త్రీ పక్షపాతిగా 'ఇచ్ఛాగ్ని' కథలో కేతు నిలుస్తారు. ఉన్నవ లక్ష్మీనారాయణ,లక్ష్మీబాయమ్మ గుంటూరులో నెలకొల్పిన శారదా నికేతనం కేంద్రంగా నడిచిన ఈ కథకు నా సంపాదకత్వంతో అరసం గుంటూరు జిల్లా శాఖ డిసెంబరు 2013లో వెలువరించిన 'గుంటూరు కథలు' సంకలనంలో చేర్చాను. గుంటూరులో అరసం నిర్వహించిన సభలో ఈ సంకలనాన్ని కేతు ఆవిష్కరించి మంచి ప్రసంగం చేశారు.

'మా అమ్మాయిలను ఇన్నాళ్ళూ కాపాడుతున్నావనుకుంటున్న మా రెక్కలు ఎంత బలహీనమైనవో ఆ క్షణంలో నాకు తెలిసి వచ్చింది.' అనే విభ్రాంతికరమైన ముగింపుతో ప్రశ్నార్థకంగా ముగిసిన కథ 'రెక్కలు' మగ మృగాల క్రూరత్వాన్ని కళ్ళకు కట్టిన కథానిక. 'ఇటీవల నేను చదివిన మంచి పుస్తకం' శీర్షికన 'ఇచ్ఛాగ్ని' కథా సంపుటిపై ఆకాశవాణి, విజయవాడ కేంద్రం నుంచి 8 అక్టోబరు 1997న ఉదయరేఖలులో సమీక్షా ప్రసంగం చేశాను. విశాలాంధ్ర దినపత్రికలో కూడా ప్రచురితం.

మతాల మధ్య మనుషుల మధ్య సద్భావనను ప్రతిపాదిస్తూ కేతు రాసిన మంచి కథ 'అమ్మవారి నవ్వు ఈ కథను మహమ్మద్ ఖదీర్‌బాబు ' మక్కా చంద్రుడు పేరిట తిరగరాసినప్పుడు 'విధ్వంస సాహిత్యాన్ని తిరస్కరిద్దాం' శీర్షికన విమర్శవ్యాసాన్ని (విశాలాంధ్ర దినపత్రిక 23 మార్చి,2003)న రాశాను. 'అలా రాయకుండా ఉండాల్సింది' అని ఖదీర్‌బాబు ఇప్పుడు చెప్పడం ఆహ్వానించతగిన పరిణామం. కేతు కథా సాహిత్యంపై పలువురు రచనలు చేశారు. అభిప్రాయాలు అందించారు.

'నమ్ముకున్న నేలను కమ్ముకున్న కేతు 'కథనం' శీర్షికన ఎ.బి.కె.ప్రసాద్ వార్త దినపత్రికలో సంపాదకీయం రాసి కేతు సాహిత్యానికి గౌరవం కల్పించారు. కేతు కథలు 'మన చుట్టూ వున్న సమాజం గురించి వీరావేశంగా అవేదనాత్మకంగా ఆలోచింపచేసే కథలు' అంటారు (తెలుగు కథకులు - కథనరీతులు రెండవ సంపుటం- ఫిబ్రవరి 2000) అభ్యుదయ రచయిత్రి డా.పి.సంజీవమ్మ.

'కథాశిల్పం' రచయిత వల్లంపాటి వెంకటసుబ్బయ్య కేతును 'రాయలసీమకు ప్రాతినిధ్య రచయిత' అనటమేకాక 'విశ్వనాథరెడ్డిగారు జీవితం తెలిసినవారు, జీవితాన్ని అధ్యయనం చేయడానికి తగిన దృక్పథం ఉన్నవారు' అని అభివర్ణించారు.. విశ్వనాథరెడ్డి కథలన్నీ సామాజిక స్వభావాల పట్ల, అంతరాల పట్ల, మనుషుల ప్రవర్తన వెనుక దాగున్న సాంఘిక సూత్రాలపట్ల ఒక కొత్త స్పృహను కలిగిస్తాయి' అంటారు. ప్రఖ్యాత రచయిత సింగమనేని నారాయణ (అరసం) గుంటూరుజిల్లా శాఖ జనవరి 2015లో 'ఈ తరం కోసం కథాస్రవంతి'శీర్షికన ప్రచురించిన కేతు విశ్వనాథరెడ్డి కథాసంపుటికి రాసిన సంపాదకీయంలో) వీరి సాహిత్య వ్యాస సంపుటి'దృష్టి' లో విలువైన వ్యాసాలున్నాయి. ఆ వ్యాసాలలో ఎంతో స్పష్టత, ఆధునికతలు వున్నాయి. ఉదాహరణకు ఒక వ్యాసం శీర్షిక 'పద్యానికి జన్మేగాని పునర్జన్మ లేదు' విశ్వనాథరెడ్డి కథలు అనేక సంకలనాలలో చేరాయి. అంగ్లం, రష్యన్, వివిధ భారతీయ భాషల్లోకి అనువాదమైనాయి. తమ సాహిత్యకృషికి గుర్తింపుగా ఎన్నో గౌరవాలను అందుకున్నారు. అందులో కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు, తెలుగు విశ్వవిద్యాలయం పురస్కారం,భారతీయ భాషా పరిషత్ పురస్కారం, (కలకత్తా) అజోవిభో జీవిత సాఫల్యపురస్కారం, వై .ఎస్.ఆర్ లైఫ్‌టైమ్ అవార్డు, తుమ్మల వెంకటరామయ్య బంగారు పతకం, అమరజీవి పులుపుల వెంకట శివయ్య సాహితీ పురస్కారం, రావిశాస్త్రి, గోపీచంద్ సాహిత్య పురస్కారాలు, మరెన్నో- 33 సంవత్సరాల అధ్యాపక వృత్తిలో ఉత్తమ ఉపాధ్యాయునిగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సత్కారాన్ని 1993లో వీరు స్వీకరించారు. డా.బి.ఆర్.అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం డైరెక్టర్‌గా సేవలందించి పదవీ విరమణ చేసిన తరువాత అభిమానులు అభినందన సంకలనం వెలువరించారు. కేతు వ్యక్తిత్వాన్ని , సాహిత్యాన్ని వివరిస్తూ, విశ్లేషిస్తూ వెలువడిన ప్రత్యేక సంచిక ఇది.

పదవీ విరమణ అనంతరం తనకెంతో ఇష్టమైన కడపకు చేరారు. అక్కడ సింగపూర్ టౌన్‌షిప్‌లో నిర్మించుకున్న నివాసానికి 'అపేక్ష' అని పేరు పెట్టుకున్నారు. ఈ పేరు చాలు కేతు స్వభావాన్ని మానసిక స్వరూపాన్ని తెలపటానికి. కేతుగారికీ నాకూ 45 సంవత్సరాల సుదీర్ఘ సాన్నిహిత్యం, అరసంలో వారి మార్గదర్శకత్వంలో నడిచిన కార్యకర్తను. నేను రాసిన 'గుంటూరు సీమ సాహిత్య చరిత్ర'(జనవరి 2020)కు, 'స్థానిక చరిత్ర శోధనకు ఆలంబన' శీర్షికన ప్రామాణికమైన ముందుమాట రాశారు. వారు మా కుటుంబానికీ హితులే. వారి శ్రీమతి పద్మావతి గారు నా పట్ల పుత్రవాత్సల్యాన్ని చూపేవారు.

'మంచి కథకుడు కావాలనుకునేవారెవ్వరైనా కథలు రాసే ముందైనా, రాసే క్రమంలోనైనా ఎట్లా రాయాలో అనే ప్రశ్నకు నిరంతరం సమాధానం వెతుక్కుంటూ పోవడం రాత గుణాన్ని పెంచుతుంది' (శార్వరి సంకలనకర్తగా 1992లో వెలువడిన 'కథలెలా రాస్తారు' సంకలనంలోని 'కథారచయితలో ఆసక్తీ, ఆర్తీ అసంతృప్తీ' వ్యాసం నుంచి) ఇది డా. కేతు విశ్వనాథరెడ్డి ముఖ్యంగా యువ కథారచయితలకు ఇచ్చిన సందేశం.

- వ్యాసకర్త అరసం జాతీయ కార్యదర్శి

వారసత్వ సంపద

పి. శివరామకృష్ణ 'శక్తి'
94414 27977

# ఆధిపత్యం చలాయించే సిద్ధాంతాలు, కవిత్వాలు, పౌర సంఘాలు

తొలితరం మానవ శాస్త్రవేత్త మోర్గన్ ancient society కి మహీధర అనువాదం 'పురాతన సమాజం'మోర్గన్‌ను అనువదించటంతో సరిపెట్టక, ఆయన పద్ధతిని తెలుగు సమాజానికి అన్వయిస్తూ 1959లో సందేశంలో రాసిన రెండు వ్యాసాలు, వర్ణవ్యవస్థ పరిణామాలు, వివాహ వ్యవస్థ పరిణామాలు.

ఈనాడు మనం ఊహలలో కూడా భరించలేని వైవాహిక వ్యవస్థ ఒకనాడు మనకు ఉండేదని మన బంధుత్వపిలుపులు సూచిస్తున్నాయి' అంటూ మహీధర




ఉదహరించిన విషయాలే 'సోషల్ ఆంత్రోపాలజీ పట్ల ఆసక్తి పెంచుకున్న రాంభట్ల, 'వేదభూమి'లో వైదిక సమాజానికి విస్తరిస్తాడు. మొదట్లో ఈ సంస్కృతికి పెట్టిన ఇండోజర్మానిక పేరును,సంస్కృతాధ్యయనం చేసిన రష్యన్లు వ్యతిరేకించినందున, వాళ్ళను కలుపుకుని ఇండో యూరోపియన్ భాషాకుటుంబం అవతరించిన క్రమం వివరించారు.(పుట 16).

'తెలుగు గోష్టి' ప్రచురించిన ఈ ప్రసంగ వ్యాస సంపుటి ముందుమాటలో ప్రముఖ చరిత్రకారుడు బి.యన్.శాస్త్రి పాశ్చాత్య ఇతిహాస కారుని (మోర్గన్) ప్రకారము శావేజి-ప్రథమ,ద్వితీయ,తృతీయ బర్బర యుగములుగా విభజన చేసుకుని విషయ పరిశీలన చేసిరి' (పుట12). అంటారు.

'59 నాటికే మానవ శాస్త్రవేత్త లేవిస్ట్రాస్, మానవుని ప్రతిభా వ్యుత్పత్తులలో తరతమ భేదాలు లేవని 'savage mind' రాశారు. రష్యన్ జానపద సాహిత్య లాక్షణికుడు ప్రాప్ Morphology of Folktales (1920) యూరోప్‌లో 1960లలో అనువాదంకాగానే, ఆ విశ్లేషణను మొత్తం సంస్కృతికి అన్వయిస్తూ మానవ శాస్త్రజ్ఞులు అధ్యయనంలో వేగం పెంచారు.మార్క్సిస్ట్ దృక్పథంలో చోటు చేసుకున్న అవక తవకలను సరిదిద్దారు. తన లోటుపాట్లను సరిదిద్దుకునే శక్తి సమాజాలకు ఉన్నదనే నిర్మాణదృక్పథంతో కాక 'పరస్పరం సంఘర్షించిన శక్తులలో చరిత్ర పుట్టెను' అన్న మార్క్స్ తీర్పును మాత్రం అంగీకరించారు.

Though most of Marx writings focus on capitalist societies, he also produced broad evolutionary scheme of societal development throughout the world .Basing some of his notions on Henry Morgan's evolutionary thought, Marx theorized that society has evolved through various stages ; the tribal, the Asiatic ,the feudal, and, finally the capitalist stage....these societies would then proceed to the socialist and communist stage... It must be understood that current Marxist anthropologists do not accept the unlineal evolution suggested by Marx. None the less, unlike functionalists, who assumed that societies institutions were balancing conflicting interests, the Marxist Anthropologists have demonstrated that conflict is an inherent aspect of human behavior and culture'. ( Anthropology. A Global perspective .Raymond Scupin. Prentice Hall. 2004. page 311)

ఈ క్రమం తెలుగు నాట, రష్యాలో తర్ఫీదు పొందిన మార్క్సిస్ట్ మహోపాధ్యాయులు రాంభట్ల వగైరాలు విస్మరించి, కాలం చెల్లిన సిద్ధాంతాలనే అన్వయించారు.

అయితే వామపక్షాలు చెప్పే Proletariat తో కార్యరంగంలోకి దిగిన గాందేయులూ ఉన్నారు.'ఆంధ్ర శ్రామిక ధర్మ రాజ్య సభ' ద్వారా సీతారామరాజు బలిదానం తరువాత కుంగిపోయిన మన్య ప్రజలను కూడగట్టి, మాడుగులలో సభ జరిపి'మినుములూరు ఘాట్ రోడ్ రావాలి.ముఠా దారికట్టు పోవాలి.మిత్తి కోసం గొత్తి పని రద్దు చేయాలి' అని పిలుపు నిచ్చినవాడు మందేశ్వర శర్మ.

కానీ సగటు పాఠకులలో, ముఖ్యంగా గిరిజన సమాజాలపట్ల, ఈ రాతల వల్ల పెరిగిన'వారింకా సావెజి దశ'లో ('బృందంలోని స్త్రీలందరూ తల్లులు, పురుషులందరూ బిడ్డలు ,భర్తలు. ఇదీ నాటి గణ ధర్మం వేదభూమి పుట 32. బర్బరదశలో గ్రామపెద్దకు పెళ్ళయిన పిల్ల మీద తొలి'రేయిహక్కు' ఉండేది వేదభూమి పుట 57) ఉన్నారు వంటి అనేక అపోహలు, అవాకులు చవాకులూ వాగటానికి దారి తీసింది.

**లైంగిక కమ్యూనిజం.**

'వివాహ వ్యవస్థ పేరిట ప్రపంచ వ్యాప్తంగా ఆదివాసులను తీవ్రమైన నిందలకు గురిచేసారు.మిధ్యామేధావులు చదువరులను ఆకట్టుకోవాలనే చౌకబారు ఆలోచనతో నిరాధారమైన పొంతనలేని ఆరోపణలతో తెగల వివాహ వ్యవస్థ పై వ్యంగ్య విమర్శలు గుప్పించారు. ఈ మేధావుల ఆలోచన ప్రకారం ఆదివాసులలో అసలు వివాహ వ్యవస్థ అనేదే ఉనికిలో లేదు.ఈ వ్యవస్థ ఉనికిలో లేకపోవటాన్ని వీరు లైంగిక కమ్యూనిజం (Sexual communism ) గా పరిగణించారు. అయితే ప్రపంచంలోని ఏ ప్రాంతంలో కూడా ఈ

కల్పిత రాతలకు మద్దతునిచ్చే సమాచారం సేకరించక పోవటం గమనార్హం. భారతీయ గిరిజనులు.(నదీమ్, హాస్నైన్, ఓరియంట్ లాంగ్మన్.పుట 37). అనాలోచితమైన అతిశయోక్తితో కూడుకున్న కట్టుకథలు సృష్టించి రాత్రికి రాత్రే కీర్తి గడించాలనే రచయితలు పాత్రికేయులు, తెగల జీవన విధానానికి సంబంధించి నిస్సిగ్గుగా కట్టుకథలల్లిన మరో అంశం వారి వివాహ పూర్వ, వివాహేతర లైంగిక సంబంధాలు.

ఊహాగానాలు చేయటం రచయితల హక్కు అయితే మోసపూరితమైన మాటలపై దాడిచేసి నిష్పక్షపాత అధ్యయనం చేయవలసిన బాధ్యత శాస్త్రవేత్తలపై ఉంది.(పుట 46)

**'ఎల్లలోకము ఒక్క యిల్లై లో కనిపించని మన గిరిజనుల గొంతు.**

ఇటీవల 'ఎల్లలోకము ఒక్క యిల్లై (ఎమెస్కో) కవితా, వ్యాస సంకలనం తెచ్చిన చిన వీరభద్రుడు, ఆదిమ జాతుల కవిత్వంతో మొదలు పెట్టారు.ఆయన ముందుమాట రాసినవాటిలో 'గిరిగింజ గిరిమల్లెలు అడవి చెంచుల పాటలుకూడా ఒకటి.న్యూజిలాండ్ మొదలైన వివిధ ఖండాలలో, నీలగిరి తోడా తెగవారి పాటలను ఆయన ఆంగ్లంనుండి అనువదించి ఉదాహరించారుగాని ఒక్క గిరిజనతెగ ఇక్కడి పాట, కథ, ఎప్పుడూ ఇవ్వలేదు. ఏ ప్రముఖ ప్రచురణ కర్తో ఆంగ్లంలో ప్రచురిస్తే, దాన్ని అనువదించి ఇచ్చే వారేమో! అయితే మన మార్క్సిస్ట్ పండితులవలెకాక వీరభద్రుడు గిరిజన ప్రాంతంలోనే పుట్టారు. గిరిజన సంక్షేమశాఖలో పనిచేసారు. అక్కడి రచయితలతో మమేకమైనారు. ఆయన తీర్చిదిద్దిన సంతోష చంద్రశాలలో (ఆశ్రమ పాఠశాల) చదివి ఉపాధ్యాయుడైన వర్ధమాన గిరిజన రచయిత మల్లిపురం జగదీశ్ ఇంతకాలానికి కూడా చెప్పుకోదగ్గ గిరిజన రచయిత రాలేదేమని నేడు నిలదీస్తున్నాడు! (బహుళ. పర్స్పెక్టివ్స్) .

దానికి సమాధానం: 'ఎన్ని ఇబ్బందులున్నా బడి మానొద్దు బుద్ధిగా చదువుకొండి' అంటూ, అప్పుడు వీరభద్రుడు ముందుమాటతో వచ్చిన 'బడి కత'లలోనేఉంది (సహృదయునికి ప్రేమలేఖ పుట 78). వాటిలో మల్లిపురం రాసిన మొదటి కథలో: సవర పిల్లాడు సన్నాయి, బడి మానేస్తాడు. అతన్ని వెతుక్కుంటూ వెళ్ళిన మాస్టారు, అతనికి నచ్చచెప్పి బడికి తీసుకొస్తాడు.

సవరల సన్నాయి షెహనాయికి మాతృక, వాళ్ళు పండుగలో దేవతలను ఆహ్వానిస్తూ గోడమీద గీసే చిత్రాలు, ఇడిసింగ్, చిత్రకళకు తొలి పాఠాలు, అని పిల్లోడికోసం గ్రామం వెళ్ళిన మాస్టారు తెలుసుకుంటాడు. ఆ పిల్లాడికి చదువుతో పాటు సన్నాయి, బొమ్మలు గీయటంకూడా నేర్పిస్తాడు. అతడు మరో బిస్మిల్లాఖాన్, పికాసోగా ఎదుగుతాడు అని కథ మలుపు తిప్పితే, అసలైన సవరకథ అయ్యేది. అలాకాలేదు. ప్రభుత్వం ఆశించినట్లు, ఆ ఆశ్రమపాఠశాల రాంకులు సాధించినందుకు సంబరపడిపోయారు (కొన్ని కలలు, మెలకువలు) అటువంటి పిల్లలు చేరిన జూనియర్ కళాశాల ఉపాధ్యాయుడు 'రాంకులు వచ్చి ఏం లాభం! పిల్లల మెదళ్ళు మూసుకు పోయాయి. వాళ్ళు ప్రశ్నించటం మరిచిపోయారు అని వాపోతాడు.(కారేపల్లి కబుర్లు).బడిలో లాగే వారి వారసత్వానికి అంటుకట్టకుండా అభివృద్ధిని అధికార దర్పంతో 'స్కేల్ అప్' చేసే ప్రయత్నాలు 'Farmers knowledge is defined as their awareness of department recomended practices' ( Jenny Springer) . "Rarely there are questions and cross questions.Rarely fruitfull dailogues' (Sitakant Mahapatra) ('ఆడి పాడవోయి ప్రగతి దారులా 'అమ్మనుడి' మార్చి 23), కొనసాగుతూ వచ్చాయి. మల్లిపురం గమనించినట్లు, ఆఫీసుల ముందు క్యూకట్టే బిచ్చగాళ్ళ తరాన్ని తయారు చేసాయి.

గిరిజనులను గూర్చిన మనలో అపోహలు తొలగించి, వారిలో ఆలోచన పెంచవలసిన తరుణంలో 'నా, మీ, ప్రపంచం- మన కవిత్వం' అంటూ రాసే ఇటువంటి శుష్కప్రియాలను, ఆఫ్రికన్ రచయిత గూగి దియంగో, వీళ్ళు 'గిలికింది వట్టి యాత్రా గైడ్లు మాత్రమేనని ఈసడిస్తాడు. బందీ. స్వేచ్ఛాసాహితి).

అధికారులు, కవులు కలిసి గిరిజనుడిని బలహీనుడిని చేసినా, 'దుర్బలస్య బలం రాజా' అన్నట్లు కేంద్ర సాహిత్య అకాడమి 'తెలుగు గిరిజన సాహిత్యం' ప్రచురించింది. ప్రాప్ రచనలు 40 ఏండ్ల తరువాత యూరోప్‌లో అనువాదమైనట్లు, ఏదో ఒకనాటికి ఇవీ తమ ఏడుతరాలను వెతుక్కునే వాళ్ళకు దారి చూపగలవు. 'కాలోహ్యయం నిరవధీ, విపులాచ పృథ్వీ'

ప్రపంచ వ్యవసాయాభివృద్ధి సంస్థనుండి అప్పుతెచ్చుకుని పట్టించుకోని, ఒకనాటి కోరాపుట్,(నేడు ముంచెంగిపుట్ పెదబయలు,అరకు మండలాల్లో) సంప్రదాయవ్యవసాయాన్ని, ఇప్పుడు ప్రపంచ ఆహార సంస్థ, ప్రపంచంలోని 12 వ్యవసాయ జీవవైవిధ్య వారసత్వకేంద్రాల్లో ఒకటిగా గుర్తించింది

**భూ సమస్యలలో రాజకీయాలు.**

**కన్నబిరాన్ చెప్పిన కథ**

పులికాట్ సరస్సు అభయారణ్యం. దానిలో సున్నం గనులు తవ్వకోటానికి ముఖ్యమంత్రిగా జనార్దనరెడ్డి ఇచ్చిన లీజ్ రద్దు చేయించటానికి కన్నబిరాన్ కోర్టులో కేసు వేసారు. దీనికి రాజకీయంగా మద్దతు సంపాయించటానికి ఆయన కమ్యూనిస్ట్ నాయకుడు సుందరయ్యగారితో ఈ విషయం ప్రస్తావించారు. ఆయన ఆ వాస్తవాలను శాసన సభలో లేవనెత్తుతారని ఆశించారు. అదేమీ జరగలేదు. తరువాత ఆ విషయం ఆయనను అడిగితే 'ఆ సరస్సు లీజుకు పొందదలచిన కొందరు స్మగ్లర్లు, ఈ వివాదం లేవనెత్తుతున్నట్టు తాను విన్నానని సుందరయ్య అన్నారట (24గంటలు 401) నోం చామ్స్కీ అన్నట్లు సమస్యను సమస్యగా చూడకుండా రాజకీయకోణంతో చూసే దృష్టికి ఇది ఉదాహరణ.

**కన్నబిరాన్ చెప్పని కథ**

అయితే, కన్నబిరాన్ రాయకపోయినా ఆయన చేసిన గిరిజన ప్రాంతానికి చెందిన మరో ప్రసిద్ధమైన కేసును పేర్కొనక తప్పదు. కమ్యూనిస్టుల ప్రాబల్యంగల ఖమ్మం జిల్లా పరిషత్, చిన్న రైతులను 1/70నుండి మినహాయించాలని తీర్మానం చేసింది. ప్రభుత్వం జీ వో జారీ చేసింది.

స్వర్గీయ ఐఏఎస్ అధికారి యుగంధర్ పనుపున కన్నబిరాన్ కోర్టులో కొట్టేయించారు. అప్పటికే ఉద్యమాల ఖిల్లా వరంగల్ జిల్లాలో 23 గ్రామాలు షెడ్యూల్ జాబితాలో లేవని కోర్టు కొట్టేసింది. దాన్ని ఎవరూ అడ్డుకోలేదు. పైగా గిరిజనేతర జనాభా అధికంగా ఉన్న గ్రామాలకు 1/70 వర్తించదని 1987 నుండి స్టేలు తేవటం, వరంగల్ జిల్లా గూడూరు మండలంనుండే మొదలైంది. ఈ స్టే లు తెస్తుంది సెంటర్ ఫర్ డెమోక్రసీ అనే పౌరహక్కుల సంఘంలో న్యాయవాది ప్రతాపరెడ్డి. ఈ స్టేలు 32 గ్రామాలకు పరంపరగా వస్తుంటే 'శక్తి' 92లో పశ్చిమగోదావరి స్టే లో ఇంప్లీడ్ అయి అడ్డుకుంది.

ప్రభుత్వం/అధికారుల గుప్పిట్లో ఉండే భూమి రికార్డులు ప్రజలకు పంచిపెట్టి, కబ్జాదారుల తనిఖీ బహిరంగంగా చేపట్టాలని శక్తి ఉద్యమం నిర్మించింది. రాజకీయాలు వల్లిస్తూ, ధర్నా పోరాటాలు, రాజీలు చేసే సంఘాలకు ఈ రికార్డులు ఆధారంగా పోరాటం అంతుపట్టలేదు. విచారణ ముగిసి తీర్పు రానున్న దశలో నాటి మిత్రపక్షం సిపిఎం వారు కన్నబిరాన్ ద్వారా ఇంప్లీడ్ అయినారు. స్టే తొలగిస్తూ, గిరిజనేతరులు గవర్నర్‌కు దాఖలు చేసుకున్న విన్నపం పరిష్కరించే వరకు భూమిలో ఉండొచ్చని కోర్టు తీర్పు ఇచ్చింది. ప్రభుత్వం 'శక్తి'తో సంప్రదించి రికార్డుల పంపకానికి విధి విధానాలు రూపొందించింది. వాటిని కోర్టుముందు దాఖలు చేసింది. కోర్టు, తమ ఉత్తర్వుగా వాటిని జారీ చేసింది.

ఈ లోగా సిపిఎం వారు గిరిజనేతరుల పొలాల జోలికి పోకుండా రెడ్డి గణపవరంలో చేసుకున్న ఒప్పందానికి జాయింట్ కలెక్టర్ ఆమోద ముద్ర వేసారు. శాసన సభాసంఘం ఇది మోడల్ గా ప్రశంసించింది. దర్భగూడెంలో గిరిజనుల కబ్జాలో ఉన్న భూములకు, వేరొక వర్గం గిరిజనులు పట్టాలు తెచ్చుకున్నారు. వాటిని భూమిలో ఉన్నవారు రద్దు చేయించారు. గిరిజనుల మధ్య తగువు స్వయంగా వెళ్లి సర్దుబాటు చేసేది బదులు, బాలగోపాల్ పట్టా రద్దైన వారి తరపున వకాలతు పుచ్చుకున్నాడు. గిరిజనేతరులు వారి అనుయాయులు, స్టేలు, పోలీసు, రక్షణ కోసం ఉత్తర్వులు తెచ్చుకుంటూ రెచ్చిపోయి బెదిరించసాగారు.

జాతీయ మానవహక్కుల కమిషన్‌కు 'శక్తి' పంపిన ఫిర్యాదును శంకరన్ సలహాకోసం పంపింది. కోర్టు తీర్పు పాటించి కబ్జాదారుల తనిఖీ చేపట్టాలని, అడ్డంకులు కలిగించే వారిని అత్యాచార నిరోధక చట్టంకింద అదుపులోకి తీసుకోవాలని శంకరన్ సలహా ఇచ్చారు. సిపిఎం ఫిర్యాదు మేరకు పర్యటించిన మాజీ ఐఏఎస్ అధికారి కె.ఆర్. వేణుగోపాల్, రెడ్డిగణపవరంలో అంతా బాగుందని, పోలవరం యమ్మార్వో చాలా బాగా మానేజ్ చేస్తున్నారని, శక్తి వాళ్ళు సమస్యలు సృష్టిస్తున్నారని కలెక్టర్ చెప్పినట్లు కమిషన్‌కు రిపోర్ట్ ఇచ్చారు. ఈ దశలో భూముల అప్పగింతను ఆలస్యం చేయటం అత్యాచార నిరోధకచట్టం కిందికి వస్తుందని 'శక్తి' హైకోర్టులో కేసు వేసింది. కోర్టు, భూ పంపిణీ కొంత కాలం వేగవంతం చేసింది. ఈ లిటిగేషన్ మొదలైన వరంగల్ జిల్లాలో స్టే లు తొలగిన తరువాత ఏమైంది, పట్టించుకున్నవాడే లేడు. ఇలా వామపక్షాలు, వివిధసంఘాలు, పౌరహక్కుల వేదికలు భూమికోసం చేసిన గిరిజనుల ఉద్యమాలను నీరుగార్చాయి. జీలుగుమిల్లి మండలంలో'శక్తి' ఉద్యమాన్ని అధ్యయనం చేసిన కల్పనా కన్నబిరాన్, కన్నబిరాన్ ఇంప్లీడ్ అయిన సంగతి పేర్కొన్నారు. ఇటివలే వారు కన్నబిరాన్ '24 గంటలు' ఆంగ్లం అనువాదం తెచ్చారు.

**ఇలా సిద్ధాంతులు, సాహిత్యగాళ్ళు, సంఘాలు: గిరిజనాన్ని బిచ్చగాళ్ళను చేయటంలో తలోచెయ్యి వేశారు.**

ఇంతలో పోలవరం ప్రాజెక్ట్ వచ్చింది. ముంపు గ్రామాలను బుల్ దోజర్లతో నేలమట్టం చేసి నిర్వాసితులను బలవంతంగా తరలించసాగింది. శక్తి ఈ బలవంతపు తొలగింపుమీద స్టే తెచ్చింది. గిరిజనేతరులు అధికారులు కుమ్మక్కై గిరిజనుల పొలాలను పునరావాసంకింద చూపించి పరిహారం పొందారు. దీనిమీద విచారణ సాగుతుంది.

**కాళ్ళతో తొక్కిన కొద్దీ మట్టి దుమ్ముగా మారుతుంది. సుడిగాలిలో చెలరేగుతుంది.**

**'అరచేతిని అడ్డుపెట్టి సూర్యకాంతి నాపలేరు'.** (అ)

---

**43వ పుట తరువాయి.......**

కనిపిస్తుందని ఆచార్య యస్ వి జోగారావు వ్రాశారు. ధగరి అంటహిందీలో కులట! మరాఠీ భాషలో దగరా లేదా దగిరి అంటే బజారుస్త్రీ! తరువాతి కాలంలో రంకుమొగుడు (ఉపభర్త) అని పురుష వాచకంగా దీన్ని వాడటం మొదలు పెట్టారు. అన్యపురుషుడి వలన కలిగిన సంతానాన్ని ధగిడీ అనసాగారు. కానీ, ఆధునిక యుగంలో ఇదే పదం అర్థవిపరిణామం పొందింది. పట్టినపట్టు విడవకుండా గట్టిగా ఎదిరించటానికి వాడటం అలవాటయ్యింది.

నిరసన తెలియజేయటం అనే మన హక్కుని గుర్తు చేసేదిగా ఆంధ్రపత్రిక లాంటి స్వాతంత్రోద్యమ పత్రికలు ఈ పదాన్ని మార్చటం గొప్ప విషయం. ఇలాంటిమార్పులు అవసరం కూడా! తెలుగు వ్యుత్పత్తి కోశంలో ధగిడి పదానికి 'అడ్డంగా కూర్చోవటం' అనే అర్థం కూడా ఇచ్చారు. ధగిడి పదం స్త్రీలనో పండితులనో కించపరిచే అర్థంలో ఒక తిట్టుగా కాకుండా ఇలా ఎదిరించే పదంగా వాడకంలోకి తెచ్చుకోవచ్చని అర్థం అవుతోంది. కొన్ని భాషా పదాలను ఇలా గౌరవప్రదమైనవిగా మార్చుకోవటం వాటి పరిరక్షణ కోసమే!

వ్యవసాయ చట్టాలను రద్దు చేయాలని ఢిల్లీలో రైతులు జరిపిన చారిత్రాత్మక ఆందోళన 'ధగిడిసమ్మె' అనే పదం సూటిగా సరిపోతుంది.

ఏలికల్లో గాంధారితనం పెరిగినప్పుడు ప్రజల్లో ధగిడీతనం పెరక్క తప్పదు. (అ)

- **తెలుగువాడిగా పుట్టినందుకు గర్వించు**
- **తెలుగులో మాట్లాడడం నీ జన్మహక్కు**

టి.వి.రామకృష్ణ
9951441131

# బాలసాహిత్యం - భాష



'ఏ భాషైనా నేర్చుకొనే మూలసూత్రం ఒకటే. సాధారణంగా ఊహ తెలిసే కొద్దీ భాష నేర్చుకుంటారనేది చాలామంది భావన. కానీ భాష నేర్చుకొనేందుకు అవసరమైన ప్రాథమిక సూత్రాలు జన్మతః నిక్షిప్తమై ఉంటాయి. ఏ పదాలనయితే మెదడు త్వరగా, స్పష్టంగా గ్రహించడానికి అవకాశం ఉంటుందో వాటికి అనుగుణంగానే భాషలు రూపొందుతాయి. '- ఐరిస్ బెరెంట్ -ఇజ్రాయలీ -అమెరికన్ కాగ్నిటివ్ సైకాలజిస్ట్.

పై పరిశోధనను బట్టి మాతృభాషకు ఎంత ప్రాధాన్యత ఇవ్వాలో మనం అర్థం చేసుకోవచ్చు. 'ఐరిస్ బెరెంట్' మానవుడి జీవన పరిణామంలో భాష ఏర్పడిన తీరు, దాని వాడుక మీద కొన్ని దశాబ్దాల పాటు పరిశోధనలు చేశారు. అలాగే భాష నేర్చుకొనే విధానంలో పిల్లలు అనుసరించే విధానాల మీద కూడా ఆమె అనేక ప్రయోగాలు చేశారు. రకరకాల శబ్దాలు విన్నప్పుడు పసిపిల్లల మెదడు ఎలా స్పందిస్తుందో 'నియర్ ఇన్‌ఫ్రారెడ్ స్పెక్ట్రోస్కోపి' ద్వారా పరిశీలించారు. కొన్ని క్లిష్టమైన పదాలను మెదడు స్వీకరించేందుకు ఇష్టపడకపోవడం గమనించారు. కాబట్టి పిల్లలకు భాష పట్టించడంలో మనం ఎంత జాగరూకతతో ఉండాలో ఈ విషయాన్ని బట్టి మనకు అర్థం అవుతుంది.

పిల్లల మెదడు చాలా చురుకుగా ఉంటుందని, అలాగే రెట్టింపు వేగంతో నేర్చుకొనేందుకు అనుకూలంగా ఉంటుందని అనేక పరిశోధనలలో తేలింది. కాబట్టి చిన్నతనంలోనే భాషా సామర్థ్యం పెంపొందించడం చాలా అవసరం. తల్లిదండ్రులు తమ మాతృ భాషలో మాట్లాడే పదాలను పిల్లలు అనుకరిస్తారు, అలాగే నేర్చుకోవడానికి ప్రయత్నిస్తారు. అప్పుడే భాష నేర్చుకొనే పిల్లల భాష వేరుగా ఉంటుంది. వాళ్ళకు తేలికగా పలకడానికి ఉండే పదాలనే పలుకుతారు. అమ్మ, అప్ప... లాంటి పదాలతో మాట్లాడుతారు. పిల్లలు భాషను క్రమంగా నేర్చుకోవడానికి పిల్లలతో నిరంతరం సంభాషించడం చాలా అవసరం. పిల్లల భాష అతి తేలికగా, సరళంగా, క్లుప్తంగా లయతో కూడి ఉండాలి. కాబట్టి భాష విషయానికి వచ్చేసరికి బాల్యసాహిత్యానికి నిర్వచనం ఈ క్రింది విధంగా చెప్పుకోవచ్చు.

'అతి తేలికైన పదాలతో, వాక్యాలతో, సరళంగా, క్లుప్తంగా, లయతో ఉండే భాషను' మనం బాల సాహిత్యంగా చెప్పుకోవచ్చు.

ఇప్పుడు సాహిత్యం వల్ల కలిగే కొన్ని లాభాలను గురించి కొంత తెలుసుకుందాం. సాహిత్య పఠనం వల్ల వత్తిడి తగ్గుతుందని అమెరికాలోని స్టాన్ ఫోర్డ్ విశ్వవిద్యాలయ శాస్త్రవేత్తల బృందం కనుగొనింది. సంగీతం వినటం వల్ల 61 శాతం, ఒక కప్పు టీ తాగటం వల్ల 54 శాతం, నడవటంవల్ల 48 శాతం వరకు వత్తిడి తగ్గుతున్నదని కనుగొన్నారు. అయితే సాహిత్య పఠనం వల్ల వాటికంటే అధికంగా దాదాపు 70 శాతం వత్తిడి తగ్గుతున్నదని పరిశోధనాత్మకంగా రుజువు చేశారు. అంతేకాదు, చదవటం వల్ల హృదయ స్పందన రేటు కూడా మారిందని కనుగొన్నారు.

అదే విశ్వవిద్యాలయం వారు సాహిత్య పఠనం వల్ల అనూహ్యంగా మెదడుకు రక్తం సరఫరా పెరిగిందని కనుగొన్నారు. యమ్. ఆర్. ఐ. ద్వారా పరిశీలించినపుడు ముఖ్యంగా సాహిత్యానికి సంబంధించిన పుస్తకాలను చదివినప్పుడు మెదడుకు రక్త ప్రసరణ ఎక్కువగా జరిగినట్లు కనుగొన్నారు.

ఇంకొక అధ్యయనంలో బర్నీ, టొరంటో విశ్వవిద్యాలయాలలో జరిగిన పరిశోధనలలో బాగా ఎక్కువగా చదివే వాళ్ళ మెదడు చురుకుగా ఉండటం, అసలు పుస్తక పఠనం లేని వాళ్ళకంటే తెలివైనవారుగా ఉండటం గమనించారు.

యేల్ విశ్వవిద్యాలయం వారు 12 సంవత్సరాల పాటు దాదాపు నాలుగు వేల మందితో ఒక అధ్యయనం చేశారు. ఈ అధ్యయనంలో పుస్తక పఠనం ఉన్న వారిలో 23 నెలల ఆయుర్దాయం పెరగటం, 20 శాతం మరణ రేటు తగ్గటం వారి అధ్యయనంలో తేలింది. కాబట్టి పిల్లలకు చిన్న వయసునుంచే కథలు, గేయాలు, పాటలు పరిచయం చేయడం ఎంత అవసరమో మనం అర్థం చేసుకోవచ్చు.

0-16 మధ్య వయసును మనం బాల్య దశగా పరిగణిస్తాం. పిల్లల వయసు పెరిగే కొద్దీ వాళ్ళ అభిరుచులు, భాషా నైపుణ్యం కూడా పెరుగుతుంది. కాబట్టి బాలసాహిత్య రచనలు వాళ్ళ వయసులను అనుసరించి ఉండాలి. అలాగే 13-18 వయసులను యుక్త వయసుగా పరిగణిస్తామ. బాల సాహిత్యంలో బొమ్మల కథలు, చిన్న కథలు, చిన్న నవల, నాటిక, జీవిత చరిత్రలు, గేయాలు, పాటలు అనే భాషా ప్రక్రియలు ఉన్నాయి. ఏ వయసుల వారికి ఎటువంటి సాహిత్యం, సాహిత్య ప్రక్రియలు అందించాలో సమగ్రంగా పరిశోధనలు జరిగాయి.

అసలు బాల సాహిత్యం ప్రత్యేకంగా ఎందుకుండాలి? ఈ ప్రశ్న తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు, గ్రంథాలయ నిర్వాహకులు, బాల సాహిత్య రచయితలు ప్రశ్నించుకోవాల్సిన అవసరం ఉంది. పెద్దల సాహిత్య పరిధి చాలా పెద్దది. పెద్దల సాహిత్యంలో ఎన్నో నూతన ప్రక్రియలు, పరిశోధనలు జరిగాయి. మన దేశంలో 40-50 దశకంలో బాల్యసాహిత్యానికి ఒక ప్రత్యేక స్థానం ఏర్పడింది. మన తెలుగు బాలసాహిత్యంలో కూడా అదే సమయంలో ఒక ప్రత్యేక విభాగంగా సంతరించుకోంది.

బాలసాహిత్యంలో 'సైన్స్ ఫిక్షన్', 'ఫాంటసీ' లాంటి సాహిత్య

ప్రక్రియలు ఉన్నాయి. అలాగే జానపద కథలు బాల సాహిత్యంలో భాగంగా కొనసాగుతున్నాయి. హాస్య రచనలు, నికార్టూన్లు రచనలు కూడా బాల సాహిత్యంలో చలామణి అవుతున్నాయి. జంతువుల సంభాషణతో కథలు బాల సాహిత్యంలో విరివిగా వున్నాయి. పంచతంత్ర నుంచి ఆ పరంపర ఇప్పటికీ కొనసాగుతున్నది. ఇంత వైవిధ్యమున్న బాల్యసాహిత్యాన్ని మన తెలుగులో మాత్రం జానపద కథలు, నీతి కథల పరిధిలోనే ఉంచేశాం. దీనికి ముఖ్య కారకులు తెలుగు బాలసాహిత్య రచయితలేనని చెప్పాలి. బాలసాహిత్యం మీద వీరికి పూర్తి స్థాయి అవగాహన, పరిశోధన లేకపోవడం ముఖ్య కారణం. ప్రస్తుత పిల్లల అభిరుచులు, ఆసక్తుల మీద సరైన పరిశోధనలు లేకపోవడం. అనేక మంది పాశ్చాత్య బాలసాహిత్య రచయితలు పిల్లలతో మమేకమై వారి మనస్తత్వాన్ని పరిశీలించడం, చదవడంలో వారి అభిరుచులను తెలుసుకుంటూ వారి బాలసాహిత్య రచనలను కొనసాగిస్తారు.

మనం ముందు తెలిసికొన్నట్లు పిల్లలు తరువాతి తరానికి పెద్దలు. పిల్లలు మంచి పౌరులుగా ఎదగడానికి సాహిత్యం ఒక అమూల్య సాధనం. సాహిత్య ప్రభావం వారి భావి జీవితాల మీద తప్పక ప్రభావాన్ని చూపుతుందనడంలో ఎటువంటి సందేహం లేదు. ఎంతోమంది గొప్ప వ్యక్తులు ఫలాన రచన తమ మీద ప్రభావం చూపిందని చెపుతూ ఉంటారు. కాబట్టి బాల్యసాహిత్యాన్ని ఒక ప్రత్యేక విభాగం క్రింద ఉంచి, విస్తృతమైన పరిశోధనలు జరపాల్సిన అవసరం ఉంది.బాల సాహిత్య రచయితలు కూడా బాల సాహిత్య రచనల మీద విస్తృత పరిశోధనలు జరపాల్సి ఉంది. వైవిధ్యమైన రచనా ప్రక్రియలకు చోటు కల్పించాల్సిన అవసరం ఉంది.

సైన్స్‌కు సంబంధించిన విభాగంలో తెలుగులో బాలసాహిత్య రచనలు చాలా తక్కువ సంఖ్యలో ఉన్నాయి. 13-16 సం. వయసు పిల్లలకు సంబంధించిన పుస్తకాలసంఖ్య కూడా చాలా తక్కువగా ఉంది. అలాగే 'సైన్స్ ఫిక్షన్', 'ఫాంటసీ' కి సంబంధించిన కథలు, నవలలు అతి తక్కువ సంఖ్యలో ఉన్నాయి. ఈ వయసు పిల్లలకు చిన్న నవలల సంఖ్య కూడా చాలా తక్కువగా ఉన్నాయి. ఈ విభాగంలో అనువాద కథలు, నవలలు ఉన్నా వాటి సంఖ్య కూడా తక్కువే.

'మీకు కావల్సినంత ధనం ఉండవచ్చు, మీ ఖజానాలో నా కంటే ఎక్కువ బంగారం ఉండవచ్చు, అయితే నాకు పుస్తకాలను చదివి పెట్టే అమ్మ మాత్రం ఉంది' అన్నారు స్టిక్ లాండ్ గిల్లాన్

'నేనేదైనా నేర్చుకోవాలంటే అది పుస్తకాలనుంచే' - అన్నారు అబ్రహామ్ లింకన్

మానవుడి మెదడు మూడు సంవత్సరాల నాటికే తొంభై శాతం ఎదుగుదలలో ఉంటుంది. ఆ వయసు నాటికే పిల్లలు పఠనాశక్తి కలిగి ఉంటారు, అనేక పదజాలాలను కూడా తెలుసుకొని ఉంటారు. ఈ వయసునుండే పఠనాశక్తిని పెంపొందించకపోతే తదుపరి సమయంలో పిల్లలు చదువులో కూడా వెనకబడే అవకాశం ఉంది. అందువల్ల తల్లిదండ్రులు 1-3 సంవత్సరాల లోపలే పిల్లలకు పఠనాశక్తిని కలిగించాలి. ఈ వయసు పిల్లలకు బొమ్మల కథల పుస్తకాలు పరిచయం చేయాలి. చిన్నచిన్న కథలు వినటం ద్వారా అనేక పదాలను నేర్చుకుంటారు. భావోద్వేగాలకు సంబంధించిన అనేక విషయాలను నేర్చుకొంటారు. పిల్లలకు సాహిత్య పుస్తకాలు (పాఠ్య పుస్తకాలు కాదు) అందుబాటులో ఉంటే వారికి చదివే నైపుణ్యం పెరుగుతుంది. పిల్లలు ప్రతిరోజు కనీసం 30 నిమిషాలసేపు వాళ్ళ పాఠ్య పుస్తకాలు కాకుండా ఇతర పుస్తకాలను చదివేటట్లు అలవాటు చేయాలి. ఇలా చేయటంవల్ల మెదడులో వత్తిడి తగ్గి, మానసికంగా ఆరోగ్యవంతులుగా ఉంటారు.

**'ఎక్కువగా చదవటం వల్ల ఎక్కువ విషయాలు తెలుసుకుంటావు, ఎక్కువగా నేర్చుకోవటంవల్ల అనేక ప్రదేశాలకు వెళ్ళగలవు - డా. సూస్**

పిల్లలు మన జాతి సంపద. పిల్లలు మంచి పౌరులుగా ఎదగటానికి మనం అన్ని విధాలుగా కృషిచేయాల్సిన అవసరం ఉంది. వాళ్ళకు మంచి జీవితం ఇవ్వటానికి అవసరమైన వనరులు కూడా సమకూర్చాల్సిన అవసరం మన అందరిమీద ఉంది. పుస్తకాలు చదవటం వల్ల అనేక లాభాలు ఉన్నాయి కనుక వాళ్ళకు చదివే నైపుణ్యాన్ని కలిగించాలి. పుస్తకాలు చదవటమనేది ఒక అలవాటుగా మార్చాలి. గ్రామీణ ప్రాంతాలలో బాలల గ్రంథాలయాలు స్థాపించి పిల్లలకు పుస్తకాలను అందుబాటులో ఉంచాలి.

ఇక్కడ ఇంకో విషయం కూడా మనం గుర్తు పెట్టుకోవాలి. పిల్లలు తమ మాతృభాషా వాతావరణం లోనే ఎదుగుతారు. మాతృభాషలో పొందిన అనుభూతి, ఇతర భాషలలో చదివిన పుస్తకాలలో లభించదు. కాబట్టి ప్రాథమిక స్థాయిలో పరిచయం చేసే పుస్తకాలు, కథలు ఖచ్చితంగా మాతృభాషలోనే ఉండాలి.

'పుస్తకాలు చదవటంవల్ల ఒక విలువైన జీవితం లభిస్తుంది. దీనిని వేరే ఏ మార్గంలోను సాధించలేము' - అన్నారు గార్డల్ హీనాల్

చిన్న పిల్లలు ఉన్న ప్రతీ ఇంట్లో పిల్లల కోసం ఒక చిన్న గ్రంథాలయ(కథల పుస్తకాలు) తప్పక ఏర్పాటు చేసుకోవాలి. ప్రతీ గ్రామంలో పిల్లలకోసం ఒక గ్రంథాలయాన్ని ఏర్పాటు చేయాలి. ప్రతీ పాఠశాలలో గ్రంథాలయాలను ఏర్పాటు చేసి, అవి వినియోగం అయ్యేటట్లు విద్యాసంస్థలు చర్యలు తీసుకోవాలి. పుట్టినరోజు, ఇతర కార్యక్రమాలు నిర్వహించి నపుడు పిల్లలకు బహుమతులుగా కథలు పుస్తకాలు, ఇతర పుస్తకాలు ఇచ్చే అలవాటు చేసుకోవాలి.



అ

Owned, printed & published by Samala Lakshmana Babu (9440448244) and printed at Sri Mahalakshmi Offset Printers, 16-7-20, Veera Raghavulu Street, Sharabu Bazaar, Tenali, Guntur Dist. and published from 8-386, Jivaka Bhawan, Angalakuduru Post, Tenali Mandal, Guntur Dist. - 522211. Editor: Dr. SAMALA RAMESH BABU (9848016136), RNI-APTEL/2015/62362

